# ప్రధానరాజపోషకులు.

[illegible] వేంకటకుమార మ[illegible]
సూర్యారావు బహద్దరువారు శ్రీమహారాజావారు
పిఠాపురము.

,, శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
ఉయ్యూరుద్వారా మెస్సర్సు [illegible] నూజవీడు.

,, శ్రీ రాజా నాయని వేంకట రంగారావు బహద్దరువార
రాజా ఆఫ్ మునగాల.

,, శ్రీ రాజా బలుసు బుచ్చిసర్వారాయఁడు బహద్దరు
కపిలేశ్వరపురము, కేశనకుర్రుమెస్సర్సుజమీందారు
కపిలేశ్వరపురము.

,, శ్రీ రాజా కందుకూరి లక్ష్మీప్రసాదరావు బహద్దరు
జమీందారు ఆఫ్ ఉల్లాం.

,, శ్రీ రాజా సురభి వేంకటరత్నమాంబ నిజాంనవాబ్
వంత్ బహదూర్ రాణీఆఫ్ జటప్రోలువారు,
జటప్రో[illegible]

,, హిజ్ హైనెస్ ది మహారాజా సాహెబ్ పూ
శ్రీజత్ అలకనారాయణగజపతిబహద్దర్ మన్నెసుల్తా
విజయనగరముమహారాజావారు, విజయనగర[illegible]

,, శ్రీశ్రీశ్రీ మహారాజా సర్. వెలుగోటి గోవిందకృష్ణ
యాచేంద్రబహద్దరువారు కె. సి. ఐ. ఇ.
రాజా ఆఫ్ వేంక[illegible]

---

ఆంధ్రప్రచారిణీగ్రంథమాల 64.

# నాయకురాలిదర్పము

## ద్వితీయ భాగము

( చరిత్రాత్మకమైననవల )

గ్రంథకర్త :

చిలుకూరి వీరభద్రరావుగారు



మొదటికూర్పు.

ప్రకాశకులు :

శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము

పిఠాపురము

1930.

 [వెల రు. ౧-౮-౦ లు

# రాజపోషకులు

రా. రా. శ్రీశ్రీశ్రీరాజా వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మ జగ
పతిబహద్దరు జమీందారిణీవారు, తుని.

---

సభ
సవ
ప్రజల

# రాజపోషకులు

మ॥ శ్రీ రాజా ఇనుగంటి వేంకటసూర్యప్రకాశ రావుగారు,
ఉండూరు.

,, శ్రీ కలిదిండి వేంకటరామరాజుగారు, భీమవరము.

,, శ్రీ కొప్పర్తి సూర్యనారాయణ రెడ్డిగారు,
జమీందారు, కాకినాడ.

,, శ్రీ కర్రి చినవేంకటరెడ్డిగారు, మర్చెంటు, కాకినాడ.

,, శ్రీ ముత్యాల సుబ్రహ్మణ్యముగారు, రంగూన్.

,, శ్రీ వనచర్ల సత్తెయ్యగారు, రంగూన్.

,, శ్రీ బత్తుల బసవయ్యగారు, రాజమండ్రి.

,, శ్రీ ఆకారపు వెంకన్నగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ ఆకారపు చెన్నయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ వెలగల గోవిందరాజుగారి కుమారులు వేంకటరెడ్డిగారు,
ఇతిహాసగ్రంథమాలాసంపాదకులు, ఆరవిల్లి.

,, శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావు పంతులుగారు, ప్రొప్రయి
టరు, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ.

---

# పోషకులు

మ. రా. శ్రీ దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమ
నాయఁడుగారు, కాకినాడ.

,, శ్రీ అద్దేపల్లి హరిశ్చంద్రుఁడుగారు, కాకినాడ.

,, శ్రీ వాడ్రేవు వేంకటరత్నము పంతులుగారు, పిఠాపుర

,, శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ ద్రోణంరాజు వేంకటరమణారావు పంతులుగారు,
సాదారు ,తణుకు,

,, శ్రీ బందాసూర్యనారాయణపంతులుగారు బి. ఎ, యల్ టి.
తణుకు.

,, శ్రీ పద్రాజు పేరిరాజుగారు, కాకినాడ,

,, శ్రీ కొవ్వూరి వేంకట రెడ్డిగారు, పిట్టలవేమవరము.

,, శ్రీ కర్రి పల్లారెడ్డిగారు, మారుటేరు.

,, శ్రీ తేతల గంగిరెడ్డి సోదరులు, పెనుగొండ.

,, శ్రీ దివాన్ బహద్దరు పి. పరాంకుశము నాయుఁడుగారు
రిటైర్డు స్పెషల్ పోలీసుకమీషనరు వారు, చెన్నపు

,, శ్రీ అర్జి పెంటయ్యగారు, నరసాపురము.

,, శ్రీ టి. యల్. నరసింహారావుగారు, మారుటేరు.

,, శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, రంగూన్.

,, శ్రీ పులగం వెంకన్నగారు, మారుటేరు.

# ఉపోద్ఘాతము.

———:o:———

మనయాంధ్రభాషయందిట్టియాంధ్రదేశచరిత్రాత్మకము లైన నవలలు చాల తక్కువగానున్నవి. సుప్రసిద్ధము లగునిట్టి చరిత్రములు నవలలరూపమునఁ బ్రకటింపఁబడుటవలన నాంధ్రప్రతిభ వెల్లడియై ప్రజలలో నాత్మగౌరవమును, ఆత్మాభివృద్ధియు, ఆంధ్రదేశభాషాభిమానమును వర్ధిల్లుట కనుకూలముగా నుండును. ఈనవలను ప్రసిద్ధచరిత్రపరిశోధకులలో నగ్రగణ్యులును, భాషావిశారదులు నగుమహారాజశ్రీ చిలుకూరివీరభద్రరావుపంతులుగారు రచించి కాకినాడ సుజనరంజనీముద్రాక్షరశాలాధికారులగు మ. రా. రా. శ్రీపోతాప్రగడ బ్రహ్మానందరావుపంతులుగారికి సర్వస్వాతంత్ర్యములతోఁ బ్రకటించుకొనుటకై యిచ్చివైచిరి. శ్రీబ్రహ్మానందరావుగారు తమకీగ్రంథప్రకటనమునందుఁగల సర్వాధికారములను మాఆంధ్రప్రచారిణీగ్రంథనిలయమునకుఁ బరివర్తింపఁజేసి దీనిని మాగ్రంథమాలికయందు సర్వస్వాతంత్ర్యములతోఁ బ్రకటించుకొనుటకు దయచేసియున్నారు.

ఈనవల పల్నాటివీరులచరిత్రముతో సంబంధించినది. ఈవీరచరిత్రమును గవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడు పాడుట కనుకూలమగుమంజరీవృత్తముతో రచించెను. దీనిని బొబ్బిలిపదమువలెనే వీరావేశముతోఁ బాడుచు జనులలో నుత్సాహము గల్పించు వీరగాయకు లనేకు లాప్రాంతమందున్నారు. చరిత్రపరిశోధకులగు శ్రీవీరభద్రరావుగా [illegible]కాలమునందు బౌద్ధజైనమతములు [illegible] శైవవైష్ణవమతములుగా [illegible] [illegible] వైష్ణవమతముల పరస్పరవిభేదములు పల్నాటిరాజ్య[illegible] బౌద్ధమతవినాశమునకును

నెట్లు కారణములయ్యెనో యీనవలయందుఁ జక్కఁగా నిరూపించి
నారు. ఆంధ్రికథాశిల్పకమగు నీనవల యాపాతమనోహరమై యఖి
లాంధ్రజనాదరణీయమై యున్నది.

మాగ్రంథనిలయమునకు జగత్ప్రసిద్ధచరిత్రకారులును, దేశభా
షాభిమానులును, సుప్రసిద్ధకవులును, సకలాంధ్రజనగౌరవాభిమాన
పాత్రులు నగు మ. రా. రా. శ్రీ చిలుకూరి వీరభద్రరావుపంతులు
గారిచే రచియింపఁబడిన యీయాంధ్రదేశచరిత్రాత్మకమగు నవలను
బ్రకటించు భాగ్యము లభించినందుకు మేమానందించుచున్నాము. ఇట్టి
యవకాశమును మాకుఁ గల్గించిన మ. రా. రా. శ్రీ పోతాప్రగడ
బ్రహ్మానందరావు పంతులుగారికిని, గ్రంథకర్తలకును మాకృతజ్ఞతాభి
వందనము లర్పించుచున్నాము.

చిరకాలమునుండి భాషాసేవసేయుచున్న మాగ్రంథనిలయము
నాదరాభిమానము బూని సహాయప్రోత్సాహములం గూర్చుచున్న
మాచందాదారులకును, పోషకులకును, మహారాజపోషకులకును,
ఉపాధ్యాయులకును, విద్యాశాఖాధికారులకును మేమెంతయుఁ గృత
జ్ఞులమై యున్నారము.

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము, } వేంకటపార్వతీశ్వరకవులు.
పిఠాపురము. } 14-4-30.

# నాయకురాలిదర్పము

## ద్వితీయ భాగము



### మొదటిప్రకరణము.



మాచర్లకూడ గురజాలవలెనే రాజధానియై సర్వవిధముల స్వాతంత్ర్యముం గాంచియుండుట నాయకురాలికిఁ గంటిలోఁ గంటకమువలె నుండెను. ఆమెకు రాజకుటుంబముతో నంతప్రసక్తి లేదు. నలగామరాజే సర్వాధికారియై కుటుంబమంతయు నాతని సేవించుచుండవలయు ననియే యుద్దేశము. అందామెకుఁ గొంచెము స్వార్థపరత్వమున్నది. నలగామరాజామెను బ్రత్యక్షదైవతముగాఁ జూచుకొని యామెగీచినగీటుదాఁటక ప్రవర్తించుచుండెను. అందువలన రాజ్యమంతయు నామె చేతులలోనే యుండెను. ఆమెకు బ్రహ్మనాయఁడొక్కఁడే ప్రతిద్వంద్వియై యుండెను. అతని నసహాయునిం గావించి నిర్జింపవలయుననియే నాయకురాలు దర్పించియుండెను. ఆకారణము చేతనే మలిదేవరాజునకు మాచర్లసీమ నొసంగుట యామె కిష్టము లేక పోయెను.

కాని యింతవఱ కామెయుద్దేశము లేవియు నించుకంతయును ఫలింపలేదు. అంతేకాక యామెప్రయత్నము లన్నియును వ్యతిరేక

ఫలములనే కల్పించెను. ఏకరాజ్యమున దనతో సమానముగ మంత్రియై, సమానప్రతిద్వంద్వియైయున్న బ్రహ్మనాయఁ డిప్పుడు భిన్నరాజ్యమున సర్వాధికారములును గల ప్రధానామాత్యుఁడై యుండుట యామెకు దుస్సహముగా నుండెను. అతని నెట్లయిన నధోగతునిం గావింపవలయుననియే యామె దీక్ష వహించియుండెను. ఆకార్యమును సాధించువిషయమునందు రాజ్యమేమైనను, రాజకుటుంబమున కెట్టి విపత్తు తటస్థించినను, బ్రజలకెట్టియుపద్రవములు కలిగినను నామె యించుకంతయును లక్ష్యము చేయుటలేదు. తనకార్యసిద్ధికొఱకామె యెట్టి నీచకృత్యమునైనను గావించుటకు సిద్ధపడియుండెను. ఆమెరాజ్యతంత్రమునకు ధర్మాధర్మశంక యొంతమాత్రమును లేకుండెను.

నాయకురా లట్లు ప్రతాపరెడ్డితో మంత్రాలోచనము గావించి యొకకపటతంత్రమును బ్రయోగించి మాచర్లరాజ్యప్రాసాదమును గూల్చివేయవలయు నని సంకల్పించుకొని యామె నలగామరాజునొద్దకుం బోయి యమాయకుఁడును, స్వాధీనుఁడును, దూరదృష్టివిరహితుఁడును నగునాతని నెల్లవిధముల వశపఱచుకొని యాతనికనేకవిధముల బోధించి నచ్చచెప్పి సర్వతంత్రస్వతంత్రురాలై తానే యొకలేఖ నాతనిచే వ్రాయించి యొకయుద్యోగిచే దానినిమాచర్లకుఁ బంపించెను.

మాచర్లలో పెదమలిదేవభూపతి సింహాసనాసీనుఁడై కొమ్మరాజు మొదలుగాఁగల బంధువర్గమును, బ్రహ్మనాయుడు మొదలుగాఁగల మంత్రివర్గమును, కనమదాసు మొదలుగాఁగల సేవకవర్గమును, బాలచంద్రుఁడు మొదలుగాఁగల వీరవర్గమును దన్నుఁ బరివేష్టించి కొలువఁ గొలువుదీర్చి యుండెను. ఇంతలో ద్వారపాలకుఁ డేతెంచి గురిజాలనుండి యొకయుద్యోగి దేవరదర్శనార్థమై యేతెంచె నని మన

విచేసెను. రాజాతని వెంటఁబెట్టుకొనిరమ్మని యాజ్ఞాపించెను. వెంటనే ద్వారపాలకుఁడుపోయి యాయుద్యోగిని కొలువుకూటమునకుఁ దోడ్కొనివచ్చెను. ఆయుద్యోగివచ్చి మహారాజునకభివాదనంబు గావించి తాను దెచ్చిన యొకలేఖను మంత్రియగు బ్రహ్మనాయని కందించెను. బ్రహ్మనాయఁడాయుత్తరమును విచ్చి యాసాంతముగఁ జదువుకొని తనలోఁ దాను నవ్వుకొనుచుండెను.

అది చూచి కొమ్మరాజు "మంత్రిశేఖరా! ఇట్లు మీలోమీరు నవ్వుకొనుచున్నారేమి? అందలివిశేషములేమి" అని ప్రశ్నించెను.

బ్రహ్మ—ఏమియులేదు. ఇదియొక యాహ్వానపత్రిక!

కొమ్మ—అలాగా? ఎవరుపంపినారు?

బ్రహ్మ—పల్నాటిప్రభువైన నలగామరాజుగారు పంపించినారు!

ఆమాట విని రాజైన పెదమలిదేవభూపతి యాత్రముతో "నాయఁడా! మాయన్నగారాహ్వాన మంపించినారా? గురిజాలలో నిప్పుడేశుభకార్యము జరుగనైయున్నది?" అని ప్రశ్నించెను.

బ్రహ్మనాయఁడు నవ్వుచుఁ "ప్రభూ! ఈయాహ్వానము శుభకార్యముకొఱకుఁగాదు" అనియెను.

రాజు—మఱియెందుకొఱకు?

బ్రహ్మ—కోడిపందెములకొఱకు.

రాజు—(నవ్వుచు) మాయన్నగారికిఁ గోడిపందెము లనినఁ జాల సంతోషము. చూచుటకు రమ్మని లేఖవ్రాసినారా?

బ్రహ్మ—చూచుటకుఁ గాదు. పందెములాడుటకే.

రాజు—(ఆశ్చర్యముతో) ఆడుటకా? ఆలేఖ యెవరికి వ్రాసినారు?

బ్రహ్మ — దేశములోని ప్రభువులకందఱికినిగూడ వ్రాసి యున్నది.

అప్పుడు కొమ్మరాజు బ్రహ్మనాయనింగాంచి "మనప్రభువు గారిపేరు నందున్నదా ?" అని ప్రశ్నించెను.

బ్రహ్మ—లేదు. ఇది ప్రకటనపత్రికవలె నున్నది. నలగామ రాజుగారి ముద్రకూడ నున్నది. కానియిందే ప్రభువు పేరునుగూడ లేదు. అందుకే నాకు నవ్వువచ్చినది.

అనుటయు నాతనిసమీపమునఁ గూర్చుండి యున్న బాలచంద్రుఁడు "నాయనగారూ ! దీనికి మీరు నవ్వుకొను టెందులకు ! ఈ పల్నాటిసీమకంతకును నలగామరాజుగారే ప్రభువై యున్నప్పుడు మన రాజుగారేదేశమునకుఁ బ్రభువని యాతని పేరుపెట్టి యాహ్వానించు ను ?" అనియెను.

ఆమాటవిని కొమ్మరాజు ముక్కుపై వ్రేలు వైచికొని "బాల చంద్రుఁడు కుఱ్ఱవాఁడైనను బ్రతిపక్షులభావమును చక్కఁగనే గ్రహించినాఁడు. ఇది యంతయును జూడఁగా నాయకురాలు పన్నిన కపట తంత్రముగా నగపడుచున్నది" అనియెను.

బాలు—నిజమే. కాకయున్నచోఁ బల్నాటిలోని మాచర్లసీమను దమ్ములకుఁ బంచియిచ్చిన నలగామరాజు పల్నాటిసీమకంతకును దానే ప్రభువు నని యెట్లువ్రాసికొనును ?

కొమ్మ—అవును. ఇది యంతయును నాయకురాలితంత్రమే. సందేహము లేదు. నలగామరాజు నాయకురాలిచేతిలోని కీలుబొమ్మ. ఆతంత్రజ్ఞురాలీరాజ్యము మనకెన్నటికిని దక్కనీయదు.

రాజసంభాషణములన్నియు నాలకించి విస్మయముతో "నా యనా! అన్నగారు రాజాహ్వానపత్రికను దేమి వ్రాసినారో చదివి

వినిపింపుము ! అందు రహస్యవిషయము లింకేవియును లేవుగద !”
అనియెను.

బ్రహ్మ—ప్రభూ ! దేశదేశములయందలి ప్రభువులకందఱకును గూడ వ్రాసిపంపినట్లున్న యీ లేఖయందు రహస్యము లేముండును ! ఇదిగో చదివెదను చిత్తగింపుఁడు.

అని బ్రహ్మనాయఁ డాయుత్తరమును గంభీరస్వరముతో నిట్లు చదివెను :—

ఆహ్వానపత్రిక.

పల్నాటిప్రభువైన శ్రీశ్రీనలగామరాజుగారు తెలియఁజేయునది యేమనిన :—

ఈయేఁడు సంక్రాంతికనుముపండుగనాఁడు మాగురిజాలపుర మునఁ బూర్వముకంటె మహావైభవముతోఁ గోడిపందెములు జరుగఁ బోవుచున్నవి. పౌరుషముగల మేటిపందెగాండ్రందఱును పౌరుషము గల తమతమకోడిపుంజుల నిటకుఁ దీసికొని వచ్చి పందెములను జరి పించి దేశమునందుఁ బౌరుషమును బెంపొందింపఁ గోరుచున్నాము. మఱియు మానధనులైన మహారాజులును, ప్రభువులును, సామంతులు ను, “కోడిపోరుకంటె బౌరుషమును వర్ధిల్లఁ జేసెడు ఘనకార్యము మఱియొకటిలేదు” అను వచనమును సప్రమాణముగ నిరూపించి దేశ మునందుఁ బౌరుషమును నిలుపఁగోరుచున్నాము.

ఇట్లు పల్నాటిప్రభువు
శ్రీ నలగామరాజు.

బ్రహ్మనాయఁ డిట్లు చదువుటయు కొమ్మరాజించుక విరక్తిని సూచించుస్వరముతో “ఈపత్రిక నిజముగాఁ దనసాటివారును, దన కంటె గొప్పవారునగు మహారాజులనందఱ నాహ్వానించుటకే వ్రాయ

బడినవి యైనయెడల నిందు “తెలియఁజేయునదియేమనిన—” అని వ్రాయుట మరియాద గాదు. కావున నిది కేవలము మనకుమాత్రమే వ్రాయఁబడినదై యుండవలయును” అనియెను.

కొమ్మరాజిట్లు విమర్శనము గావించుటనాలకించి బాలచంద్రుఁడు తీవ్రస్వరముతో “ఔను. ఇది తప్పక మనలను పరిభవించుటకే పంపఁబడినది. కాకున్నచో గురిజాలకు వచ్చి పౌరుషముతో కోడి పందెము లాడువారుమాత్రమే పురుషులనియు, నట్లు వచ్చి పందె మాడనివారందఱును నాఁడువారనియు ధ్వనింపఁజేయు నీయాహ్వాన పత్రికను కోడితోఁ దలఁగోకికొన్నట్లు దేశమునందలి యెల్లరాజుల కును బంపి వారితో నూతక పోరాటము పెట్టుకొనుటకు నలగామ రాజు వెఱ్ఱివాఁడైనను నాయకురాలుకూడనజ్ఞానురాలగునా?” అనెను.

అని బాలచంద్రుఁడు గంభీరవచనంబులతోఁ బ్రస్తావించుటయు కొమ్మరాజుతనయుఁడును, నలగామరాజున కల్లుఁడు నగుఅలరాజు చిఱునవ్వుతో “ఇందింకను విశేషార్థమున్నది. మామామగారు పల్నా టిసీమకంతకును దానే ప్రభుండ ననియు, మఱియొకరు గారనియు దేశ మునందలి మహారాజులందఱకు నీలేఖామూలమున దెలియఁజఱచుమ న్నట్లుగూడ నగపడుచున్నది. ఈదురాలోచనమో, దూరాలోచన మో నాయకురాలిదే గాని నలగామరాజుదనుట కెంతమాత్రమునవ కాశము లేదు” అనియెను.

వారిమాటలన్నియు నాలకించి మలిదేవరాజు సభాసదులగు బంధుమిత్రామాత్యులనందఱింగాంచి శాంతగంభీరస్వరముతో “ఈ యాహ్వానపత్రరచనయందు మీయూహాల కన్నిటికి నవకాశమున్నది. ఇది యెట్టియుద్దేశముతో వ్రాసిన మనకేమి? ఇది పూజ్యులగునన్న గారు వ్రాయించినట్లగపడుచున్నది. వారియాజ్ఞ నిర్వర్తించుట మన

కవశ్యకర్తవ్యము. కావున మనము తప్పక గురిజాలపోవలయును. అదిగాక పౌరుషముతోఁ బందెమునకుఁ బిలిచినప్పుడు పోకుండుటకంటె నవమాన మింకేమున్నది? మానవంతున కవమానమును భరించి బ్రదుకుటకంటెఁ బౌరుషముతోఁ జచ్చుటయే యుత్తమకార్యముగదా!'' అనియెను.

బ్రహ్మనాయఁడును బ్రభువునుద్దేశముతో నేకీభవించి "రాజేంద్రా! బాగుగ నాలోచింపఁగా నిదియంతయు మనమేలుకొఱకే వచ్చినది. ఈయాహ్వానపత్రము నలగామరాజు వ్రాసినను, నాయకురాలే వ్రాయించినను వారిరువురును మనకుపకారులే యైనారు. నలగామరాజు కోడిపందెమన్నఁ జెవిగోసికొనును. అతఁడాపందెమునందు రాజ్యమునైన నొడ్డుటకు వెనుదీయువాఁడు గాఁడు. మనముమాత్రము కోడిపందెములు చేఁతగానివారమా? ఇది మంచిసమయము. ఈసమావేశమునకు దేశమునందలిరాజు లందఱును వచ్చెదరు. వారితో మనము స్నేహము చేసికొని వారిని మనపక్షకాకర్షించుకొనవచ్చును. మనకు సేనలంతవిశేషముగా లేవు. పందెములలో గెలుపు నిలుపుకొనుటకైనను, ప్రాంతప్రభువుల స్నేహసాహాయ్యములం గాంచి బలపడుటకైనను నిదియే యనుకూలసమయము. ఏది యెట్లు జరుగునదియు వారివారియదృష్టముపై నాధారపడి యుండును" అనియెను.

అప్పుడు కొమ్మరాజు బ్రహ్మనాయనిం గాంచి "నాకొక్క శంక తోఁచుచున్నది. ఇట్టిజూదములును, బందెములును, దుర్వ్యసనములలోనివి. ప్రాజ్ఞులగువారెన్నఁడును వీనివైపులకుఁ బోఁగూడదు. ఇట్టివానివలన లేనిపోనికలహములు గలుగకమానవు. మనరాజును నలగామరాజును నెంతయన్నదమ్ములైనను గాలకారణవశంబున నను కూలస్థితియందు లేరు. మనకును వారికిని నడుమఁ బచ్చిగన్నివైదిన

భగ్నమని మండిపోవుచున్నది. ఈయంతఃకలహము లోక్కసారిగా బహిర్గతములైనచో నిఁక మనమాఁపఁజాలము. బాగుగ నాలోచించి మఱి పని చేయవలయును'' అనియెను.

బ్రహ్మ—అందుకొఱకు మీ రెంతమాత్రమును భయపడవలదు. భయపడుట పౌరుషము గాదు. సమానులగువారు కోడిపందెములాడరమ్మని యాహ్వానించినప్పుడు పోకుండుట యవమానము గాదా. వీరులను శిక్షించి యుత్సాహమును బురికొల్పి ప్రసిద్ధులనుగాఁ జేయుటకు కోడిపందెములే గురుకులములవంటివి. అందు మన పౌరుషమును, వారిపౌరుషమును దేటపడఁగలదు. అదృష్టమున్నచో నందువలన లాభముకూడఁ గలుగవచ్చును.

అనుటయు అలరాజు మృదులస్వరముతో ‹‹ నాయఁడు గారూ! మా నాన్నగారు చెప్పినవిషయముకూడ నించుక యాలోచింపవలయును. ఈకోడిపందెములమూలమునఁ బరస్పరకలహములు పెరుగక మానవు. ముక్కడిమీఁక చెప్పినట్లు వినదు. ఆకోడిపోరువలన నుభయులకును బోరాటము పొసఁగినచో నప్పుడెవ్వరిచేగూడ వారింపఁజాలము. మీరు దూరమాలోచించి కార్యాచరణమునకుఁ గడంగవలయును '' అనియెను.

బ్రహ్మనాయఁ డించుకనిరుత్సాహమును సూచించుస్వరముతో ‹‹ మనమందఱమును మనకుఁదోచిన విషయములను దెలిపితిమిగదా. ఇఁకఁ బ్రభువువారేమి సెలవిచ్చెదరో వారియాజ్ఞననుసరించి పోవుదము. '' అనియెను.

అప్పుడు మలిదేవరాజు శాంతగంభీరస్వరముతో ‹‹ సభాసదులారా! కోడిపోరు మానవులపౌరుషమును వర్ధిల్లఁజేయుటకు లక్ష్యభూతమైనది. అట్టికోడిపందెములవలననే మనసైనికులందఱును మహా

## మొదటి ప్రకరణము

పీవుతై మనపక్షమునఁ జేరియున్నారు. సరివారు పోరికిఁ బిలిచినను పొందునకుఁ బిలిచినను పోకుండుటకంటె నవమానమును, నగౌరవమును వేఱొకటి లేదు. అన్నగారు మనలను గోడిపందెముల కాహ్వానించినప్పుడు మనమేల పోఁగూడదు ? మనకున్న భయము వారికిమాత్ర మేల లేకపోవలయును ? వారే పౌరుషవంతులా ? మనము కామా ? ఇఁక నీవిషయమున నెట్టిసంశయములును బెట్టుకొనుటమంచిది కాదు. ఎవరియదృష్ట మెట్లున్నదో యట్లు గాక మానదు. కయ్యమునకుఁ గాలుద్రవ్వినట్లుగా వారు మనలను బిలిచినప్పుడు పౌరుషముతో మనము పోవలసినదే. పాపమైనను, బుణ్యమైనను పందెమాడవలసినదే. కాని వెనుదీయుటంతమాత్రమును బౌరుషలక్షణము గాదు ” అని తీర్మానించెను.



## రెండవ ప్రకరణము.

ఈకోడిపందెములప్రకటన మితరరాజ్యములకుఁ బంపఁబడియుం డలేదు. ఇది కేవలము నాయకురాలిదుస్తంత్రమువలన నేర్పడినది గావున గురిజాలకును మాచర్లకును రెండామడల దూరములోపల నున్నగ్రామములలో బ్రకటింపఁబడెను. కోడిపందెము లన్న బ్రహ్మ నాయుఁడు చంక లెగురవేయునట్టి స్వభావము గలవాఁడు. అదియును గాక యాతఁడు పల్నాటిరాజ్యము నలగామునిచే నొడ్డుగాఁ బెట్టించి సులువుగా గెల్చుకొనవచ్చు ననుదురాశచే పీడింపఁబడు మనస్సు గల వాఁడై యుండెను. మఱియు గడువుకాలముగూడ సమీపించి యుం డెను. అందువలన నాయకురాలిదుస్తంత్రము దెలిసియుఁ దెలియని వానిభంగి బ్రవర్తింపవలసినవాఁ డయ్యెను. అతనిగర్వసంరంభమునకుఁ దోడ్పడునదిమఱియొకవిషయము గలదు. అతఁడు పెంచుకోడిపుంజులతో దీటువచ్చుపుంజులు పల్నాట లేవనియే యాతనిదృఢవిశ్వాసము. దీని రహస్యము నంతయుఁ గనుపెట్టి పందెములకుఁ బోవలదని యెన్నెన్నో హితవులు గఱపి గోవిందభట్టాచార్యుఁడు వారింపఁజూచినను నాయుఁడు వినఁడయ్యెను.

జూద మాడవలదని విదురుఁడు తన కెంత బోధించినను మున్ను ధర్మరాజు వినఁగలిగెనా ? ఇట్టిదుర్వ్యసనములలోఁ దగుల్కొన్నవా రికి భాగ్యభోగము లెక్కడ ? సుఖసంతోషము లెక్కడ ? శకుని కపటద్యూతము ముందు జరుగఁబోవుమహాభారతయుద్ధమును సూచిం

చినట్లు పల్నాట నాయకురాలు గల్పించిన యీకపటపుపందెముల చేతనే ముందు జరుగఁబోవుపల్నాటివీరయుద్ధము సూచింపఁబడుచున్న దని పల్నాటిపెద్దలు తలంచుచుండిరి.

ఇంతలో సంక్రాంతిపండుగ వచ్చెను. కొంచె మించుమించుగా మాచర్లకు గురిజాల యేఁబదిక్రోసులవరదూరమున నున్నను, అత్యుత్సాహావేశపరవశుఁడై బ్రహ్మనాయుఁడు బలిష్ఠము లయినపెంపుడుకోడిపుంజులతో సపరివారముగ బయలువెడలి కనుముపండుగ నాఁటి మట్టమధ్యాహ్నమునకు గురిజాలమైదానమునకు వచ్చి చేరెను. అచ్చట పదివేలజనము పట్టఁగలిగిన యొకగొప్పపందిరి వేయఁబడి పచ్చనితోరణములతో నలంకరింపఁబడియుండెను. చుట్టుపట్టుల గ్రామాదులనుండి జనులుపందెములను గాంచి వినోదించుటకై మూకలు మూకలుగ బయలుదేఱి నలుప్రక్కలనుండి వచ్చుచుండిరి. గురిజాల మైదాన మంతయుఁ గ్రిక్కిఱిసి పోవుచుండెను. పరదేశములనుండి ప్రభువు లెవ్వరును రా లేదని మాచర్లవారు దెలిసికొనిరి.

అప్పుడు ప్రతాపరెడ్డి యొకపెద్దకోడిపుంజును బలిష్ఠములైన కాళ్లచే నొప్పుచున్నదానిని, అత్యంతమైనసౌందర్యముచే మెఱయుచున్నదానిని చేతఁ బట్టుకొని పొట్ట కానించుకొని "ఇదిగో నాకోడి; గురిజాలకోడి; ఎట్టిపందెమునైన గెల్పింపఁగలకోడి; పల్నాటినాయకురాలిచే మెచ్చుగన్నకోడి; అనేకయుద్ధములలో గెల్పుగొన్న కోడి; దీనిపేరు పుంజులమారిగాఁడు. కదనరంగమున దీని నిలువఁబెట్టిన మాచర్లపుంజులు తోఁకలనుదెంచుకొని, సిగ్గును దిగఁద్రావి జనులెల్లనుఁ బకపకనవ్వఁ బఱువెత్తవలసినదే. పెద్దపందె మొడ్డినఁగాని దీని విడువఁజాలము" అని దంభోక్తులాడుచు కరవళ్లు ద్రొక్కుచు నటునిటుఁ దిరుగాడుచుండెను.

ఇట్లుపరిమితానందపరవశుఁడై తిరుగాడుచున్న ప్రతాపరెడ్డినిఁ గాంచి రంగానాయుఁడు "మిత్రుఁడా! క్షేమమా?" అనిపలుకరించెను

ప్రతా—మాగురిజాలమల్లన్న క్షేమముగా నున్నంతవఱకు నాకూ నాకోడిపుంజులకూ కూడ క్షేమమే?

రంగా—నీక్షేమ మడిగినాను కాని నీకోడిపుంజులక్షేమ మడుగలేదు. ఒక్కప్రశ్నకు రెండుజబాబులా? నీకూ నీకోడిపుంజులకూ నడుమ గురిజాలమల్లన్నప్రశంస దేనికి? గురిజాలమల్లన్న కెప్పుడూ పేగిలేదే? అవుడు గాని యితరరాజ్యాధిపతు లెవ్వరును రాలేదేమి?

ప్రతా—పిలువనిపేరంటమున కెవ్వరయిన వత్తురా? మాచర్ల ప్రభుబృందముతో పురుషావతంసుఁడు కోడిపందెముల మొనగాఁడు బ్రహ్మనాయుఁ డొక్కఁడే కుక్కుటకదనరంగమునకు దిగినాఁడు చాలఁడా?

రంగా—ఏమిటో! నీభాష నాకు బోధపడదు. మీగురిజాల పుంజు లన్నిటికీ మాబ్రహ్మనాయునిపుంజు దీటువచ్చునదనియా నీ యభిప్రాయము? అట్లయినయెడ నాకు పరమసంతోషము.

ప్రతా—గురిజాలపుంజులమాట యెందుకు. నాపుంజులమారి గాని ముందు బ్రహ్మనాయునిపుంజు నిలువంబడఁగలదా? "కొ.కొ.కొ. కో" అని కూఁతలిడుచు పఱువెత్తకుండునా?

రంగా—నీమాటలు సారకాయకోఁతల వంటివి. రణరంగమున నీపుంజులమారిగాని ప్రతాపమును నీప్రతాపమును జూచుటకే గదా మందలను తరలించుకొని వచ్చినది. ఇంతలోనే యింతయెగిరిపా టెందుకు?

ప్రతా—నేఁటితో మాచర్లరంగు తేలిపోతుంది. పల్నాటిరాజ్య మేకమైపోతుంది. అందు కేయీ యెగిరిపాటు.

రంగా — నేఁటితో గురిజాల పేలిపోతుంది. పల్నాటిరాజ్య
మేకమై పోతుంది. అందుకే కూడదీమొగిరిపాటు.

వీరిట్లు సంభాషించుకొనుచుండఁగా నలగామరాజు నరసింగ
రాజు మొదలుగాఁ గలసోదరవర్గముతోడను, నాయకురాలు మొదలు
గాఁ గలమంత్రివర్గముతోడను, వీరారెడ్డి మొదలుగాగలరెడ్డిసేనానుల
తోడను, విజయంచేసెను. ఇదివఱ కేర్పాటు చేసినప్రకారము మా
చర్లప్రభువు లందఱు నొకప్రక్కను, గురిజాలప్రభువు లందఱును వారి
కెదురుప్రక్కను గూరుచుండిరి. మాచర్లప్రజలు మాచర్లప్రభువుల
వెనుకతట్టునను, గురిజాలప్రజలు గురిజాలప్రభువుల వెనుకతట్టునను
గూరుచుండునట్లు గావించిరి. అలిపిరిజనమంతయుఁ బందిరిచుట్టును
మూఁగిరి. గురిజాలవారికి మాచర్లవారికి నడుమ నొకమూల నెల్లవా
రికిఁ గన్పడున ట్లెత్తుగా రంగవేదిక నిర్మింపఁబడినది. అల్లరులు జరుగ
కుండ నందందు రక్షకభటుల నుంచిరి.

అప్పుడు నాయకురాలు రంగవేదికపై నెక్కి నలువంకలు
గలయంజూచునప్పటికి సభాసదనమంతయు నిశ్శబ్దముగా నుండెను.
అంత నామె బ్రహ్మనాయునిదిక్కునకుఁ దిరిగి గొంతెత్తి “అయ్యా!
బ్రహ్మనాయుఁడుగారూ! ఇతరదేశాలవా రెవ్వరును వచ్చినట్లు కన్ప
డదు. ఎటుచూచినను గురిజాలవారు, మాచర్లవారు మాత్రమే కను
పట్టుచున్నారు. ఏమి చేయనగునో సెలవిండు.” అని హెచ్చరిం
చెను.

అందులకు బ్రహ్మనాయుఁడు లేచి “ఈప్రదేశములయం దితర
దేశాలవారికి శ్రద్ధ తక్కువ. అయినను సకాలములో బయటివారం
దఱకు తెలిసినట్టు కన్పట్టదు. రెండునెలలు గడపుగా వారి కాహ్వానప
త్రికలంపియున్న మొకల పెక్కురు వచ్చియుందురు. మించినదానికి

మన మిష్టము చేయున దేమియు లేదు. దానినిగూర్చి ముందు విచారింపవచ్చును. ఇప్పుడు వచ్చినమనమే పందెములు మొదలుపెట్టుదము." అని ప్రత్యుత్తర మిచ్చెను.

"ఇతరదేశాలమాట యటుండనిండు. గోడిపందెములయందు బ్రహ్మనాయునిగారి కున్నంతశ్రద్ధ మాకుఁగూడ లేదు. ముందునుండి బ్రహ్మనాయుఁడుగారే యీభారము పైనిఁబెట్టుకొని పందెములు సాగించినయెడల చాలఖ్యాతి సంపాదింపఁగలరు. దేశములోఁ బౌరుషము పెంపొందింపఁగలరు." అని నాయకురాలు మరల హెచ్చరించెను.

"అట్లేచేయవచ్చును. ఈభార మంతయు ముందుసంవత్సరమునుండియు నేనే పైనిఁబెట్టుకొని యాహ్వానముల యేర్పాటంతయు నేనే వహించి యిచ్చటనే పందెములు జరిపించుటకుఁ బ్రయత్నించెదను." అని బ్రహ్మనాయుఁడు బదులుపలికెను.

"ఎక్కడ జరిపిన నేమి? మాచర్లలో జరిపినా నాకిష్టమే. అదిమాత్రము మనది కాదా?" అని నాయకురాలు మైత్రి నెఱపుచుఁ బలికెను.

ఈకడపటిమాటలు విని పెదమలిదేవరాజు బ్రహ్మనాయునితో రహస్యముగా "చూచినారా? ఈపందెములమూలమున మనకు స్నేహభావ మెట్లు కుదురుచున్నదో" అని పలికెను.

"అవును. ఈమాట నిన్నను నేను చెప్పియుండలేదా? మన కొమ్మరాజుగారుమాత్రము దీని నొప్పుకొనలేదు" అని బ్రహ్మనాయుఁడు బదులుచెప్పెను.

అందుకు మొగము చిట్లించుకొని కొమ్మరాజు "నాయుఁడుగారూ! మీ రేమనుకొన్నా సరే గాని నాకుమాత్రము నాయకు

రాలిమాటలలో స్నేహభావ మెంతమాత్రము సూచింపఁబడుచుండ లేదని తోఁచుచున్నది. 'మాచర్లమాత్రము మనదిగాదా?' అని ప్రశ్నించుటలోనే యెంతో గూఢార్థము స్ఫురింపుచున్నది." అని యెను.

"దూరదృష్టి మంచిదే గాని అనుమానముమాత్రము చెడ్డది." అని బ్రహ్మనాయుఁడు పలుకఁగా 'చెడుకాలమున కిట్టిబుద్ధులే' అని కొమ్మరాజు నెమ్మదిగ వచించెను.

అంత సభావేదికపై నిలువంబడి యున్ననాయకురాలు రెండు పక్షములవారి కిష్టుఁడగు వానిని, లేశమాత్రము సంశయింపక న్యాయము చెప్పువానిని మధ్యవర్తిగా నెన్నుకొనుట అత్యావశ్యకమును ధర్మము నై యున్నది. ఇందు కుభయపక్షములవారి కిష్టుఁడును, బంధువును ధర్మతత్పరుఁడు నగుఅలరాజు మధ్యవర్తిగ నుండుట కర్హుఁడని నాయభిప్రాయమని తెలుపుచు మీయభిప్రాయములను దెలుపుఁడని కోరెను.

అందుమీఁద నలగామరాజు 'అలరాజే మధ్యవర్తిగ నుండఁదగినవాఁ' డని వక్కాణించెను.

"మాకందఱకు నంగీకారమే" యని మాచర్లవారిపక్షమున బ్రహ్మనాయుఁడు లేచి విస్పష్టముగా వక్కాణించెను.

అందఱును దమతమయంగీకారములను దెలుపువిధముగాఁ గరతాళధ్వనులను గావించిరి. అంత నాయకురాలు రంగవేదికనుండి దిగివచ్చి తనస్థానమునఁ గూరుచుండెను.

"నాన్నగారూ! ఇదేదో పెద్దయెత్తుగడగాఁ గన్పట్టుచున్నది. ఈసభలో మీవంటిపెద్ద లెందఱో యుండఁగా నావంటియువకుని, లోకజ్ఞానము చాలనివానిని మధ్యవర్తిగా నెన్నుకొనుటచూడఁ దలకుఁదగనిభారము నాతలపైఁ బెట్టిన ట్లగుచున్నది. ఇందుకు మీయభిప్రాయ

మేమో వినఁగోరుచున్నా" నని తనతండ్రి యగుకొమ్మరాజును జేరి అలరాజు మనవి చేసెను.

"ఏమయినఁ గానిమ్ము. ఉభయపక్షములవారు నీయందు విశ్వాసము గలిగి నిన్నుఁ బెద్దచేసి మధ్యవర్తిగాఁ గోరుకొన్నప్పుడు కాదనుట నీతిధర్మములకు విరుద్ధము. అంగీకరించి న్యాయము చెప్పుము" అని కొమ్మరాజు పుత్రుని కాజ్ఞాపించెను.

ఇట్లలరాజు తండ్రిచే ప్రబోధితుఁడై సంశయము తక్కి ధైర్యముఁ జిక్కఁబట్టి లేచి యమ్మహాసభలోఁ గరతాళధ్వనులు చెలరేఁగుచుండఁ బోయి రంగవేదికపయి కెక్కి యుభయపక్షములవారినిఁ గలయం జూచి "అయ్యలారా! వయస్సునఁ జిన్నవాఁడ నయ్యును, ఉభయ పక్షములవారికి హితుఁడ నగుటచే నన్నుఁ బెద్దచేసి న్యాయము చెప్పు మని మధ్యవర్తిగఁ గోరుకొన్నప్పుడు కాదనుట తప్పుగాఁ దలఁచి యందు కంగీకరించితిని. మీరందఱు న్యాయబుద్ధితో నాకుఁ దోడ్పడినయెడల నాధర్మమును నేను సవ్యముగా నెఱవేర్పఁగలుగుదు నని మీకెల్లరకు మనవిచేయుచున్నాను. ఇఁక మీరాయుభయపక్షములవారును చెఱియొక ప్రతినిధిని నిర్ణయించుకొని వారిమూలమున పుంజు లను పందెమునకు విడువుఁడు" అని హెచ్చరించి తనకై యేర్పాటు చేసిన యాసనముపై నధిష్ఠించెను.

అప్పుడు నలగామరాజుపక్షమున నాయకురాలును, పెదమలిదేవరాజుపక్షమున బ్రహ్మనాయఁడును బ్రతినిధులుగా నుండుట కిరువురు ప్రభువులు నంగీకరించిరి. అంత నాయకురాలు లేచి ప్రతాపరెడ్డిం గాంచి "రెడ్డిగారూ! ఏదీమన కాకిజేగ? దానిని ముందు రణరంగమున వదలండి" అనియెను. ప్రతాపరెడ్డి యాజేగకోడిని సవరించి పోరికి విడిచెను.

దానింగాంచి బ్రహ్మనాయుఁడు "ఏమిది! కాకికంటెను నల్లగా నున్నదే. రంగు వైచినారా యేమి" అనిపలుకుచు "కన్నఁడా! దీనికిఁ బోటీగా మనవింజాబెరసను విడువుము" అని యాజ్ఞాపించెను.

కన్నఁడట్లు చేయుటయు నారెండుకోళ్లును బోరాటమున కారంభించెను. ఆపోరాటము నాసక్తితోఁ జూచుచున్న బాలచంద్రుఁ డాశ్చర్యముతో "కనమదాసా! అది కాకిడేగ కాదురా! ఏదో మాయడేగ లాగున నున్నది" అనుచుండఁగనే యాకాకిడేగ వింజాబెరస నొక్కతన్ను తన్నెను. తోడనే వింజాబెరస పఱుగెత్త నారంభించెను. అది చూచి బాలచంద్రుఁడు నిర్విణ్ణుఁడై పోయెను. గురిజాలపక్షమువారందఱును గర్వముతో నవ్వఁదొడంగిరి. అప్పుడు బ్రహ్మనాయుఁడు చిన్నబోయినవదనముతో "కన్నఁడూ! ఎంతయపశకునము! మనకోడి మాచర్లపౌరుషము నిలుపు నని యాశపడితిని. దీనిసిగగోయ్యా! ఎంతతలవంపులు గలిగించినది!" అనియెను.

అప్పుడు కనమదాసట్లు పాఱిపోవుచున్న వింజాబెరసను బట్టుకొని ప్రక్కలను దువ్వి, తల నిమురుచుఁ బౌరుష మెక్కించి యూఁచి మరల నాకాకిడేగపై విసరి వదలెను. అంత నాకాకిడేగ చటాలునఁ బైకెగిరి యావింజాబెరసను మరల నొక్కతన్ను దన్నెను. ఆదెబ్బతో నాకోడి తల త్రిప్పుకొనఁజాలక గురిజాలవారందఱును గొల్లున నవ్వుచుండఁగా కొక్కొక్కో యని కూయుచు వెనుదిరిగి పాఱిపోయెను. ఆసమయమునందొకసుద్దులవాఁడు లేచి యాడుచు

"పల్నాటిమిద్దెలకు వాసాలు లేవు
కొండవీటిబ్రాహ్మలకు మీసాలు లేవు
మాచర్లకోళ్లకు రోసాలు లేవో
తందానతాన"

అని పాడ నారంభించెను. అది విని బాలచంద్రుఁడు కోపము
తో "ఎవఁడురా వాఁడు? గురిజాలవాఁడు కాఁబోలును! ఇప్పుడే
యింత యెగసిపాటులకు? మాచర్లకోళ్లకు రోసాలున్నవో లేవో
కొంచెము కాలినచో స్పష్టముగాఁ జూడవచ్చును" అనియెను.

బ్రహ్మనాయఁడు మానరోషముతో కన్ననిచేత మఱియొక
యసలుపెరసకోడిని విడిపించెను. అంతకు ముందే పరితాపరెడ్డి యా
సందడిలోఁ దనమొనటికోడిపుంజును దీసివైచి తనసేవకునిచే నాస్థాన
మునందు మఱియొకయచ్చుకాకిడేగకోడిని నిలువఁబెట్టెను. అప్పు డా
రెండుకోళ్లును గజ్జాసురులవలె ద్వంద్వయుద్ధము చేయ నారంభించెను.
ఆపోరిలో మాచర్లకోడి గురిజాలకోడిని బోర బ్రక్కలగునట్లు తన్నెను.
అదిచూచి బాలచంద్రుఁ డుత్సాహముతో "అయినది. ఒక్కదెబ్బతో
డేగ డేకిపోయినది!" అనియెను.

ఆమాట విని నాయకురాలు నవ్వుచు "అయితే అయినదిగాని
మా డేగకోడి పెరసమెడ నెంతగట్టిగాఁ బట్టుకొని నెట్టుచున్నదో! ఈ
యాపుతో పెరస పడకమానదు." అనియెను.

బ్రహ్మ—పెరసపడుట యేమోనా? చూడు చూడు! మరల నొక్క
తన్నుతో డేగ చుట్టుచుట్టుకొని యెట్లుపడిపోవుచున్నదో!

అనుచుండఁగనే గురిజాలకోడి క్రిందఁబడి గిజగిజ కొట్టుకొని
ప్రాణములను విడిచెను. బాలచంద్రుఁ డప్పుడు పౌరుషమును సూ
చించు స్వరముతో "ఏదీ! ఇప్పు డాసుస్తాలవాఁడేదీ! ఓరీ! ఇప్పుడు
తెలిసినదా? ఎవ్వరికోళ్లకు పిరాలు లేవో తెలిసినదా? ఏదీ! ఈనారి
మరలఁ బాడుము చూతము!" అనియెను.

కొమ్మరాజు బాగుగఁ బరిశీలించిన ఈచచ్చినకాకిడేగ మొదట
మనవింజా పెరసను తరిమిన కోడివలె నగపడుట లేదు." అనియెను.

అప్పు డధ్యక్షధర్మమును నిర్వహించుచున్న అలరాజు "నాగమ్మగారూ! మీరు మరల నింకొకకోడిని వదలెదరా?" అనియెను.

"ఒక్కపందెముతో నైనదా?" అని నాయకురాలు బెరసకు ప్రతిస్పర్థులుగా మూఁడు పూఁటికోళ్లను దెప్పించి యొక్కొక్కదానిని వరుసగా నిలువఁబెట్టించెను. కాని మాచర్లవారి బెరస యాగురిజాల కోళ్లు మూటితోడను బోరాడి మూఁడింటినిగూడఁ గడతేర్చెను. అది చూచి మాచర్లవారందఱును బరమసంతోషముతో "గురిజాల వెనుకఁబడ్డది" అని కేరింతా లాడఁదొడంగిరి. నాయకురా లాయవమానమును సహింపఁజాలక మఱియొక వింజాబెరసను దెప్పించి రణక్షేత్రమున నిలువఁబెట్టించెను.

బాలచంద్రుఁ డప్పుడు నవ్వుచు "మా బెరసముందీ వింజాబెరస మాత్రము నిలుచునా? ఏ పోరి యారితేరియున్నదానితో నీపూఁటి కోడి చాలఁగలదా?" అని యధిక్షేపించెను. ఆ బాలునివచనము లాలించి నలగామరాజు సగర్వముగా "మావింజాబెరసమాత్రము సామాన్యమైనదనుకొనుచున్నావా? ఇంతకుఱ్ఱవాని కప్పుడే యెంతకూఁతలుపుట్టినవి?" అనియెను. బాలచంద్రుఁ డప్పుడు మఱింత నవ్వుచు "సల్నాటిరాజేంద్రా! చూడుఁడు! ఆకోడిమాకోడి ముందఱికి వచ్చుటయే లేదు. భయపడి వెనుదిరిగి నిలువఁబడిపోయినది" అనియెను. నలగామరా జటు చూచి "దానికేమి? కమరఁబడ్డదికాఁబోలును!" అనియెను.

అంతలోనే మాచర్లవారిబెరస యొక్కయెగురెగిరి గురిజాల వింజాబెరసను దన్నెను. ఆతన్నుతో నాకోడి తెల్లయాకవైచి యొక్కటేకటునఁ బాఱిపోయెను. అప్పుడు బాలచంద్రుఁ డుత్సాహముతో :—

"పల్నాటిమిద్దెలకు వాసాలు లేవు
కొండవీటిబ్రాహ్మలకు మీసాలు లేవు
గురుజాలకోళ్లకు రోసాలు లేవో
తంధానతాన—"

అని పాడఁదొడంగెను. అది విని మాచర్లవారందఱును జప్పటలు చరచి నవ్వ నారంభించిరి. అంత నాయకురాలు మహారోషముతో "ప్రతాపరెడ్డీ! నీపుంజులమారిగాఁడేఁడీ! ఆకోడిని దీసి బయటఁ బెట్టుము" అనియెను. ప్రతాపరెడ్డి యాకోడిని దీసికొనివచ్చెను. వానింగాంచి బ్రహ్మనాయఁడు "వీఁడు చిరకాలమునుండి నాయొద్ద మిత్రునివలెనే నటించుచు నాయకురాలియొద్ద సేనకుఁడై మెలఁగుచున్నాఁడు. వీనికిమాయిరువురిలో నెవ్వరియందు విశ్వాసమున్నదో యింతవఱకును నేను కనుపెట్టలేకయే యున్నాను. ఇప్పుడు బహిరంగముగా కార్యరంగమునఁ బ్రవేశించినాఁడు గదా! ఏమిచేయునో చూతము. ఆహా! వీఁడిప్పుడు విడిచినకోడి పుంజులమారిగాఁడా? ఇది నెమలిపోడివలె నున్నది! వీనిబడాయి బ్రద్దలు గాను" అని యనుకొనియెను.

అప్పుడు బాలచంద్రుఁడు మరల గంభీరస్వరముతో:—

"మాచర్లదొరలకు వేసాలు లేవు
అజ్ఞానచేష్టలకు దోసాలు లేవు
పల్నాటిరెడ్లకు మీసాలు లేవో
తంధానతాన:—"

అని పాడ నారంభించెను.

అది విని ప్రతాపరెడ్డి "ఔరా! ఎంతమాట యంటివి. కోడిపోరు క్రమముగా కులములవాఁడికి దుముకుచున్నది! పల్నాటిరెడ్లకు

విశ్వాసాలు లేవనుచున్నావా ? ఇదిగో చూడుము నావిశ్వాసము ! ఈకోడి
నాకోడి. ఇది గురిజాలకోడి. ఎన్నియో పెద్దపందెములలో గెలుపు
గొన్నకోడి. ఎట్టిపుంజులనైన మట్టఁగలకోడి. పల్నాటిలోఁ బేరువడసిన
కోడి. నాయకురాలికి నచ్చినకోడి. పుంజులమారియై పుట్టినకోడి. ఓ
బాలచంద్రా విన్నావా? దీనితో మీబెరసపని తీరిపోతుంది. " అని
యెను.

బ్రహ్మనాయఁ డామాటవిని క్రోధసూచకస్వరముతో "ఏమి
యీప్రగల్భములు! మాటలచేఁ గోటల దాఁట వచ్చునా? ఈరెడ్డిగా
రికి కోడిపాటలు చాలగా వచ్చును గాఁబోలును. ఈసంగీతములకుఁ
జింతకాయలు రాలునా? పౌరుషముగలవారు పందెము లొడ్డవలయు
ను. పెద్దపందెములు వైచి బిరుదు నిలుపుకొనవలయును. అట్టిపౌరు
షమును జూపింపని యీవట్టిసారకాయకోతలవలన నేమిలాభము "
అనియెను.

అంతనలగామరాజు నవ్వుచు "నాయఁడుగారేమో నోటికివచ్చి
నట్లు తృణీకరించి మాటలాడుచున్నారు. పల్నాటిప్రభునిపౌరుషమే
మో పందెములో పరికింపవచ్చును. ఇదిగో నాపందెము ! ఇదియే
ప్రతిజ్ఞ. ఈసారికూడ నాకోడి యోడినచో నారాజ్యమంతయు మీ
రాజునకు వదలివైచి నేనేడేండ్లు దేశత్యాగముగావించి సపరివారము
గా ప్రవాసానికిఁ బోయెదను" అని పందెము వైచెను.

అన్నగారి సాహసవచనము లాలించి పెదమలిదేవరాజు లేచి
"ప్రత్యక్షముగాఁ బందెములలోనికి దిగినప్పుడు పెద్దపిన్నతనము లెం
దులకు? కోడిపోరికైనను, ఘోరాహవమునకైనను వెనుదీయువాఁడు
వీరుఁ డెట్లగును? అన్నగారంతమాట యన్నప్పుడు నేనుమాత్రము
వెనుదీయుదునా? ఆపందెమునకు నేనుగూడ నంగీకరించితిని. గెలిచితి

నా పల్నాడంతయు నేనే పరిపాలించెదను. ఓడితినా నామొదటిపాత ముండనే యున్నది" అనియెను.

అప్పుడు బ్రహ్మనాయఁడు "మలిదేవా! మాచర్ల పౌరుషమును మాపౌరుషమునుగూడ నిలిపినావు. మానధనుండవగు నీకొలువు గాంచినమేముందఱము ధన్యులము" అని నాయకురాలివంకఁ జూచి "నాగమ్మగారూ! ఇది మీకంగీకారమేనా? మీరాజాకంటెను మీఁదిమాట మీది గదా!" అనియెను

నాయకురాలు—మీయంగీకారము తెలుపలేదే? మీమాటమాత్రము విలువలేనిదా? గురిజాలమాచర్లల విభాగమునకైనను వియోగమునకైనను మీరును నేనే కారకుల మని జనులందఱు ననుకొనుచునే యున్నారు. సరే. ఏమైననేమి? ఈపందెము మీకిష్టమేనా?

బ్రహ్మ—మిన్నువిరిగి మీఁదఁ బడినను సరియే. మఱియేమైనను సరియే. మామాచర్లప్రభువన్న మాటకు మఱి తిరుగులేదు. అయినశక్తమున నీపందెమునకు నేనుగూడ నంగీకరించుచున్నాను.

నాయ—అట్లయినచో నేనుమాత్రమేనా వెనుదీయుదానను? నలగామరాజునాజ్ఞకు నాయకురా లెన్నఁడును మాఱాడునది కాదు. దీనికి నేను నంగీకరించితిని.

అప్పుడు కొమ్మరాజు లేచి యుభయపక్షములవారి నుద్దేశించి "నేను మీకిరువురకును గావలసినవాఁడనుగావున నాకుఁ దోఁచిన విషయమును దెలుపుచున్నాను. వినాశకాలమున విపరీతబుద్ధులు పుట్టుచుండు నని పెద్దలు చెప్పుదురు. కోడిపందెములు వేసుకొని యాడుకొనుచున్నాము. క్రమముగా పౌరుషములు పెంచుకొని ప్రభు

గౌరవములను భగ్నముచేసికొనుట పాడిగాదు. ఇట్టిపందెము కూడదు” అని చెప్పెను.

అధ్యక్షుఁడగు అలరాజుకూడ నాపందెముకు కీష్టపడక యుభయులకును హితముగా “అయ్యా! మాతంత్రిగారివచనములు మాననీయములు. మనమందఱమును బరస్పరము గావలసినవారము. ఇందెవరోడిపోయినను గష్టమే. ఇంకొకపందెము పెట్టుకొనవలయు నని యుభయులను బ్రార్థించుచున్నాను” అని చెప్పెను.

అప్పుడు పెదమలిదేవరాజు బ్రహ్మనాయనిం బిలిచి రహస్యముగా “పౌరుషవిహీను లగువారెప్పుడు నైనదానికిని గానిదానికిని గూడ సమ్మతగులుచుందురు. మీరొకసారి లేచి గట్టిగా చెప్పవలయును. లేకున్నచో వీరిధోరణి కట్టువడదు” అని చెప్పెను. అప్పుడు బ్రహ్మనాయఁడు లేచి “ఉభయులకును హితులగు కొమ్మరాజుగారిప్పుడు చెప్పినమాట సత్యమే. కాని క్షాత్రము గలవారలు తామన్న మాటను దప్పఁగూడదు. అట్టిచో రాజులును మంత్రులును గలసి నిశ్చయించుకొని యీతపందెమును వైచి మరల వెనుకకుఁ దిరిగిపోవుట యధర్మము గాదా? అది యెంతమాత్రమును బౌరుషముగాదు” అనియెను.

నాయకురాలు బ్రహ్మనాయనికి బౌరుష మెక్కించుచు “ఔను మీరన్నమాట సత్యమే. సందేహము లేదు. పౌరుషముగలవారు రాజ్యములు పోయినా ప్రాణములుపోయినా వెనుదిరుగఁగూడదు. సత్యానికి నిలువఁబడవలసినదే” అనియెను.

అంత మలిదేవరాజు దృఢస్వరముతో “ఏది యెట్లయినను నేనిఁక నొక్కయంగుళము వాసియైనను నడుగు వెనుకకు జరపువాఁడను గాను.” అనియెను. కలగామరాజు ఆమాట విని “మీరింతే

నిశ్చయముగా నున్నప్పుడు నేనుమాత్రము వెనుదీయుదునా ” అని యెను.

ప్రభువు లిరువురు నిట్లు తమయుద్దేశములను బ్రకటించినంతనే బ్రహ్మనాయఁ డిరుతెగలవారిని హెచ్చరించి “ ఇంకను జూచెద రేమి? కోళ్లను వదలండి ” అనియెను. ఉభయపక్షములవారు నుత్సాహముతో కోళ్ళను రెంటిని బోరికి డీకొల్పిరి. ఆకుక్కుటద్వయము పర స్పరజయేచ్ఛచేఁ బోరాడుచుండెను. వానిం గాంచి నాయకురాలు నవ్వుచు “ వహావా ! ఈపక్షులకు పందెపువిలువ తెలిసినది కాబో లును. పోరాటములో నొకదానినొకటి మించిపోవుచున్నది ” అని యుత్సాహముతోఁ బలుకుచుండెను.

బాలచంద్రుఁడు “ అదిగో ! అదిగో ! మాబెరస యానెవలి జుట్టుపట్టుకొని యెట్లుతన్నుచున్నదో చూడండి ! అనియెను.

బ్రహ్మనాయఁడు వ్రేలు కఱచికొనుచు “ ఎంతపని జరగినది ! ఒక్కవిసురులో నెవలితప్పించుకొన్నది. కాకున్నచో బెరసతన్నిన కది ముక్కముక్కలై పోవలసినదే ! ఏమిది ! ఈనెవలిది వజ్రదేహము లాగున్నది ! ” అనియెను.

కొమ్మరాజు తనలో “ మావాళ్లు నాయకురాలిమాయలోఁ బడిపోయినారు. ఇఁకముందేమిగతి పట్టనై యున్నదో ! ఇప్పుడు విచా రించిన నేమిలాభము ! ” అని యనుకొనుచుండెను.

నాయకురాలు “ వహావ్వా ! మాచర్ల బెరసమెడ సగము తెగి నది. అప్పుడే యూళ్ళోడికి కోడిమెడ పడినది. ” అనియెను. “ అయ్యో ! బెరసపడిపోయినది ” అని బ్రహ్మనాయఁడు తల పంకించుకొనియెను. బాలచంద్రుఁ డాత్రముతో “ ఆగండి ! తెప్పరిల్లి మరల లేచునే మో ! ” అనియెను. నాయకురాలు పకపక నవ్వుచు “ అయినది !

యింకను లేచుట యేమి! ప్రక్కపోటుతోనే ప్రాణముపోయినది. ప్రతాపరెడ్డీ! ఇఁక మన పుంజులమారిగానిని నిలుపుము. చచ్చినదానితో నింకను బోరాట మెందులకు?" అనియెను.

అప్పుడు నలగామరాజు లేచి నిలువఁబడి యందఱకును వినఁబడునట్లు గంభీరస్వరముతో "మాచర్ల యిఁక మాయధీనమైనది" అనియెను. చూచుచుండఁగనే సభయంతటను గోలాహలము చెలరేగెను. పెదమలిదేవునిపక్షమువారందఱును విషణ్ణహృదయములతో హాహాకారములు చేయఁదొడంగిరి. గురిజాలవారు మితిమీరినసంతోషముతోఁ జెరలాడుచుండిరి. మలిదేవరాజును, బ్రహ్మనాయఁడును మాటాడక తలలు వంచుకొని యుండిరి.

అప్పు డధ్యక్షుఁడగు అలరాజు లేచి "ఇది యింకొకవిధముగా జరగు నని నేనెన్నఁడు ననుకొనలేదు. ఈయపజయ మిరువురిలో నెవ్వరికో కావలసినదే గదా! ఎంతచెప్పినను, ఎన్నివిధములఁ బ్రార్థించినను నిరువురునుగూడ వినకపోయితిరి. జరగినదేదో జరగినది. ఇప్పటికైన నేదో యొకవిధముగా సంధి చేసికొనుట చాల మంచిది" అని చెప్పి యూరకుండెను.

"ఏడుసంవత్సరములును గడచినతరువాత మనమందఱము బ్రదికి యున్నచో నప్పుడు సంధిమాటలను జరపుకొనవచ్చును. ఇప్పుడిఁక నవకాశ మేమున్నది?" అని నాయకురాలు హెచ్చరించెను. నలగామరాజు బ్రహ్మనాయనిం గాంచి "ఇంక మీరు మాచర్లకుఁ బోనక్కఱలేదు. ఇక్కడనుండియే మీరెచ్చవచ్చినచోటికిఁ బ్రయాణము గట్టవలయును" అనియెను.

బ్రహ్మ—మార్గస్థులవలెఁగూడ మేము మాచర్లకుఁ బోఁగూడదా? ఒకసారి యచ్చటికిఁ బోయి కావలసినవాళ్లను వెంటఁ బెట్టు

కొని యటనుండి మాచర్లకు బోయెదము.

"మీకుమూడుదినములుమాత్రము గడువిచ్చితిని. ఈలోపలనే మీరు మాచర్లలో మీపసులను జక్క-పెట్టుకొనవలయును. ఆతరువాత నొక్క-నిమిషమైనను మీరు మాచర్లలో నిలువఁగూడదు" అని నిష్కర్షగాఁ జెప్పివైచెను.

అనంతరము బ్రహ్మనాయఁడును పెదమలిదేవరాజును విషణ్ణవదనములతో నల్లవారును దమ్ము నిందించుచుండ గురిజాలమైదానమును వీడి సపరివారముగా మాచర్లమార్గమునుబట్టి తరలిపోయిరి. ఇట నలగామరాజు, నరసింగరాజు, ఝుట్టిరాజు, కేతురెడ్డి, వీరారెడ్డి, నరసారెడ్డి, ప్రతాపరెడ్డి మొదలగువా రెల్లరును నాగమ్మగారి రాజ్యతం[illegible] బహువిధముల శ్లాఘించుచు "నాయకురాలే మరలఁ బలిష్ఠమైన సైన్యము చేసి నలగామునకర్పించినదని" యామెసామర్థ్యమును బొగడుకొనుచు పందెములముచ్చటలనుగూర్చి యొండొరులకుఁ దెలుపుకొనుచు సంపూర్ణోత్సాహముతో స్వస్థానములకుం బోయిరి.



# మూఁడవ ప్రకరణము.



పందెములపర్యవసానము తేలినపిమ్మట మాచర్లపౌరులు రెండువేలసంఖ్య గలవారు మాచర్లత్రోవను బట్టుకొని కాలినడకను నడిచిపోయిరి. రెండెడ్లబండ్లపై పోవునారు మాత్రము నిలిచి యుండిరి. అంత బ్రహ్మనాయుఁడు సపరివారముగ బండ్లపై నెక్కి [illegible] దానమునుండి బండ్లు సాగించునప్పటికి చీకటి పడెను. ఆనాఁ[illegible] గామరాజుగారి, నరసింగరాజు గారి, నాయకురాలు గారి, పెదమలిదేవుని, వారిపరివారమును భోజనమునకైన నాహ్వానింపలేదు. వారు పదునాలుగుమైళ్లదూరము పోవలసియుండెను. రెండుజాములు దాటిన పిమ్మటఁ గాని మాచర్లను చేరుకొనలేరు.

పరిస్థితి యిట్లుండ నచ్చట మాచర్లలో [illegible] మాచర్లవీరు లందఱును కోడిపందెములకై [illegible] ముందుగానే యెజెంగిన ముద్వాలభీమన్న [illegible] ఆయుధపాణు లయినపనూఱుబోయభటులు [illegible] గ్రియల ప్రొద్దువేళనే వచ్చి మాచర్లపైఁ బడియెను. ఈబోయనాయకుఁడు సంగతి సందర్భములను బాగుగాఁ గనుపెట్టి గ్రామములో నెవ్వరు లేనిసమయమున వచ్చి పైఁబడినాఁడు.

ఎందఱెందఱో పడుచువాండ్రు పొలములలో నుండిరి. స్త్రీలనేకులు వృద్ధులనుమాత్రి యిండ్లు విడిచిపెట్టి తమతమబిడ్డలను వెంటఁగొని సమీపమునం దున్నజొన్నచేలలో దాగొనఁ బఱువిడుచుండిరి. ఏమూలలను జూచినను హాహాకారము చెలఁగుచుండెను. స్వగృహరక్షణార్థము బ్రహ్మనాయునిచే నిలుపఁబడిన బాలగోపన్ననాయుఁడను

గొల్లవాఁడు మహాశూరుఁడు కొలఁదిమంది వీరులతో రాజగృహమును గాపాడుచుండెను.

ఆరాజగృహావరణములోపలనే బ్రహ్మనాయునిగృహము కలదు. మాచర్లలో నొకగొప్ప కోటను గట్టింపవలయు నని బ్రహ్మనాయుఁడు తలంచుచుండెను గాని యప్పటికి పట్టణమును గాపాడునట్టికోటయైన లేకుండెను.

బోయలు తండెత్తి వచ్చినారనువార్త విని పొలములలోఁ గర్షకులుగాఁ బనిచేయుచున్న కనమదాసుబంధుగు లిరువదిమంది గోసంగులీఁటెలతోఁ బరువెత్తుకొని వచ్చి 'మహాదేవితటాక' మను పేరుగల చెఱువుకట్టక్రిందను మహాసాహసముతో వారల నెదుర్కొని పట్టణములోనికి రాకుండఁ గొంతసే పచట నిలువరింపఁ గలిగిరి.

వారియనుపమానసాహసకృత్యము దేవతలకైనను నచ్చెరువు గలిగించునట్లుండెను. కాని వారిక ది రక్షణ మిచ్చుప్రదేశము గాకుండుటచేతను, బట్టబయ లగుటచేతను మహాక్రూరు లయినబోయల ముందు వారు విశేషకాలము జీవములతో నిలిచి పోరాడుటకు సాధ్యపడ లేదు. వారిచేతియీఁటెలు ముక్కలయి వారిదేహములు ఛేదింపఁబడి వారిబొందెలలోనుండి ప్రాణము లెగసి పోవునంతదనుక వారు వీరకృత్యములను విడువ లేదు. వారు నూఱుమందిబోయల యసురులనుగొని నేల కొఱఁగిరి.

వారశేషసైన్యముతో ముప్పాలభీమన్న విజృంభించి పట్టణముపైఁ బడి దోఁచుకొనఁ బ్రారంభించెను. నన్నూఱుమంది నాల్గుభాగములుగాఁ జీలి పోయి నాల్గువీథులం బడి పట్టణము బీభత్సము గావింప మొదలిడిరి. ఏవీథినిఁ జూచినను 'కుయ్యో మొఱ్ఱో' యను వంగలార్పులు వినఁబడుచుండెను. కొందఱుమానవతు లవమానమును భరింప

నోడి మానసంరక్షణార్థము బావులలోఁ దుమికి ప్రాణములు గోల్పో వలసినవా రయిరి. కటకటా! తాను బ్రదికియుండఁగా మాచర్ల కిట్టి దుస్థితి సంభవించు నని బ్రహ్మనాయుఁ డుసయితము కలలోనైనను దలంచి యుండఁడు గదా యని వీరమాతలు దుఃఖింపసాగిరి.

ఇంతలో బోయనాయకుఁడు నూఱుమంది బోయభటులతో నేతెంచి రాజగృహద్వారమును ముట్టడించెను. తద్ద్వారపాలకుం డగు బాలగోపన్న నాయుఁ డదివఱకే తలుపులు మూయించి సింహద్వారమునకు లోపల నిరుపార్శ్వముల నీటెగాండ్రను నిలిపి సింహద్వారమునకు వెలుపల పక్కనున్న యిండ్లకప్పులమీఁద పండ్రెండుగురు మేటి విలుకాండ్రను నిలిపి యిరువదిమంది వీరభటులతో తాను ద్వారమును గాచుచున్నవాఁడు గావున వారుముందుగా శత్రువులం దలంపడి తమ గుహలను గాపాడుకొనియెడు సింహములవలెఁ బోరాడుచుండిరి.

ఇండ్లకప్పులపై నిలిచియున్న విలుకాండ్రకు బోయలు కన్పడు చుండిరి గాని బోయలకావిలుకాండ్రు గన్పట్టుచుండ లేదు. విలు కాండ్రు సరిగా గుఱి చూచి యొక్కొక్కబాణముచే నొక్కొక్క బోయను పడఁగొట్టుచుండిరి. కొందఱు బోయలు సాహసముతో ద్వారముకడకుఁ జొఱుచుకొని పోయి గండ్రగొడ్డండ్లతో ద్వారమును బగులఁగొట్టుచుండిరి. మువ్వాలభీమన్న పట్టుదలతో లోన నెట్లయినఁ బ్రవేశింప నిశ్చయించుకొని తమ్ము వెంటనే వచ్చి కాపాడవలసిన దని తక్కినబోయలకు వర్తమానము చేసెను.

ఆవర్తమానము విని మఱినూఱుమంది బోయ లాప్రదేశము నకు వచ్చిరి. ఎట్లయిన నేమి? పౌరుషముతో బోయలు సింహద్వార మును బగులఁ గొట్టఁగలిగిరి. తలుపులు తెఱవఁబడెను. కొందఱు

బోయలు సాహసించి లోపలికిఁ బోవ వారిని లోపలి యోధులు కాంగ్రసు కుమ్మివేయుచుండిరి.

ఇంతలో రాజగృహముకడ తమవారికిని బ్రహ్మనాయుని పీసు లకును మహాఘోరసంగ్రామము జరుగుచున్న సమాచారము తెలియ వచ్చినంతనే బోయ లెల్లరును దోపిడిమాని యుద్ధరంగమునకుఁ బరు తెత్తుకొని వచ్చుచుండిరి. తనసహచరు లెల్లరు నారణరంగమున వీర శయనము నొందుటయుఁ దానొక్కఁడుమాత్రము మిగులుటయు బాల గోపన్న కనుపెట్టి రోషావేశపరవశుఁడై యుగ్రాకారమును దాల్చి తన్ను సమీపించినవాని నెల్లను బాడిచివేయుచు చిత్రగతులఁ దిరుగా డుచుండెను.

ఇట్లు బోయలను పెక్కండ్రను మట్టుపెట్టి రణకేళి నోలలాడు చున్న బాలగోపన్న యలసి సొలసి సోయి తూలిపడుటఁ జూచి యదే సమయమని వానిపైఁ బడి ముప్పాలభీమన్న తననిశితాసిచే వానికంఠ మును దెగవ్రేసెను.

అట్లు వాని కంఠమును దెగవ్రేసి నిలువంబడిననిమిషముననే యొక్క బాణము రివ్వున వచ్చి వానివక్షస్థలమున దూరెను. ఆవెనుక మఱియొక బాణము వచ్చి యుదరము చొచ్చెను. ఆదెబ్బలతో బోయ నాయకుఁడు ముప్పాలభీమన్న 'హా! హా!' అని యఱచుచు నేలఁ గూలెను. అతనికిఁ దోడ్పడవచ్చిన బోయలపై చిత్రజల్లుగా నంప వాన గురియుచుండుటచేతను, చీకట్లు గమ్ముచుండుటచేతను, పెక్కం డ్రు బోయలు రణస్వామికి బలి యగుచుండుటచేతను, తమనాయకుఁడు ముప్పాలభీమన్న మరణించినవాఁ డనువార్త సర్వత్ర వ్యాపించుటచే తను బోయలకు ధైర్యము చెదరి పోయి పికిరితన మావహించెను.

ఎప్పుడు పికిరితనము తమలోనఁ బుట్టినదో యప్పటినుండి

వారు రణభూమినుండి తొలఁగిపోవుచుండిరి. అట్టి యవస్థలో బాణవ ర్షము తీవ్రరూపమును దాల్చెను. బాణఘాతములకు బోయలు బెగ్గడిలిపోయి పఱువులు మొదలుపెట్టిరి. బోయలు పఱువువాఱుటను గాంచి విలుకాండ్రు తమస్థానములను విడిచి పోయిరి. కాని యట్టిసమయమునకై వేచియున్న పండ్రెండుగురురౌతు లశ్వారూఢు లయిన వారు వారివెంటఁ బడి వెను బడినవారినెల్ల సిఖలతోఁ బొడిచివేయు చుండిరి. ఇంక మాచర్లలో నిలిచిన ప్రాణము దక్కదను భయము ప్రతిబోయవానిహృదయమును గంపింపఁజేసెను. హతశేషు లగు బోయలు నానాముఖముల చెదరిపోయి తమకు దొరకిన ధనముతో మాచర్లను విడిచి పలాయనులయి పోయిరి. మాచర్లపురము దాటి పోలేని బోయల నెల్లర నాయాశ్వికులు బలిగొనిరి.

ఈయుద్ధమున ప్రాణములను గోల్పోయిన బోయలు మున్నూఱుగురై యుండగా మాచర్లవీరులు నలువదిమందియే. ఇది యత్యాశ్చర్యము కదా ! ఇట్టిజయము ఇట్టికీర్తి మాచర్లకు కలుగుట కేవలము పురుషవ్యక్తులవలన నైనదిమాత్రమే కాదు. ఇదంతయు నొకస్త్రీవ్యక్తి చేసినయేర్పాటువలన నైనదని తెలిసికొన్నప్పుడు చదువరు లెంతేని నానందము పొందుదు రనుట నిస్సందేహము. అట్టిస్త్రీవ్యక్తి పదునాఱేండ్లబాలిక యని చదువరి తెలిసికొన్నప్పుడు పొందుసంతోషమునకు మేర యుండునా?

ఆమె గండుకన్నమనాయుని కూఁతురు; బ్రహ్మనాయుని కోడలు; బాలనాయుని భార్య; మంచాల యను పేరుగలిగి పదునాఱేండ్ల వయస్సుమాత్రమే గల వీరబాల. విలువిద్య నభ్యసించిన బాల; మంచి తెలివితేటలు గలది. సాహసికురాలు. పిఱికితన మేకోశమునందును లేనిది. నిజముగా రాజగృహమును, రాజగృహములోని

స్త్రీలమానమును గాపాడఁగలిగిన దీమంచాల యను వీరబాల యని యే చెప్పఁదగును.

బోయలు మాచర్లపైఁ బడి దోఁచుకొన వచ్చుచున్నారను సమాచారము రాజగృహములోని స్త్రీలకు మొట్టమొదట దెలిసినప్పు: దేప్పులు పెడబొబ్బలు పెట్టువారే గాని తమ్ముఁ దామెట్లు కాపాడుకొనవలసి యుండునో వారెఱుంగకపోయిరి. వారికలవరపాటును, కలుగఁబోవు నపాయమును గుర్తించి మంచాల బాలగోపన్నను రప్పించి యీవార్త వాని కెఱింగించి యిట్లనియెను.

“నాయుఁడా! ఇటు వినుము చెప్పెదను. మనప్రభువులు, మన మంత్రులు, మననాయకులు, మనవీరులు, మనబంధుగులు మొదలగు వారెవ్వరును లేనిసమయమును జూచి మనశత్రువుల (అందుముఖ్యముగా కుత్సితవ్యాపారము నెఱపుచున్ననాయకురాలి) ప్రేరణముచేఁ గాఁబోలు బోయనాయకుఁడు ముమ్మభీమన్న ఏనూర్గురుబోయలతో మాచర్ల దోఁచుకొన వచ్చుచున్నాఁడని తెలిసినది. మనము కలవరపడి ప్రయోజనము లేదు. పట్టణ మంతయుఁ గాపాడుకొనలేము. మనము మాటాడుచుండఁగానే వచ్చి పైఁబడుదురేమో అన్నట్లున్నది. దీనిగుఱించి యోచించుటకును యోచించినదానిని చేయుటకును కాలవ్యవధికూడ లేదు. బోయలకు కత్తులు, కఠారులు, గండ్రగొడ్డండ్లే గాని, విల్లంబులు గాని, యీటెలు గాని లేవని తెలిసినది. ఆత్మసంరక్షణార్థము మన మిప్పుడు విల్లంబులు నీటెలు మాత్రమే సంపాదింపవలసి యున్నది. ఈయాయుధములతో బోయలను దూరముగా నిలువఁగలుగుదుము, సుస్థిరముగా నిలువఁబడి పోరాడఁగలము. ఎవ్వరును భయపడవలసిన పని లేదు. మానమును గాపాడుకొనఁ గోరి స్త్రీలెవ్వరయినను రాజగృహమునకు రాఁదలంచినవారిని రానిచ్చి ద్వార

ము లన్నియు మూసివేయవలయును. అయిదుగు రీటెగాండ్రు సిం
హద్వారమునకు లోపలను, ఇరువదిమందియీటెకాండ్రతోడ నీవు
వెల్పలను సింహద్వారమును గాపాడుచుండవలయును. ఇప్పుడు నాకు
పంద్రెండుగురు విలుకాండ్రును, పదునొకండ్రు గుఱ్ఱపురౌతులును
గావలయును. వీరిని నాకిచ్చినయెడల నేనవలీలగ రాజగృహమును
గాపాడుటయే గాక శత్రువులకు విశేషనష్టము కలిగించి శీఘ్రకాల
ములో పలాయనులగునట్లు చేసి మాచర్లప్రజలకు విశేషనష్టము గలు
గకుండఁ గాపాడుటకుఁ బ్రయత్నించెదను. వేగిరము రమ్ము."

అప్పుడు బాలగోపన్న మంచాలను గాంచి యిట్లు ప్రత్యుత్తర
మొసంగెను.

"అమ్మా! విల్లంబులును, ఈటెలును వందలకొలఁది కావ
లసి వచ్చినను మనకు కొదవలేకుండ సిద్ధముగా మనకడనే యున్నవి.
ఇరువదినల్గురు వీరులతోడ గృహరక్షణార్థము మామామ బ్రహ్మనా
యునిగారివలన నేను నియమింపఁబడి యున్నాను. నాతో నిర్వదియై
దుగురు వీరులము సంసిద్ధులమయి యున్నాము. మీయాజ్ఞను శిరసావ
హింతుము. మేటివిలుకాండ్రును వేఁటకాండ్రు నగుముతరాసు లిండ్ల
కడ నున్నట్లు విని వర్తమాన మిదివఱకే పంపించియున్నాను."

వీరిట్లు మాటాడుకొనుచుండఁగనే యిరువదినల్గురు ముతరా
సులు, చాకళ్ళు, మంగళ్ళు, కుమ్మరులు, గోసంగులు మొదలగు
నానావీరులు వచ్చిరి. వీరిలో విలువిద్య బాగుగా నెఱిఁగినవారి నెన
మండ్రు ముతరాసులను, ఇద్దఱు చాకళ్లను, ఇద్దఱు గోసంగులను
వేఱుచేసి వారలకు మంచివి విల్లంబుల నిప్పించెను. తక్కినవారు
గుఱ్ఱములపై స్వారి చేయనేర్చినవారు గావున వారిని రౌతులుగ
నేర్పాటు చేసి రాజుగారి యశ్వశాలలోని గుఱ్ఱములను దెప్పించి

రౌతుల నిప్పించి వారికి నీటెల నొసంగి వారి నొకసమీపప్రదేశమున
నుంచి వర్తమానముచేసినపుడు బయలుదెడలి వచ్చి బోయలవెంటఁ
బడి తఱుమవలసినదనియు నాజ్ఞాపించి వారి నాప్రదేశమునకుఁ బంపె
ను. ఎవరైన గోసంగులు వచ్చి యడిగినయెడల నీయవలసిన దని
ముప్పదియీటెలను తనమదాసింటికిఁ బంపి పొలములలోఁ గన్పడు
గోసంగుల కెల్లరకు నీసమాచారము చెప్పవలసినదిగాఁ గొందఱు
దాసీలను బంపెను. పట్టణసమీపమునకు బోయలు వచ్చినారని తెలి
సినవెంటనే గొప్పయింటిస్త్రీలకు 'రాజగృహమున మీకు రక్షణము
గలదు' అని వర్తమానము చేసెను. అనేకస్త్రీలు మంచాలమాట
యందు విశ్వాస ముంచి యట్టి రాజగృహము ప్రవేశించినారు.

బోయలు పట్టణములోఁ బ్రవేశించినారని తెలిసినప్పుడే
యామె ద్వారము లన్నియు మూయించెను. తాను రాజగృహము
నకు బయటనే యుండెను. బోయలు పాఱిపోవుట ప్రారంభించునంత
వఱకు తానొకవిల్లు బూని విలుకాండ్రతోఁ గలిసి యుండెను. బాల
గోపన్నను జంపినముప్పాలభీమన్నను గుఱిచూచి సరిగా బాణములతోఁ
గొట్టి చంపిన దీమెయే. శత్రువులు పఱువిడునపుడు తానుగూడ
నీటె చేకొని గుఱ్ఱమెక్కి రౌతులఁ బ్రోత్సహించుచు వారితోఁ గలసి
బోయలను పట్టణమునుండి పాఱఁదోలిన దీమంచాలయె.

ఈవీరబాల తనపక్షమునుండి తమప్రాణములను తృణప్రాయ
ములుగాఁ దలంచి ప్రాణత్యాగములను జేసినవీరశిఖామణుల యాత్మల
శాంతికొఱకు భగవంతునిగూర్చి ప్రార్థన చేసెను. మానసంరక్షణా
ర్థము కొందఱు మానవతులు గావించిన యాత్మహత్యలకై యెంత
యుఁ జింతించెను. రాజగృహమునం దేమి, పట్టణమం దేమి స్త్రీల
మనస్సులు తహతహలాడిపోయినవి. మానప్రాణములు దక్కెనని

రెవ్వరు ననుకొనలేరు. అట్టి స్థితిలో నిట్టియనుపమానసాహసకృత్యము లతో విజయమును బొంది పట్టణమును గాపాడఁగలిగిన యీమంచాల యశస్సును నెవ్వరు స్మరింపకుందురు ?

సమస్తజనులు మంచాలను ప్రశంసించుచు బోయలనురంతము లనుగూర్చి యారాత్రి యంతయు ముచ్చటించుకొనుచుండిరి. వీధు లలో బోయలశవము లెక్కడఁజూచినను గానంబడుచుండెను. పొల ములకుఁ బాఱిపోయినవారెల్లరు మెల్లగాఁ దమతమ యిండ్లకుఁ జేరు కొనుచుండిరి. రాత్రి రెండు జాములు దాఁటిన వెనుక గుఱిజాలకుఁ బోయినవారు దిగుటకుఁ బ్రారంభించిరి. బ్రహ్మనాయుఁడు, మలి దేవరాజు మొదలగువారు తమతమబలగములతో మాచర్లకుఁ జేరునప్ప టికి జాము రాత్రిమాత్రి ముండెను.

రాజ్యము నంతయుఁ బాడెముగా నొడ్డి యోడిపోయినందుకే పెద్దగాఁ బరితపించుచు పెనుభారమున కృంగిపోయిన దేహములతో వచ్చినవారికి మాచర్లలోని బీభత్సప్రదర్శనము దర్శించినప్పటికి గోరు చుట్టుమీఁద రోఁకటిపోటు పడ్డట్టు బాధ భరింపరానిదయ్యెను. వీర లిండ్లకుఁ జేరినతోడనే రాజ్యము పోవుటయు, మాచర్ల దోపిడిపా లగుటయు నొక్కమాఱే తటస్థించుట చెన్నారాయునికృప యని బ్రహ్మనాయుఁడు తలంచెను. కాని యెంత యోపుకొందమన్నను బ్రహ్మనాయునికి దుఃఖ మాఁగదయ్యెను. తనమూలముననేగదా యిం దఱికిన్ని విధములుగా కష్టములు దుఃఖములు సంప్రాప్తములయిన వని తలపోయుచుఁ గంటఁ దడిపెట్టుకొనియెను. తన భావమఱఁది కొమ్మ రాజు చెనటిబోధనలఁ బెడచెవినిఁ బెట్టి చేతులారఁ దెచ్చిపెట్టు కొన్నకష్టములుగదా యివి యని పెదమలిదేవుఁడు తలపోసి కంటఁ దడివెట్టుకొనియెను. మూఁడు దినములగడువులో మాచర్లను విడిచి

యెడవులపాలు కావలసియున్న దనుసంగతి స్త్రీలచెవిని బడఁగానే యింటింటను హాహాకారము చెలంగెను.

ఆరాత్రి మాచర్లలో నింటింట నీవర్తమానమును దెలిసికొని యాబాలవృద్ధులు మాచర్ల మహాసముద్రములో దిక్కు దివాణము లేకుండ మునిఁగిపోయిన దని గోలుగోలున నేడ్వసాగిరి. ఈబెడిదపు మాట వినఁగనే యెట్టివీరునిగుండెలయిన నీరుగాక మానవు. మాచర్లే బ్రహ్మనాయుఁడు. బ్రహ్మనాయుఁడే మాచర్లగ నుండెను. ఇప్పుడు మాచర్లకు బ్రహ్మనాయునికు నెడబాటు విధికృతము. ఇది అలంఘ్యము. ఒకనాఁడు గాదు, రెన్నాళ్లుగాదు. ఏడేండ్లు గడపవలయును. "తనంత తాను వలచి వచ్చినరాజ్యలక్ష్మిని కాలితోఁ దన్నివేసినట్లు చులకనఁగాఁ జేతిలోనికి వచ్చినరాజ్యమును చేతులారఁ బోగొట్టుకొన్న యభాగ్యులకు దైవము తోడ్పడునా? వారలకు సుఖము లభించునా!" అని అలరాజు నిట్టూర్పు లూర్చుచుండెను. ఇంతలోఁ దెల్లవాఱినది.

తెల్లవాఱినతరువాత పురజను లెల్లరును పట్టణ మంతయుఁ గలయఁదిరిగి చూచిరి. మాచర్లవీధులయు, మంచాలయు వీరకృత్యములకు సందఱు నచ్చెరువొందసాగిరి. బాలనాయునిభార్య మంచాలను 'వీరబాల' యని పేరుపెట్టి యెల్లవారును శ్లాఘింపసాగిరి. వెలమబిడ్డ గావునఁ బుట్టినింటికి మెట్టినింటికి వన్నె దెచ్చిన దని బ్రహ్మనాయుఁడు సంతోషించెను. 'మువ్వలభీమన్న' అనుబోయనాయకుని చంపినది 'మంచాల' యని తెలిసికొని యెల్లవారానందభరితులైరి.

తవప్రియభృత్యుఁడు బాలగోపన్న విశ్వాసపాత్రుఁడై స్వామి కార్యనిర్వహణమందు ప్రాణము లర్పించినందుకు మెచ్చుకొనుచు నాఁటితలయు మొండెము వేఱయియున్న చిత్రస్వరూపమును గాంచి

బ్రహ్మనాయుఁడు మిక్కిలి విలపించి వెంటనే వానికి గొల్లలచే దహన సంస్కారమును గావింపఁజేసెను. పట్టణమునకు దూరముగా గోతులను త్రవ్వించి బోయలశవములను మోయించుకొని పోయి వానిఁ బెట్టించి పూడ్పించెను. గోసంగులదేహపుముకలను దీసికొనిపోయి గోసంగు లడవిలో దహనము గావించిరి. బాలగోపన్నతో మరణము గాంచినవీరుల నెల్లరను గోపన్నను దహనముగావించినప్రదేశముననే దహనము గావించిరి. వారి స్మారకార్థముగ నా ప్రదేశమున నొక సమాధి గట్టి నియమించెను.

పట్టణమును పరిశుభ్రపఱచుటకై పురవాసులు వేయిమంది రెండు యామములవఱకు కృషి సల్పిరి. ఆనాఁడు ప్రజలు వంట చేసికొని భుజించి విశ్రమించునప్పటికి మూఁడు జాము లయ్యెను. అందువలన నాఁడు బ్రహ్మనాయుఁడు గాని, పెదమలిదేవుఁడు గాని, మఱియెవ్వరు గాని ప్రయాణపు సన్నాహము తలపెట్టలేదు. ఆదిన మంతయు బడలిక దీర్చుకొనుటతోనే గడచిపోయినది.

## నాలుగవ ప్రకరణము

గురిజాలసభలో చేసినసమయముప్రకారము పల్నాటిరాజ్యమును విడచి చేయవలసిన కార్యములతెఱంగునుగూర్చి బాధువులతోడను, మిత్రులతోడను, పౌరప్రముఖులతోడను నాలోచించి నిర్ణయించుకొని సత్యవ్రతానుష్ఠానము సాగించుటకై ప్రయాణసన్నాహములను జరుప నుద్దేశించి మఱునాఁడు బ్రహ్మనాయుఁడు మాచర్లపట్టణమున రాజుగారిగృహమున నొకసమావేశమును సమకూర్చెను.

ఆసమావేశమునకుఁ బ్రహ్మనాయుని పిలుపును మన్నించి బాధువులు, మిత్రులు, పౌరప్రముఖులు పెక్కండ్రు సభకు విజయంచేసిరి. ఏమి చెప్పునో యని సభాసదులదృష్టు లెల్ల బ్రహ్మనాయుని మోముపై ప్రసరించుచున్నవి. సభ యంతయు నిశ్శబ్దముగా నుండెను.

అప్పుడు బ్రహ్మనాయుఁడు సభలో మెల్లగా లేచి సభవారికి నమస్కరించి " మహాశయులారా! నేఁడు మనము చర్చింపవలసిన విషయము లొక్కవంక మానప్రాణధనాదులతో సంబంధించినవి. మఱియొకవంక నీతిన్యాయధర్మసత్యవ్రతాదులతో సంబంధించినవి. కనుక నీసభ కొకపెద్దను నిర్ణయించుకొని వారిశిక్షణమునకు లోఁబడి మనము మనయభిప్రాయములను దెలుపుకొని ధర్మనిర్ణయము నాపెద్దకు విడిచిపెట్టి వారు చెప్పినట్లు నడచుకొనుట మనకు శ్రేయస్కరమని నాతలంపు. అందుకు సమస్తధర్మముల నెఱింగినవారును, నిష్పక్షపాతబుద్ధి గలవారును, శాంతపురుషులును, పరమవైష్ణవశిఖామణియు నగుమనగోవిందభట్టాచార్యులవా రర్హులని నాయభిప్రాయము. వారీ మహాభారమును వహింపవలయు నని ప్రార్థించుచున్నాను. దీనిమీఁదమీ

## నాలుగవ ప్రకరణము

రును మాఱుమాటాడక యైకకంఠ్యముతో [illegible]
యెడల తప్పక వారు నా ప్రార్థన మన్నించి యీసభకధ్యక్షత్వమును
వహించుటకు సమ్మతింతురు " అని [illegible]రించెను.

బా[illegible] శ్రీ[illegible] మదింప
మన్నను [illegible] గాంచి సూచనలు
దెల్పుచుండ మాఱుమాటాడలేక వారును పైవారితోఁ గలిసి తమ
యంగీకారమును దెల్పుటకో యనఁ గరతాళధ్వనుల[illegible] గావించిరి.

అంత గోవిందభట్టాచార్యులవారు చిఱునవ్వు నవ్వుచు లేచి
యిట్లుపలికెను. "సభాసదులారా! ధర్మసూక్ష్మత గ్రహించుట
మహాత్ములైనవారి కట్టివారికో గాని యందఱకు సాధ్యపడునదిగాదు.
అట్టిశక్తి నావద్ద లేదనియు, నేను మహాత్ముఁడను కాననియు, నెఱిం
గినవాఁడ నయ్యును, ఎందుచేతనో మీరెల్లరు నాయందు విశ్వాసము
గలిగి నన్నుఁ బెద్దగా నెన్నికొని నాకు గౌరవము చూపుచున్నందుకు
మీకందఱకు వందనము లర్పించుచున్నాను. భగవంతుని నమ్మి సమైక
దృష్టియు, నిష్పక్షపాతబుద్ధియుఁ గలిగి మీరు చెప్పినవాని నెల్ల సాం
తముగా విని నాకు తోఁచినధర్మము నేను సభాసదులకు నివేదింపఁ
గలవాఁడ నని వినయపూర్వకముగా మనవి చేయుచున్నాఁడను. నేఁ
టివిషయము మహావిషయము గనుక మీరెల్లరు శాంతచిత్తములతోఁ
జర్చింపవలెనని ప్రార్థించుచున్నాఁడను. ఒకప్పుడు బాలురయ్యును
గొందఱు వృద్ధులకంటె ధర్మసూక్ష్మత నెఱింగి వ్యవహరింతురు. ఒక
ప్పుడు వృద్ధులయ్యును గొందఱు ధర్మసూక్ష్మత నెఱుంగక యవివేకు
లై బాలురవలె వ్యవహరింతురు. ఏది యెట్లున్నను ధర్మనిర్ణయము
చేయఁబూనుకొన్నప్పుడు దురహంకారములను విడిచి శాంతముతోఁ
జర్చించినఁ గాని ధర్మమును దెలిసికొనఁజాలము. 'సత్యంవద; ధర్మం

చర ' అనఁగా ' సత్యము పలుకుము; ధర్మము నాచరింపుము ' అని మన వేదము చెప్పుచున్నది. సత్యము ముందు ధర్మము వెనుక. పరిశుద్ధ హృదయము గలవారికిమాత్రమె సత్యస్వరూపుఁ డయినభగవంతుఁడు గోచరించును. అట్టి సత్యమును చూడఁగలవారే ధర్మమును దెలిసి కొని యాచరింపఁగలరు. మనుష్యులమైన మనము సత్యధర్మముల రెంటినిఁ బరిపాలింపవలసినవారముగ నున్నాము. ఇందునుగూర్చి బుద్ధిమదగ్రగణ్యులయినవారికి నెక్కువగఁ జెప్పవలసిన పనిలేదు. కాఁబట్టి మీయాజ్ఞను శిరసావహించి నేనీయగ్రపీఠమున నధిష్ఠించుచున్నా"నని చెప్పి గోవిందభట్టాచార్యులవా రధ్యక్షపీఠము నధిష్ఠించిరి. "బ్రహ్మనాయుడుగా రింక మాట్లాడవచ్చు" నని యధ్యక్షుఁ డుత్తరువిచ్చెను.

బ్రహ్మ (లేచి)—మనుష్యుఁడు తలంచేది ఒకటి; దేవుఁడు చేసేది మఱొకటి.

బాలుఁడు—ఇది అందఱికీ తెలిసినరహస్యమే. మనుష్యుఁడు తలంచేట్టు వరమిస్తే దేవునిగొప్ప యేముంటుంది. ప్రతివాడూ రాజ్యమేలవలెనని కోరితే దేవుఁ డట్లా వరమిస్తే అంతా రాజులైపోతారు. ఇంక పరిపాలించే దెవ్వరిని ? అంతా చావులేకుండా కోరితే దేవుఁ డట్లా వరమిస్తే అంతా దేవుళ్లే అవుతారు. ఇంక కొలిచే దెవ్వరు ?

అధ్య—బాలుఁడా ! నాన్నగా రేదో చెప్పఁబోతున్నారు. నడుంగా అడ్డంతగులుతుంటే మాటలు తడబడిపోతవి. ఊడిపడవు. భావాలు తలక్రిందు లయిపోతవి వ్యవహారం సాగదు.

బ్రహ్మ—ఆశ అనేది ఆరంభప్రయత్నాలకెల్లా మూల మని అందఱికీ తెలిసినవిషయమే కదా. ఆశ చేతనే ఏపనికైనా చేయుటకు మనుష్యుఁడు ప్రయత్నిస్తున్నాఁడు. ఆశ లేనివాఁ డేపనికీ పూనుకో చాలఁడు. ఆశాప్రేరితులమగుటచేతనే మేము పందెము లొడ్డినాము.

జయాపజయాలు ముందుగా తెలిసేవి కావు. తొంపిలో స్తంభమువంటిది విజయము. పురుషప్రయత్నానికి దైవము తోడ్పడినప్పుడే ఫలమున్నది. దీనినే అదృష్ట మంటున్నారు.

కొమ్మ—ఆశ ఉండడ మనేది మనుష్యుని అభివృద్ధి కత్యావశ్యక మైనదే గాని అది హద్దుమీఱిపోయినచో దురాశ అనిపించుకొనును. అది దుఃఖము నిచ్చునే కాని సుఖసంతోషాల నీయజాలదు. అదృష్టాన్ని నమ్మి గాలిలో దీపం పెట్టి దేవుఁడా నీమహిమ చూపుమంటే యేమయినా ప్రయోజన ముందునా ? ఎవ్వరికీ అతిసంచయేచ్ఛ కూడదు. అన్న పంచి తమ్మునికి అర్ధరాజ్యం చేతికిచ్చినప్పుడు తృప్తిచెంది వున్నట్టయితే యింతముప్పు వాటిల్లకుండేది. తెలిసి తెలిసీ చేతులమీదుగా దీన్ని పోగొట్టుకోవడానికి కారణము పల్నాడంతా జయించి యేలవలెననే దురాశయే కదా ! నేనన్నానని కాదు. మీయంతట మీరాలోచించుకొని చూడండి. ఆశ అనేది మంచిదే కాని దురాశమాత్రం చెడ్డదని యిప్పటికైనా తోస్తే బాగుపడిపోతాము.

బ్రహ్మ—దేశం పరిపాలించే రాజు పందే లేర్పాటు చేసి ఆహ్వానం చేసినప్పుడు పోయి పందెం వేయుట రాజధర్మానికి విరుద్ధం కాదు. అది దురాశ కాదు. అనాదిగా వస్తూవున్న దేశాచారం. పందెంలో గెల్వగలమనేఆశ వుండుటమానవప్రకృతికి విరుద్ధం కాదు. జయాపజయాలు అదృష్టంతో కూడుకొన్నవి. ఆశచే పందెము లొడ్డినాము. అదృష్టము లేమిచే ఓడినాము. ఇందేమిదురాశ కలదో నాకు బోధపడ లేదు.

అల—నాయుకుగారూ ! ఎందు కీగతజలసేతుబంధనం? ముందుజరపవలసినతంతు విచారించండి.

బ్రహ్మ—మనం చేసేపని ముందు మనస్సునకు న్యాయంగా

బోయి తరువాత దేవుడూ లోకం మెచ్చేటట్టుగా వుండాలి. మనం చేసిన ప్రతిజ్ఞకు విరుద్ధంగా బోరాదు. సత్యవ్రతాన్ని విడిచి సత్యదూరులమై పోరాదు.

శాలు—మనది క్షత్రియధర్మం. రాజ్యం వీరభోజ్యం అన్నారు. రాజ్యం ఏమలది గాని సత్యవ్రతంబట్టే సన్యాసులదికాదు. కల్లజూదంలో పోగొట్టుకొన్నరాజ్యం కత్తితో గెల్చుకొందాము. మన మాయమాంవ్రవలె ఏమున్నా మాచర్ల విడిచి అరణ్యవాసం చేయనక్కరలేదు. మనం మాచర్ల విడువకుండా మనమండలం సంరక్షించుకొందాము. కత్తి చేతబట్టి పోరాడుదాము. గెలుస్తే పల్నాడు; ఓడిపోతే శ్మశానం వుండనే వుంది. పోనీ యింకొకటి ఆలోచించండి. వారితో మనం పోరలేమని తోస్తే ఎప్పుడో అరణ్యాలు దేశాలు దిమ్మతిరిగి వచ్చి పోరాడుదా మని దుర్భ్రమ పాలయి ప్రవాసకష్టాలలో మునిగి తేలడంకంటె “ఓనాగమ్మతల్లీ! ఓమహాంకాళీ! ఓఅంబశక్తీ! ఈరాజ్యం మాకక్కరలేదు. నీవే తీసికో” మ్మని చెప్పివేస్తే నాగమ్మే దయాదాక్షిణ్యాలు కన్పఱచి యింతపాలం యిప్పిస్తుంది; దున్నుకొని హాయిగా బ్రతుకవచ్చును. ఎందుకు మనకీ గొడవంతా? ఇన్నిప్రాణులకు మనతో బాటీ దుఃఖమంతా యెందుకు?

కొమ్మ—ఎప్పుడయినా మనం యుద్ధం చేయదలంచుకొంటే యిప్పటికంటె మంచిసమయం మనకు దొరకదు. నేడు మాచర్లను విడిచి పోయి ఎప్పుడో మళ్లీ వచ్చి యుద్ధం చేతామంటే నేల విడిచి సాముచేస్తానన డెంత నమ్మకంగా వుంటుందో అంత నమ్మకంగా వుంటుంది.

బ్రహ్మ—సత్యవ్రతమూ ధర్మరక్షణా కూడా ఎప్పుడు మానవధర్మము లైనవో క్షత్రియధర్మములుకూడా కాక మానవు. మానవే

ధర్మానికి విరుద్ధంగా వుండునది క్షత్రియధర్మం కాజాలదు. ఈరోటిని విడిచినవాడు మనుష్యుడనిపించుకొనుటకే అర్హుడు కాడు. ధర్మరక్షణకొరకు శత్రువును హింసింపరాదు. అది సాధ్యము కానప్పుడు పాటిపోవడం ధర్మం కాదు. రెండూ సత్యానికి విరుద్ధములే. పాటిపోవడంకంటె హింసించడమె మంచిది. మనము సత్యవ్రతం గాపాడుచు ధర్మాన్ననుసరించి పోయేవారమైనయెడల మొదట మా చర్లను అక్రమంగా తీసికొన్నామనే అపవాదు కూడా పోతుంది.

బాలు—నాన్నగారూ! ఎప్పుడు మీరు పల్నాటిని విడిచి కాలు బైట పెట్టెదరో అనుర్నాటినుంచీ శత్రుశేషం నిలిచి వుండరాదని ఆనాగమ్మ, ఆమహాంకాళి, ఆఅంబశక్తి మనవెనువెంట బడి వేధించి వేధించి మనరక్తమాంసాదుల హరింపక మానదు.

కొమ్మ—బాలుడు చెప్పినట్లు నాయకురాలు ముందుపెట్టబోయ్యేహింసలకూ, బాధలకూ పేడముద్దలలాగు ఒదిగి వుంటే సత్యవ్రతాన్ని ధర్మాన్ని రక్షించినవారమవుతాము. ఇంతేకదా మీ అభిప్రాయము.

బ్రహ్మ—ఒకప్రక్క అహింసామార్గ మవలంబించి మటొకప్రక్క ప్రతిక్రియకు బూనుకొన్నామంటే దుర్బలులమై నశించి పోతాము. అహింసావ్రత మవలంబించి మనశత్రువులను నిరోధించకుండా సత్య వ్రతము కాపాడుదుమేని మనము నశించి పోక క్రమక్రమముగా బలవంతుల మగుదుము. సత్యధర్మములబలమే బలము గాని దౌర్జన్యముతో గూడిన బలము బలము గాదు.

బాలుడు—బాగు. ఈయేడు సంవత్సరాలూ ప్రవాసాలలో కష్టాలు అనుభవించి అనుభవించి చితికిపోయినతర్వాత మీరు యుద్ధములో జయించలేరు సరిగదా యిప్పుడు మిమ్మాశ్రయించుకొని వున్న

బలగ మంతా క్రిమక్రమంగా జారిపోక మానదు.

అలరాజు—ప్రతిజ్ఞ నెఱవేర్చుకొని వచ్చినతరువాత పోరుతో అవసరం వుండదేమో.

బ్రహ్మ—ఎవ రెన్ని బాధలు పెట్టినా సహించి యీయేడు సంవత్సరాలూ గడపుకొని వచ్చినామంటే మనశత్రువులహృదయం కూడా మారిపోయి ఉభయులకూ శత్రుభావమే నశించి మిత్రభావమే గలిగి మనరాజ్యం మనకు సులభంగా లభించవచ్చును. అల్లా లభించకపోతే అప్పుడు మనకు యుద్ధమే శరణ్యము కాగలదు.

బాలుడు—మీరు సత్యవ్రతం పాటించి ప్రతిజ్ఞ నెఱవేర్చుకొన్నవా రయినా శత్రువులు కనికరించి మీకు మరల రాజ్య మిచ్చేది లేదు. అప్పుడు మీరు యుద్ధంచేసి గెల్చేది లేదు. ఏడుసంవత్సరాలూ బాధలు పడిపడి తరువాత చచ్చుటకంటె చావో గెల్పో యిప్పుడే యుద్ధంచేసి తేల్చుకోవడం నాఅభిమతం. నేను మీబిడ్డనై యుండి యింతకన్న అధికంగా జెప్ప లేను. తరువాత మీచిత్తం.

బ్రహ్మ—ఇప్పుడో అప్పుడో మనకు చావు నిశ్చయ మైనపుడల లోకము మెచ్చునట్లుగా మనప్రతిజ్ఞ చెల్లించుకొని తరువాత న్యాయంకొఱకు పోరాడి వీరస్వర్గమును గాంచుటయే వీరులకు ధర్మం.

పె. మ. దే. రా—మనగురువుగారు చెప్పునదే సరియైన దారి. మనమందరము మాఱుమాటాడక శిరసావహింపవలసినదే.

కొమ్మ—రాజుగారూ, మంత్రిగారూ ఏకీభవించినపు డింక మనము మాట్లాడవలసినపని లేదు.

అందఱు—తథాస్తు.

బ్రహ్మ—కొమ్మరాజుగారూ, మీ ..హ్మ, మీకొమారు

దఃన్నా మాకు ప్రవాసాలు చేసి కష్టపడవలసినప్రసక్తి యెంతమాత్రం లేదు. గురిజాలకు పోవుట మాఅభిమతం.

కొమ్మ—సౌఖ్య మనుభవించుకాలమున మీయాశ్రయమును బొంది యుండి కష్టకాలమునందు మిమ్మురు విడిచి పోవుట మాకెంత మాత్రమూ యిష్టం లేదు.

అల—నాఅభిప్రాయం కూడా అదే.

బ్రహ్మ—సరే. ప్రతిజ్ఞ పరిపాలించుట కంతా వప్పుకొన్నట్టే గదా. ఇఁక మనము మాచర్ల విడిచి యెక్కడకు పోయేది నిర్ధారణ చేయవలసి వుంది.

మ. దే. రా—అదీ మీరే స్థిరపఱచండి.

బ్రహ్మ—మనము గడువులోపల మాచర్ల విడిచి పోవలెను. కృష్ణ దాటి యావలకుఁ బోయినతరువాత విచారించుకొందాము! రేపటిదినమే మనము సమస్తమును తరలించుకొని పోవలయును.

అంత అధ్యక్షుఁడు గోవిందభట్టాచార్యులవారు లేచి "మహనీయులారా! సభాసదులారా! మీరు నాకీయగ్రపీఠము నొసంగి ధర్మనిర్ణయము చేసి న్యాయము చెప్పవలసిన దని కోరి యుండియు నెంతెంత భిన్నాభిప్రాయములు పుట్టినను వానిని సమన్వయించుకొని నాదెుక్కశ్రమను బాపి నన్ను ధన్యుని గావించినందుకు మీకెల్లరకు కృతజ్ఞుఁడనై యున్నాను. ఇట్లే యిక ముందుఁగూడ నేపని గావించినను మీరెల్లరు నైకమత్యముతో నుండి కావించినయెడల మీశత్రువులు మిమ్ము గన్నెత్తియైన చూడఁజాలరు. భగవంతుఁడు మీకు సర్వశ్రేయములు నొసంగుగాత." అని యుపన్యసించి సభను విరమించెను.

# అయిదవ ప్రకరణము.



అట్లు బ్రహ్మనాయుఁడు పౌరజనసభను ముగించి మాచర్లను విడిచి పోవుటకై ప్రయాణసన్నాహములను జరుపుచుండఁ గొంతసేపునకు గురిజాలసేనానులలో నొక్కఁడగు మాడుగల వీరారెడ్డియు, నాయకురాలి మిత్రకోటిలోనివాఁడగు ప్రతాపరెడ్డియు, నేనూఱుయుద్ధభటులతో మాచర్లకు వచ్చి చెఱువుకట్టక్రింద దండు విడిసిరి.

అట్లు దండువిడిసిన వీరారెడ్డి "పల్నాటిరాజ్యములోని మాచర్ల సీమకు మాడుగల వీరారెడ్డిగారిని నేఁటినుండి పాలకులుగ పల్నాటి ప్రభు వయినలగామరాజుగారు నియమించిరి. వీరుమాచర్లలోనే నివసింతురు" అని యూరంతయుఁ జాటింపించెను.

బ్రహ్మనాయునితోఁ బ్రవాసమునకుఁ బోనొల్లనిపౌరప్రముఖులు వచ్చి యాతని సందర్శించి కానుకలు సమర్పించుకొని యాతనిపరిపాలనము తమ కంగీకారమే యని వారివారియభిమతములను దెలుపుకొని యర్హమర్యాదలను బొందిరి. అటుపిమ్మట వీరారెడ్డి పౌరప్రముఖులను వెంట నిడికొని కొద్దిపరివారముతోఁ బట్టణములోనికిఁ బోయి రచ్చసావడికడ నిలిచి పెదమలిదేవరాజున కిట్లు సమాచార మంపెను.

"మేము కొండొకకార్యార్థము మాటాడుటకై పల్నాటిప్రభువు లగునలగామరాజుగారిచేఁ బంపఁబడితిమి. మీతో మాటాడుటకుఁ గొంచె మవకాశ మిప్పించుటకుఁ దాము పూనుకొన్నయెడల తమ్ము దర్శించుటకై తమసన్నిధానమునకు రానున్నారము."

ఈసమాచారమును బ్రహ్మనాయునికిని, కొమ్మరాజునకుఁ దెలిపి మలిదేవరాజు వారితో మంత్రాలోచనము గావించి 'రావచ్చు'

నని మరల వారికి వర్తమాన మంపెను. పీరారెడ్డి ప్రతాపరెడ్డిని పౌర ప్రముఖులను వెంటఁ బెట్టుకొని రాజగృహమునకుఁ బోయెను. అంత బ్రహ్మనాయుఁడును పెదమలిదేవుఁడును వారల నాదరించి వారల కుచితాసనముల నొసంగి సేమ మారయుచు ""మాతో నేమి కార్యము గలదో వివరింపుఁ" డని ప్రశ్నించిరి.

అంత ప్రతాపరెడ్డి ""మీయన్నగారీ లేఖను మాకిచ్చి మీతో గొన్నివిషయములు ముచ్చటించి మీయభిప్రాయమును దెలిసికొని రావలసిన దని నన్నుఁ రాయబారినిగాఁ బంపి" రని చెప్పుచు నాలేఖను మలిదేవరాజున కిచ్చెను.

అతఁ డాలేఖను జదువుకొని బ్రహ్మనాయుని చేతి కిచ్చెను. బ్రహ్మనాయుఁడు దానిని సాంతముగాఁ జదువుకొని అలరాజు చేతి కిచ్చెను. అతఁడు కూడ దానిని చదువుకొని తండ్రిమొగముపైపు చూచి చిఱునవ్వు నవ్వెను. వార లొండొరులమోములను జూచుకొనుచు కొన్నినిమిషములు మౌనముగ నుండిరి.

బాలనాయుఁడు వారివైఖరులను గనుఁగొని 'మరలనాయకు రా లెద్దియో యెత్తుగడ యెత్తియుండు' నని భావించి యూరకుండ జాలక 'ఏమి టీచిదంబరరహస్య' మని హెచ్చరించెను. అంత బ్రహ్మనాయుఁ డాలేఖను దీసికొని 'నీకెఱుకపడఁదగానిరహస్య మిందేమియు లే' దని చెప్పుచు నాలేఖను చదువుఁడని గోవిందభట్టాచార్యులవారి కిచ్చెను. అతఁ డీలేఖ నెల్లవారికి వినఁబడునట్లుగాఁ జదివి వినిపించెను.

లేఖ

"నాప్రియసోదరుఁ డయిన పెదమలిదేవరాజును మీయన్న నలగామరాజు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగా దీవించి వ్రాయున దేమన:—నీవును నేనును నరసింగరాజు నొక్కతండ్రి బిడ్డలము. మన

తండ్రి యీపల్నాటిరాజ్యమునకు శ్రేష్ఠుఁడ నగుటచేత నన్నుఁ బట్టాభిషిక్తునిఁ గావించినాఁడు. బ్రహ్మనాయుఁడు మనతండ్రికిఁ గొంతకాలము మంత్రిగ నుండి పిమ్మట నాకు మంత్రియై కొంతకాలము బహుసమర్థతతో రాజ్యభారమును నిర్వహించి జనస్తుతికిఁ బాత్రుఁ డయ్యెను. తరువాత కారణాంతరములచే నాగమ్మగారితోడను, నరసింగరాజుతోడను స్పర్ధ పెంచుకొని యితరులు చెప్పెడుమాటలను విని దురాలోచనముల కొడిగట్టి కుటుంబకలహములను బెంచి మిత్రులను మానుండి విడఁదీసి మమ్ము భయపెట్టి మీపోషణకై మాచర్లసీమ మాచే నిప్పించి మీమామమధ్యను శత్రుత్వమును బలపఱచి మమ్ము చెఱుపఁజూచెను గాని తుద కవి మీచెఱుపునకే కారణములయ్యెను. నీవు బ్రహ్మనాయునిమాటలు విని వృథాగాఁ జెడిపోయితి వని మేము మిక్కిలి విచారించుచున్నాము. కడచినదానికి విచారించిన నిసుమంతయుఁ బ్రయోజనము లేదు. బ్రహ్మనాయునికి నేను చేసినద్రోహ మేమియును లేదు. బ్రహ్మనాయుఁడు నాకు ద్రోహియై శత్రువుగ నుండుటకు కారణము గన్పట్టదు. నరసింగరాజు నాకెట్టివాఁడో నీవట్టివాఁడవు. నిజముగా నీపై నాకు ద్వేషము లేక యుండెను. అది నీవు గ్రహింపలేకపోయితివి. మేము నీకు భరణముగా నిచ్చినసీమను గోల్పోయి అడవులపాలయి పోవుచున్నందుకు నేనును, నరసింగరాజును, రాజబంధువులును మిక్కిలి పరితపించుచున్నాము. మీవిపత్తునకు నాయకురాలుకూడ పరిదేవనము సలుపుచున్నది. అల్లుఁడు అలరాజును కూడ బ్రహ్మనాయుఁడు చీలఁదీసి మహారాజువలెఁ గుడిచి కూర్చుండవలసినవాని నడవులవెంటఁ ద్రిప్పుటకు జాలిగొనకున్నాఁడు. కొమ్మరాజుగారికైనను వివేకము లేకపోయినది. వారల కెప్పుడయిన నేనపకృతి సలిపితినా? చెప్పుఁడనుము. పల్నాటిరాజ్యము బహుస్వల్పమైనది.

మీవలె భూరమాదేవిపుత్రు లయిన కామరాజు, నరసింహరాజు, ఝుట్టిరాజు, పెరుమాళ్లరాజును తిరుగఁబడి పంచుకొనుటకుఁ బ్రయత్నించిరా? పల్నాటిరాజ్యములో నారికిమాత్రము భాగము లేదా? అయితే నేమి నాతోఁబాటు వారు రాజ్యభోగము లనుభవింపకుండ నున్నవారా? నాతో నున్న మీకు లోప మేమి రాఁగలదు? పల్నాటి రాజ్య మెనిమిదిభాగములుగాఁ జేర్చి పంచుకొన్నయెడల పరరాజ్యము లవారు మనరాజ్యభాగములను సులువుగా మ్రింగివేయవచ్చును గదా? ఇయ్యది మనవంశమునకును, మనపూర్వులకును గౌరవము తేఁగలదా? భూరమాదేవిపుత్రులతో సమముగా మిమ్ములను జూచుటకు నాకేవిధమైన యాతంకమును లేదు. సోదరుల మందఱము గలిసి యున్నయెడల మనల శత్రువులుఁ గన్నెత్తి తేఱిపాఱఁ జూడఁగలరా? అయిన దేమో అయినది. రాజ్యమును విడిచి యేడేండ్లు ప్రవాసమున నుండునని పందె మొడ్డి నీవోడిపోయినను నిన్నుఁ బ్రవాసమున కంపుటకెంతమాత్రము నామన స్సిష్టపడకున్నది. నా రాజ్యములోనుండి నరసింగరాజుతోఁబాటు సమస్తభోగము లనుభవింపవచ్చును. నీవు మంత్రిగఁ గాని, సేనానివిగఁ గాని, యుండవచ్చును. బ్రహ్మనాయుని విషయములోఁగూడ నాకాతఁ డెంతయపకృతిఁ గావించినను నేనాతని మంత్రిగ స్వీకరించుటకు రవంతయైన సందేహము లేదు. “నాసోదరి యగునాయకురాలిపట్ల నేనపరాధము గావించితిని; నేను పొరఁబడితిని ఆమెయెడ నాకు దురభిప్రాయము లే”దని నల్వురయెదుటఁ జెప్పినఁ జాలును. అతనికొఱకు నేను మంత్రిత్వము వదలుకొందునని నాయకురాలుకూడ వాగ్దత్తము చేసియున్నది. తమ్ముఁడా! నీవు మరల నాతోఁ జేరుట యవమానకర మని తలపోయకుము. నేను మీయన్ననుగాని పరరాజును గానని తెలిసికొని మఱి విచారించుము. మీప్రి

వాసమువలన మీతోఁబాటు ఎన్నెన్నికుటుంబములవారో బాధపడ వలసి యుందురు. నామాట వినకపోయినఁ దప్పక చెడిపోవుదువు. వింటివేని మీరును మేమును గూడ సుఖపడుదుము. ఇట్లు మీ శ్రే యోభిలాషి. నలగామరాజు వ్రాలు.”

బ్రహ్మ—దీనికి ప్రత్యుత్తరము ప్రభువుగారే చెప్పవలయును.

రాజు—అందఱును చెప్పవలసినదే గాని మాగురువుగారియభి ప్రాయమును విన్నమీదటఁ గాని యెవరము మాట్లాడుటకు సాహ సింపఁజాల కున్నాము.

బ్రహ్మ—తమ్ముఁడు చేసిన యపకృతుల నన్నిటిని మఱచి యా చార్యబుద్ధితో అంతప్రేమతో పూర్వమువలెఁ దనకడనుండి తన్నుఁ గొల్చి యుండవలసిన దని తమ్మునికి వ్రాసినప్పుడు ప్రభువుగారు అన్నగారియాజ్ఞను శిరసావహించుట సర్వశ్రేయములకు మూల మనుట సంశయింపరానిది. బ్రహ్మనాయుని చేరుటచేత కష్టములు సంప్రాప్త మయినవి. బ్రహ్మనాయుని వీడిపోవుటచేత కష్టములు తొలఁగిపోవును.

బాలుడు—మనము పట్టి వెఱ్ఱివెంగళప్పలము. నాయకురాలి తెలివితేటలతో మన తెలివితేటలు దీటురాక యున్నవి. నాయనగారు సత్యవ్రత మవలంబించినవారు. నాయకురాలి వాక్యములను సత్యవా క్యములనుగా శిరసావహించి యామె చెప్పినట్లు చేసి మరల నలగామ గామరాజుగారికడ మంత్రిత్వమునుబొంది నాయకురాలితో మైత్రి నెఱ పుచుంట నిజముగాఁ బల్నాటిరాజ్యము నుద్ధరించుటవంటిది. అందుకు సందేము లేదు.

బ్రహ్మ—బాలనాయుడా! “అపరాధము చేసితిని తల్లీరక్షిం పు”మని నాగమ్మకాళ్లపైఁ బడుమందువా యేమి? ఛీ! ఐతమ్మగర్భ మున నెట్టిపాపివి పుట్టితివిరా?

బాల—ఎవరికైనా ఉన్నమాటంటే ఉలుకెక్కువ. నాయకు రాలుకోరినది క్షమాపణము గాదు. పశ్చాత్తాపము వెలిపుచ్చినం జాలు ననుచున్నది.

ప్రతాపరెడ్డి—అవును. నాయకురాలు కోరునది పశ్చాత్తాపము దెలుపు మని కాని క్షమాపణము కోరవలసిన దని కాని కాదు. మీరు కోరినయెడల ఆమెగూడ పశ్చాత్తాపమును మీనల్వురియెదుటను దెలుపఁగలదు. ఇయ్యది నిర్బాధకమైన విషయము. ఇది యెవ్వరికి నెంతమాత్రము నవమానకర మగునది కాదు.

బ్రహ్మ—ఇది తననిర్దోషిత్వమును మాటుపఱుపఁ గోరి నాగమ్మ యెత్తిన యెత్తుగడను దెలుపులేఖనిగాని నలగామరాజు తనసోదరులపట్ల నిష్కల్మషమైన ప్రేమను జూపులేఖని కాదు.

రాజు—ఆమాట నిశ్చయము.

బ్రహ్మ—ఒకమారు ఆజ్ఞ సేయుటకు సాహసించినప్పుడు రెండవ మారు సాహసింప కుండు రని విశ్వసించుట కనువుపడునా? ప్రతాపరెడ్డీ! ఆమాయలమారియాఁడుది నాగమ్మతో సాటి చేసి నాయాత్మగౌరవమును బోఁగొట్టుకొను మందువా?

బాల—సత్యవ్రతము పేరు చెప్పుకొని రాజ్యభోగములను విడిచి సన్న్యాసులై అడవులలో నేడేం డ్లష్టకష్టము లనుభవించి చచ్చిపోవుటకంటె ప్రతాపరెడ్డి కోరినటు లాచరించుటయే సత్పురుషధర్మము. అట్లు కాదేని వీరాధివీరులై రణరంగమున కుఱికి యుద్ధము చేసి విజయార్జనము సేయుటయో లేక ప్రాణము లర్పించి రణభూమిని బ్రుగ్గుటయో వీరపురుషధర్మము. మనము రెంటికిని జెడ్డ రేవడులమయి పోయినాము.

రాజు—మాఅన్నగారిమాటలు నమ్మి నేను గురిజాల ప్రవేశించితినా తానేదో మిష గల్పించి నాగమ్మ నన్ను హతముచేయక

మానదు. మనుగుడుపుగా నింతవఱకు నన్నుఁ గంటికి ఱెప్పవలెఁ గాచుచున్నాఁడు. ఒక్కనిమిషమైనను నాయుని విడిచి నేనుండఁజాలను.

బ్రహ్మ—వేయుమాట లేటికి? నాగమ్మకు నాకును బొత్తు కుదురదు. పల్నాటను నాగమ్మయైన నుండవలెను. నేనైన నుండవలెను. ఇద్దఱ ముండుట సంభవము గాదు. ఏమన నలగామరాజు నాగమ్మను విడిచి యొక్కనిమిష ముండఁజాలఁడు.

కొమ్మ—సౌఖ్యము లనుభవించునపుడు వీరితో నుండి కష్టము లనుభవించునపుడు వీరిని విడిచి పోవుట సత్పురుషలక్షణమును సద్బంధులక్షణమును గాదు. మేము వీరిని విడిచి గురిజాలకు భోగము లనుభవించుటకు రాఁజాలము.

అలరాజు—ప్రతాపరెడ్డిగారూ! నాతల్లిదండ్రు లడవులలోఁ బడి కష్టము లనుభవించుచుండఁగా నేనత్తవారింటఁ గూరుచుండి మహారాజువలె విందులు గుడుచుచుండునట్టి మందభాగ్యుఁడను గానని మామామగారికి నాపలుకులుగా విన్నవింపుఁడు.

బాలు—ఇఁకముం దేడేండ్లకు పిమ్మటను పల్నాటను జరుగఁబోవు యుద్ధరంగమున వీరశయనముపైఁ బన్నుండి హాయిగా దీర్ఘనిద్రఁ గాంచెడు వీరులకు సమాధులను నిర్మించుటకై యిప్పటినుండి యుపకరణములను ప్రోగుచేయుచుండుట కర్తవ్యమని నేను మనవిచేసితి నని నామాటలుగా మీరు రాజుగారికి నివేదింపుఁడు.

వీరారెడ్డి—ఇఁక సంధి పొసఁగదనుమాట.

రాజు—అన్నమాటే.

ప్రతాపరెడ్డి—తథాస్తు. ఇఁక మాకు సెలవు.

అంత ప్రతాపరెడ్డియు, మాడుగల వీరారెడ్డియు వెంటనే లేచి తమవిడిదలకు వెడలిపోయిరి.

---

## ఆఱవ ప్రకరణము.

—— : : ——

అట్లు బ్రహ్మనాయుఁడు ప్రతాపరెడ్డిని వీరారెడ్డిని బంపివేసి తనతో వచ్చుటకు సంసిద్ధులైన మున్నూఱుకుటుంబములవారిని ప్రయాణమునకు సన్నద్ధపఱచి, వారివారి వస్తుసామగ్రిల నెడ్లపైని గుఱ్ఱములపైని నెక్కించి యాఁడువాండ్రను, బిడ్డలను, వృద్ధులను కొండెడ్లబండ్లలోఁ గూర్చుండఁబెట్టి వందలకొలఁదియువకులైన వీరులు పశుబృందములను దోలుకొని వెంటరా తెల్లవాఱగట్ల మాచర్లను విడిచి మాచర్లపౌరు లాహాకారములు సలుపుచుండ, వీరారెడ్డియు వాని సైనికులు నాశ్చర్యపడి చూచుచుండ జంకును గొంకును లేనిమానసముతో బయలుదేఱి పోవువఱకుఁ బ్రతాపరెడ్డి యచట నుండి పిమ్మట తానును బయలువెడలి గురిజాలకు వచ్చెను. మాఱుగలవీరారెడ్డి రాజగృహమును స్వాధీనము చేసికొనియెను. తక్కినగృహములను సైనికుల కొసంగెను.

ప్రతాపరెడ్డి భోజనము చేసి మధ్యాహ్నము మూఁడుజాముల ప్రొద్దుండఁగా నాయకురాలు రాజమందిరమున నున్నదనుసమాచారమును దెలిసికొని యచటికి వచ్చెను. అపుడు నలగామరాజు, నరసింగరాజు నాగమ్మ మందిరమున మాటాడుచుండి ప్రతాపరెడ్డి వచ్చిన వార్త విని లోనికి రప్పించుకొనిరి.

ప్రతాపరెడ్డి బ్రహ్మనాయునితోను, మలిదేవరాజుతోను జరిగినసంభాషణతీరంతయుఁ బూసగ్రుచ్చినటుల వినిపించెను. వారెవ్వరును తాను గొనిపోయిన లేఖలోని విషయములు విశ్వాసపాత్రములుగా గ్రహింప లేదని విశదపఱచెను. ఇఁక యుద్ధమే గాని సంధి

పొసఁగనేరదని తెలియఁజెప్పెను. మఱియు బ్రహ్మనాయుఁడు మున్నా కుటుంబములతో సూచర్ల విడిచిపోయినరీతినిగూడ వివరించెను. అటు పిమ్మట నలగామరాజు పరితాపరెడ్డిని బుపివేసి నాయకురాలితో నిట్లు పలికెను.

నలగా — నాగమ్మగారూ! అన్నియు బాగుగ జరిగినవి గాని యొక్క విషయముమాత్రము నాకు దుఃఖము కలిగించుచున్నది.

నాగ — అదియేమి? ప్రభూ!

నలగా — నాకొమార్తె పేరమ్మవిషయము. అల్లుడు శత్రువు లలోఁ గలిసిపోయినాఁడు.

నాగమ్మ — అవును. పేరమ్మకు బాల్యములోనేభర్తతో నెడఁబాటు సంభవించినది. ఏమి చేయుదాము?

నలగా — చేయున దేమియును గన్పడదు. అలరాజు అనవసరముగా ఆడవులకుఁ బోయినాఁడు. ఇక్కడ నున్నయెడల మహారాజులా గుండవచ్చునే.

నాగ — తనతల్లిదండ్రులను వదలి అత్తవారింటఁ జేరిన లోకు లేమందురు?

నలగా — తనతల్లిదండ్రులనుగూడఁ దీసికొని రావచ్చునుగదా.

నాగ — తనచెల్లెలిని, మలిదేవరాజుభార్యను వదలి కోడలిగారి పుట్టినింటికి సుఖపడుటకు వచ్చినయెడల లోకులు కొమ్మరాజునుమాత్రము నిందింపరా?

నరసింహరాజు — ఇదంతయు విధివిహితమైన కర్మవలన నైనది గాని మఱియొకటి కాదు. మన పేరమ్మను భర్తకడకుఁ బంపుద మని యనుకొన్నను వారు రాసి అంపానఁ బెట్టుదురు. ఏడేండ్లు గడపవలయును. ఇది పదునాల్గేండ్ల బాలికకు కడు దుర్భరము. ఎక్కో యూమెను

సమాధానపఱచి దుఃఖోపశమనము చేయుచుండవలయును.

నలగా—ఇప్పటికి నొకరీతిగాఁ గట్టెక్కితిమి. మాచన్నసేనను మరల పల్నాటిరాజ్యములోఁ గలుపుకొనఁ గల్గితిమి. ఇదంతయు నాగమ్మగారి చలువ. తరతరములనుండి బ్రహ్మనాయునిపూర్వులు మా కుటుంబముపాత్రిపుననే ప్రతిష్ఠను గాంచినది మఱచి తుదకు కుటుంబ కలహములను బెంచి తానే దిక్కని నమ్మికొన్న మమ్ము మోసము చేసి యనేకవిధముల బెదరించి రాజ్య మవహరించిన బ్రహ్మనాయుని కృతఘ్నత తలఁచుకొన్నప్పు డెల్లను దుఃఖము పొరలిపొరలి వచ్చుచుండును. కావలసినవాండ్రు సైతము శత్రువులలోఁ గలిసిపోయి పన్నుకుకుతంత్రములకు మారాజ్యము చిక్కులలోఁ దగుల్కొని చితికిపోవనున్నసమయమున కొండవలె నడ్డపడి బుద్ధియందు బృహస్పతిని మించిననాగమ్మగా రుద్ధరించినవిషయము మేమెన్నఁడైన మఱతుమా?

నాగ—దీనిని మీరింతగా శ్లాఘింపవలదు. మీరాజ్యములోఁ బుట్టి పెఱిగి మీరు పెట్టిన ఉప్పు, పులుసు, కారములను దినుచు మీకును, మీరాజ్యమునకును, మీదేశమునకును నావంటియబల సేవ చేయుట యొకగొప్ప కాదు. మీరాజ్యమున సమస్తజనులు సుఖించునట్లు మీరు పరిపాలింపవలయు నని చూచుచుందును. ప్రజలకొఱకు రాజుగాని రాజుకొఱకు ప్రజలు గాదు. రాజనువాఁడు ప్రజలపాలిటి పెన్నిధానముగ నుండవలయునుగాని ప్రజలపాలిటి పెనుభూతముగ నుండరాదు. రాజ్యమునకు వెల్పల నుండు శత్రువులను గాక ముఖ్యముగ రాజ్యములోపల నుండుశత్రువులను రూపుమాపవలయును.

నలగా—ఈరాజ్యభారమున నంతయు నిదివఱకే మీపై వైచియున్నాను. దీనిని సరళముగా మోయుకొని పోవుబాధ్యతను పూర్ణముగా మీకే విడిచిపెట్టి యున్నాను. నాగమ్మగారూ! ఈరాజ్యమును

మీయిష్టము వచ్చినట్లు పరిపాలించి మాకును మావంశమునకును యశస్సును దెత్తు రని నమ్ముచున్నాను.

నాగ — అందు కొంతమాత్రమును సందియము లేదు. ఏమియు భయము లేదు. పల్నాటిరెడ్లందఱు విశ్వాసపాత్రులు. వారెల్లరు మనపక్షమున నున్నారు.

నరసింహ — నాగమ్మగారి కట్టిధైర్య ముండవచ్చును.

నాగ — నరసింగరాజుగారి కేదో యనుమానము పుట్టినది.

నరసింహ — మతేమీ అనుమానము లేదు. "బ్రహ్మనాయునిఁ బ్రవాసమునకుఁ బంపితిమిగదా. ఇఁక నేడేండ్లవఱకు మనము హాయిగా నిదురింపవచ్చు" నని యేమరి యుండరాదు.

నాగ — అవును; అది యెవ్వరు కాదందురు ?

నరసింహ — బ్రహ్మనాయుఁడు ప్రవాసమునకుఁ బోవుటకు ముందు మాచర్లలో నొకసభ గావించి భవిష్యత్కార్యక్రమమును గూర్చి చర్చించెను. ఆచర్చలో బాలనాయుఁడు మొదలగువారు మాచర్లను విడిచి ప్రవాసము పోవుట కూడ దనియు, వీరపురుషోచిత ధర్మము ననుసరించి ఖడ్గములను ధరించి ఇప్పుడే గురిజాలపై దండెత్తిపోయి యుద్ధము చేసి సాధ్యమయినపక్షమున గురిజాలకూడ నాక్రమింపవలసినదే యనియు వాదించిరి. ప్రస్తుతము యుద్ధము చేసి జయింపలేమని బ్రహ్మనాయుఁడు నచ్చఁజెప్పఁగా వారు తమవాదములను విరమించినారు. కాని వారాతలంపులను విడిచిపెట్టలే దని తెలియుచున్నది. హాయి యుద్ధము చేయక మాన రని ప్రతాపరెడ్డికూడ నిప్పుడే చెప్పి పోయెను.

నలగా — అయితే యిప్పు డేమి చేయుమనెదవు ?

నరసింహ — ఏడుసంవత్సరములు ముగిసిన తరువాతనైన వారు

యుద్ధము చేయక మాచర్లసీమను విడిచిపెట్టువారు కారు. వారు సేనలను సమకూర్చుకొని యేయపరాత్రివేళ మాచర్లమండలముపైఁ బడి స్వాధీనముఁ జేసికొందురో యిప్పుడు చెప్పలేము. పల్నాడు సరిహద్దు ప్రదేశములో నొకసేనానివేశవస్థానము నేర్పఱచుకొన్న యెడల సకాలములో శత్రువులవాడి నడ్డగించి వారిని పాఱఁదోల వచ్చును.

నాగ — నరసింగరాజుగారు మంచిదూరదృష్టి గలిగియుండి చెప్పినమాట కాని మఱియొకటి కాదు. ఆపని అవశ్యము జరుపుదము.

నరసింహా — అన్నగారూ! ఒడంబడికప్రకారము వారేడేండ్లు నడుచుకొని తిరిగి వచ్చి రాజ్య మీయవలసిన దని కోరిన మీరేమని యెదరు ?

నలగా — మరల నెప్పుడును వారికి రాజ్య మీయఁదలంచుకొన లేదు. అప్పుడు రాజ్య మీయఁ బూనుకొన్నప్పుడు, ఇప్పుడు వారిని రాజ్యమునుండి వెడలఁగొట్టుటవలనఁ బ్రయోజన మేమి ?

నాగ — ఒడంబడికప్రకారము రాజ్య మీయుఁడని వారు కోరినప్పుడు కాదని యేమిహేతువు చెప్పఁగలరు?

నలగా — రాజ్యము మాదికాని మీదికాదని చెప్పివేయుదును.

నాగ — వారు కత్తి పట్టుటకు సిద్ధపడిన నేమిచేయుదురు ?

నలగా — యుద్ధమే.

నరసింహా — యుద్ధము జరుగు నని నాకావంతయు భయము లేదు. కాని అలరాజు సంధిప్రయత్నములు గావించి అన్నగారిమెడలు విఱుచునేమో యని సంశయము బాధించుచున్నది. అన్నగారికి మొగమాట మెక్కువ.

నలగా — నాయల్లుఁడూ వానితండ్రి శత్రువులతోఁ జేరి వారి బాగోగులు తమవని యెప్పుడు తలంచి విడిపడ్డారో అప్పటినుండి

వారితో నాకు ఋణానుబంధము చెల్లిపోయినదనుమాటే కాదూ !

నరసింహ—ఇప్పుడే గాదూ మనపేరమ్మనుగూర్చి విచారించితిరి? మీరు గుండెదిటవు గలవారు కారు. ఒక్కమాటమీఁద నిలువలేరు.

నలగా—ఏమో పేగుసంబంధము గనుక మనస్సు కొంచెము పీకుచుండుమాట వాస్తవమే గాని యీమాట గుండె రాయిచేసికొన్నాను.

నరసింహ—అట్లనుకొనుచున్నారు. కాని తండ్రిగుండె కాదా?

నాగ—మీరు మొదట మాచర్ల వారి కొసంగినారు. ఏడు సంవత్సరములు జరిగిపోయినతరువాత తిరుగ నిచ్చెదమని యొడంబడిక జరిపినారు. ఒడంబడికల ప్రకారము జరపునెడల మీకెంతమాత్రము పట్టుండదు.

నలగా—మొదటి ఒడంబడిక నేనంగీకరించినది కాదు. అది పెద్దమోసము. బ్రహ్మనాయుఁడు అబద్ధములాడి భయపెట్టి వ్రాయించుకొన్నది.

నాగ—అట్లయిన రెండవదికూడ నిలువదు. రెండవదానియుద్దేశము మొదటిదానిని నేర్పుతో తుడిచిపెట్టుటయే కాదూ ?

నలగా—అనే దానిభావము.

నరసింహ—అట్లయిన వారు యుద్ధమునకు రండని వర్తమానము చేయువఱకు గోళ్లు గిల్లికొనుచుఁ గూర్చుండక సమయముచూచి ఉత్పాతముగా మొత్తడమే రాజనీతి.

నలగా—నీవూ నాగమ్మగారూ రథ మెట్లు సాగించిన నట్లు నడువఁగలను. మీరథగమనమునకు నేనడ్డువచ్చువాఁడను గాను.

నాగ—రాజా! నాబొందిలో ప్రాణ మున్నంతవరకు పల్నాడు విభాగము గాకుండను, ఏకచ్ఛత్రముగ నీవే పరిపాలించునట్లును చేయుదును. నాగమ్మప్రతిజ్ఞ బ్రహ్మనాయునిప్రతిజ్ఞవంటిది కాదు.

ఇట్లు నాగమ్మ పునఃప్రతిజ్ఞ గావించి సోదరుల కపారముదమును గలిగించి వారలకడ సెలవు గైకొని నిజసదనమునకు వెడలి పోయెను.



# ఏడవ ప్రకరణము.



అట్లు బ్రహ్మనాయుఁడు సమయబద్ధుఁడై సపరివారముగ దేశము విడిచి, ప్రవాసము పోయి, కృష్ణానదిని దాటి, కొంచెము దూరములో నడవిలో దిగి, పెద్దపెద్దచెట్ల నన్నిటినిఁ గొట్టించి, చిట్టడవినంతయు శుభ్రపఱిచి యూరు కట్టుకొని యందు నివసించుచుండెను.

ఊరునకుఁ బడమరభాగమునను, దక్షిణభాగమునను పెచ్చు పెఱిగియున్న యడవులలో లేఁతపచ్చికలను మేయుచు, చలమలలోని నీళ్లు త్రాగుచు వారిపశుబృందము పెఱుగుచుండెను. వారు మాచర్లలో నుండునప్పుడు మాచర్లకు నాలుమైళ్లదూరములో నున్న మందాడి యనుగ్రామము వారిపశుబృందమున కావాసముగానుండుటం జేసి యాగ్రామనామమునే తాము క్రొత్తగా నిర్మించుకొన్నయాగ్రామమునకుఁ బెట్టుకొని వ్యవహరించుచుండిరి.

అదివఱకు కాయడవులలో స్వేచ్ఛగా విహరించుచుండు చెంచువాండ్రకు వీరిరాకవలనఁ బెక్కుబాధలు కలుగుచు వచ్చినవి. అచ్చట రెండేండ్లకాలము గడపునప్పటికి నాచుట్టుపట్ల నాలుగామడలవఱకు కీకారణ్యముగా నున్నప్రదేశ మంతయు బట్టబయ లయి యెచ్చటఁ జూచినను బ్రహ్మనాయుడుగారి పశుబృందమునకు విహారభూమి యై పోయినది.

గడ్డ పుట్టినప్పటినుండియు నివసించుచున్న యాటవికులగు చెంచువాండ్రకు వంట చేసికొనుటకు కట్టెలు, పశువు నోటఁ గఱచుటకు గడ్డిపరకలును కఱవై పోయినవి. చెంచుగూడెమునకు వంద వచ్చినది. వారికి భూమిమీఁద నిల్చు కొంపు లేక పోదెసువులు సంభవించినవి.

వారు బ్రహ్మనాయునిబలగమును జూచినప్పుడు బెదరి పోయి పఱు
విడుచుండిరి గాని యెప్పుడు నిట్టి యాతంకమును గలిగించి యుండ
లేదు.

ఇట్టిదుర్దశ భరింప శక్యము గాకుండుటఁ జూచి చెంచులంతయు
నాలోచించుకొని బ్రహ్మనాయుని ప్రవాసవృత్తాంతము నంతయుఁ
దెలిసికొన్నవారయి యొకచోఁ గూడి తమ బ్రదుకుదెరువు గల్పింపవల
సినదిగా వేఁడికొమ్మని గురిజాలరాజుగారికడకుఁ దమనాయకునిఁ బంప
నిశ్చయించుకొనిరి.

బ్రహ్మనాయుని పశుబృందమున కంతటికిని లంకన్న యను
మహావీరుఁడు రక్షకుఁడుగా నియమింపఁబడి యుండెను. కొన్నిదినము
లు జరిగినవెనుక చెంచుల నడవడిలో మార్పు గన్పట్టినది. అదివఱకు
బ్రహ్మనాయునిగోవులమందలను గాయు గోపాలురు బెదరించినమా
త్రాన చెంచులు బెదరి చెల్లాచెదరై పోవుచుండెడివారు. అట్టివా
రిపుడు గోపాలురను బెదరించుచుండిరి. మఱికొన్నిదినములకు మేఁత
కు దూరముగాఁ బోయినగోవులమందలపైఁ బడి చెంచులు వందలకొ
లఁది గోవుల నపహరించి తోలుకొని పోవుచు వచ్చిరి.

దీనినంతయు గోపాలురవలనఁ దెలిసికొని లంకన్న గోవులను
చెదరి దూరముగాఁ బోనీయక దగ్గఱ బయళ్లలోనే మేపుకొని మబ్బు
పడకపూర్వమే తొట్టిపట్లకుఁ జేర్చి తెల్లవాఱువఱకు కావలి యుండి
దొంగలపాలఁ బడకుండఁ గాపాడుచుండెను. అప్పటినుండి ఒక్కగో
వయినా చెదరి తప్పిపోయి చెంచులకుఁ జిక్కలేదు. అందువలన చెంచు
లందఱు లంకన్నను జంపివేయవలయు నని పగఁ బట్టి యుండిరి.
ఇట్లుండ నొకనాఁడు మలిదేవరాజు తనయింటిలో సభదీర్చియుండఁగా
కనకదాసుతోఁ గూడ బ్రహ్మనాయుఁడు ప్రవేశించి యిట్లనియెను.

బ్రహ్మ—మహాప్రభూ! మనము పల్నాటిని విడిచి ప్రవాసము చేయుటప్పటినుండియు మనయావులమందలను కంటికి ఱెప్పవలెఁ గాచుచు మనకేవిధమున కంతకుఁ బెట్టనికోటగా నుండి రక్షణము సలుపుచు పరమార్థము సముపార్జించుచున్న మనలంకన్న వీరస్వర్గము గాంచినాఁడు.

రాజు—ఏమి? ఏమి? ఏమిఆశ్చర్యము? లంకన్ననే? ఎవరు చంపినారు?

కనము—ఎవరా? చెంచులుబాబూ!

రాజు—చెంచులా! వాండ్ర కంతశక్తి యెక్కడిది? మనవాండ్రను జూచి బెదరి పఱువిడుచుండెడివారి కింతశక్తి యెక్కడినుండి వచ్చినదబ్బా.

బాలచంద్రుఁడు—మనఅంబశక్తి, మహంకాళి, ఉండనే ఉన్నది కదా.

రాజు—మనవీరుడు లంకన్న యెట్లు వీరమరణము గాంచెనో ఆ చరిత్రము నొకింత నాచెవిని వేయుఁడు.

బ్రహ్మ—అబ్బా! చెంచువాండ్రిపగ త్రాఁచుపాము పగవలె నున్నదే. ఎందుకో యీపగ.

బాలుడు—ఎందుకో చెప్పనా యీపగ. మనబ్రదుకుకోసము వాండ్రబదుకు చెఱిచినాము. పగ కింతే కారణము. తరువాత అంబశక్తి మహంకాళి నాగమ్మ తోడ్పడినది. లోకాలతీరంతా యింతేకాదూ? బలవంతుడిదే రాజ్యము. బలహీనుఁడు ప్రవాసాలు పట్టవలసినదే. ఈప్రపంచరహస్యము తెలిసికొన్నవాఁడే వివేకముగల మనుష్యుఁడు.

రాజు—మన బాలనాయునిమాటల కేమి గాని, ఏదీ కనమదాసూ! ఆవీరచరిత్ర మొకమాఱు విన్పింపుము.

కనమ—తమ నడవడిలో మార్పు చూపిస్తూ చెంచులు గడచిన రాత్రి గుంపులుగుంపులుగాఁ గూడి విల్లంబులు కత్తులు చేఁబూని జయలు వెడలి వచ్చి—

రాజు—చెంచులకు కత్తు లెక్కడివి?

బాలుడు—మాప్రభువుగా రింతయమాయకు లగుటచేత నే వీర శిఖామణుల కీగతి పట్టి యడవులపా లయిపోయినారు. బాలుఁడ నని కాఁబోలు నామాటలు కొఱగాకున్నవి. మనఅంబశక్తి, మహాంకాళి, నాగమ్మ బ్రదికియున్నంతవఱకు చెంచులకు కత్తులకు కొదవుండునా?

కనమ—నేను చెప్పేదంతా వినండి. ఒకచెంచు నాచే దెబ్బ తిని చిక్కితే మీకు తోచినసందేహమే నాకూ తోచి 'చెంచూ! మీకీకత్తు లెవరిచ్చినా' రని ప్రశ్నిస్తే తమనాయకుఁడు గుఱిజాలకు పోయి నాయకురాలిని సందర్శించి మాకు చేదక్కిన యావులలో సగం సమర్పించుకుంటా నని చెప్పి ఒప్పందము చేసి రెండువందలకత్తులు పుచ్చుకొని తెచ్చి యిచ్చినా డని చెప్పినాడు.

బాలుఁడు—నేను చెప్ప లేదా?

కనమ—తమవాత నోదారగాతూ! కొన్నిగుంపులు గోవులనూ, మఱికొన్ని గుంపులు గోపాలురనూ ముట్టడించినవి. గోవులన్ని తమ లేగదూడలను నడుమను బెట్టుకొని మూఁడుచుట్లుగాజుట్టి మోగ్గరించి నిలిచినవి. అంత చెంచులు బాణాకత్తులూ, పొడవయిన కత్తులూ చేబూని అడవంతా మాఱుమ్రోయునట్లు బొబ్బలు పెట్టుచూ పైబడిరి. వాటిలో మొదటిచుట్టు వరుసలో నున్నగోవు లన్నియు వాటిముట్టె లోరవంపుగా బెట్టుకొని తోక మట్ట లెగబెట్టి బుస్సుమని బుస్సలు కొ

ట్టుతూ ముందుకు చెంగలించి ఒక్కుమ్మడి భూమికి కొమ్ములతో చీల్చి, డొక్కలలో గ్రుచ్చి యెత్తి, గిట్టలతో మట్టి చెంచులను పచ్చడి గావించి విడిచిపెట్టినవి.

బ్రహ్మ—బలేపసరాలు. పల్నాటిగడ్డను పుట్టిన పసువులకు కూడా పౌరుషము కలదనుమాట తేటపఱచినవి.

బాలుఁడు—అవును. పల్నాటఁబుట్టిన పురుషులు పౌరుష విహీనులై ఆడువానిముందు నిలువలేక అడవులు పట్టి ఆకలములను దిని ప్రవాసాలు జరుపుచుంటే పల్నాటఁ బుట్టిన పశువు లయినా పల్నాటిపౌరుషమును లోకానికి ప్రదర్శించినందుకు ఎంతయినా మెచ్చుకోవలసినదే గదా!

బ్రహ్మ—పల్నాటిపచ్చికలో పుట్టిన పౌరుషము పసరాలలోనే నిలిచిపోలేదు. పండి పాతళ్ళు నిండి పల్నాటివీరుల దేహాలలోని రక్తములోగూడ వెల్లువగట్టి ప్రవహించుచున్నవి.

కనమ—అంతట హతశేషు లయినచెంచులు గోవులను విడిచి గోపాలురను దలపడినారు. ఇరువాగులపోరు ఘోరముగా నడచినది. చెంచులు పెనుభూతాల బోలి అడవిమెకాలవలె నానావిధములయిన వికారధ్వనులతో చెలరేగి నిరాయుధులైన గోపాలురపై బడి పెక్కుండ్ర మక్కడంచారు గాని గోపాలురు రామరావణయుద్ధములో వానరులు తాళ్లతోను, అప్పలతోను బోరాడి రాక్షసులను సంహరించి నట్లుగా కొందఱిని యమపురికి సాగనంపినను ఆయుధపాణు లయిన చెంచులముందు నిలువలేక చెదరి పాఱుటను గాంచి మనవీరుఁడు లంకన్న కాలాగ్నిరుద్రుఁడై యెదుర్కొన్నాఁడు. మనవీరుల బారటీటెల పోటులకూ కత్తివాటి నఱుకులకూ నిలువలేక చెంచులు పలాయనుల గుచుండగా ఒకచెంచువాఁడు లంకన్న వెనుక పొంచుండి బెబ్బులివలె

పల్నాటివీరుని పైకి దుమికి నాయకురాలికత్తితో కుడిభుజము నఱికివే సినాడు.

బ్రహ్మ—నాగమ్మకత్తి లంకన్న చావునకు సాధన మయినదా ?

రాజు—లంకన్నకుడిభుజముతో మనకుడిభుజముకూడా కూలి నట్లే.

కనమ—అంత లంకన్న యినుమడించినపౌరుషముతో ఎడమ చేతితో ఈటెను గొని ఒక్కొక్కపోటుతో ఒక్కొక్కచెంచుని పొడి చివేయుచు రణరంగమున సవ్యసాచియై విహరించినాఁడు. ఆభయంక రస్వరూపమును జూచి పాఱిపోవుటకు కాళ్ళాడక, పోరాడుటకు చేతు లాడక నివ్వెఱపడి నిశ్చేష్టితులై కత్తులు నేల జాఱవైచి చెంచులు నిలువంబడి కట్టెలవలె కొయ్యలై పోయిరి. అంత నిరాయుధులు, నిరప రాధులు, అయిన చెంచులపై కుఱుకుట కిచ్చగించలేదో అన్నట్లు బల మైన పెనుగాయము రక్తము నోడ్చివేయుచుండ క్షీణించి పోయి మన వీరుఁడు, మనసచివుఁడు, మన బాంధవుఁడు లంకన్న నేల కొరిగి వీరశ యనము బొందినాఁడు. ఇంతవఱకూ హతశేషు లయిన గోపాలురు చెప్పగా నేను విన్న మనలంకన్నవీరునిచరిత్రి యిది—

రాజు—ఎంతకష్టచరిత్రమును వినవలసివచ్చినది ?

బాలుఁడు—ఇఁకముం దెంతకష్టచరిత్రమును వినవలసియున్నదో.

బ్రహ్మ—వీరత్వమనేది లంకన్న యెముకలకు కూడా పట్టి అతని యొడలిలోనే జీర్ణించిపోయినట్లున్నది.

కనమ—అంత గోపాలుర ఆర్తధ్వను లాసమీపములో నున్న నాచెవులను బడినవి. నేనప్పుడు రోషాగ్ని ప్రజ్వరిల్లుచుండ ఒక్కక్ష ణమైన జాగు సేయక చెదరిపోయిన గోపాలురను చేరదీసికొని యీ టెలు ఖడ్గములు గైకొని చెంచులపయి బడి హతశేషులయిన చెంచుల

నందలిని జక్కాడి ఆవులమందలను మళ్లవేసికొని మండాది గమిటికడ నిలిపినాము.

బ్రహ్మ—దాసూ ! పల్నాటివీరుని కర్హమైన వర్తనము కలిగి వర్తించినావు. ఇక మీకార్యనిర్ణయమును చేసికొనండి.

కనము—దొరగారూ ! నాదొక్కమనవి. రాజ్యాలు వీరభోజ్యాలు. రాజ్యభోగాలకూ వైరాగులకూ సంబంధం లేదు. ఈరీతిగా గొల్లకూ గోదలకూ పాణా లర్పిస్తూ ప్రవాసాలుచేస్తూ అష్టకష్టాలూ అనుభవించడం కంటె వెంటనే రణభేరి మ్రోగించి దండయాత్ర సలిపి పల్నాటికొఱకు ప్రాణాలుసమర్పిస్తే ఇహమందూ పరమందూ ముక్తిని గాంచుతాము.

బాలుఁడు—బాలుడ నని నామాటలు మీరు వినకపోయినా అవకాశము కలిగినప్డు డెల్లను నాడోలు నేను వాయించక మానను. మనవీరులలో మేటివీరుఁడు లంకన్న చెంచులచేఁ జిక్కి మరణించి నాఁడు గదా. ఇదేవిధము గడువులోపల తక్కినవీరు లందఱుకూడ నొక్కరొక్కరే గోవులకొఱకో గొఱ్ఱెలకొఱకో ప్రాణా లర్పించవలసి యుండును. అట్టిదుర్మరణములు సంభవించక మునుపే మనకష్టా లన్నిటికీ కారణమైన నాగమ్మను, ఆమెసహచరులను అంత మొందించుటయో, పల్నాటికై ప్రాణా లర్పించుటయో చేయగలుదుము గాని వీరధర్మ మెఱుగని యేచెంచులకో, ఏకోయలకో, ఏయెఱుకలకో, ఏయేనాదులకో నిష్కారణముగా పాణా లర్పించి మగ్గలేము.

బ్రహ్మ—ఏదోవిధముగా యుద్ధములో మరణించుటయే వీరధర్మముగాదు. అది మనయుద్దేశమును గాదు. నలగామరాజు పెట్టుబాధలను సహించుట కెక్కువ వోపికయు ధైర్యమును గావలయును. ఇప్పటికి ఒక్కలంకన్నను విడిచిన మనబలగము చెక్కుచెదరి యుండ.

లేదు. సత్యముకొఱకు మనముకష్టములనుభవించుచున్నామని లోకులు మనపక్షమునకు వత్తురు. మనపక్షము వృద్ధి యగుచున్నది గాని క్షీణించుచుండ లేదు. పశుధనము క్రమముగా పెరుగుచున్నది. ఓపిక పట్టి నిలిచిన యెడల ఇహపరముల రెంటికి దూరులముగాము. మన మీరు లందఱు నింక కొంతకాలమువఱకు నోపిక వహించినయెడల మనకోర్కులు ఫలించును. మనము నాయకురాలి కుట్రలకు దూరముగా నుండుట మంచిది. కనుక మనము మండాదిని విడిచి దూరముగా శ్రీశైలపర్వతప్రాంతభూములకు పోయి బలము చేకూర్చుకొందము. ఆసమీపమున తృణకాష్ఠజలసమృద్ధి గల మేడపియనుగ్రామమున విడియుదము. మనకాలమంతయు నక్కడ గడపుచు యుద్ధప్రయత్నములు చేయుచుందము.

రాజు—మనకు బహునాయకత్వము పనికిరాదు. నాయుఁడుగారు చెప్పినట్లు మన మందఱము చేయుచుండవలయును. మనము మేడపికి ప్రయాణముసాగించి మిగిలినగడువుకాలము నంతయు నక్కడ గడపుదము.

అట్లు తనవారి నెల్లర నొప్పించి బ్రహ్మనాయుఁడు సబంధుపరివారముగ రాచబిడ్డలను వెంట నిడుకొని మండాదిని విడిచిపెట్టి దొమ్మన్నరేవుకడఁ గృష్ణానదిని దాఁటి మహాప్రసిద్ధశివక్షేత్రమగు శ్రీశైలమునకుఁ బోయి శ్రీమల్లికార్జునస్వామిని, భ్రమరాంబాదేవిని సందర్శించి యర్చనాదికకృత్యములను నెఱవేర్చి యచ్చటి రాజయిన మాకరాజుగారిని సందర్శించి తనచరిత్రము నంతయు నాతనికిఁ జెప్పుకొని తనకుఁదోడ్పడవలసిన దని కోరఁగా నాతఁడు ౨౩ గ్రామములను గుత్తకు నొసంగెను. అందు మాచర్లపురము, దూపాడు, చపలమడుగు,

కోలకులము, అంబసముద్రము, గణపవరము, త్రిపురాంతకము, మేడపి యను గ్రామములు ముఖ్యము లయినవి.

బ్రహ్మనాయుడు మిక్కిలి సంతోషముతో నచటినుండి త్రిపురాంతకమునకుఁ బోయి కొంతకాల మచట నివసించి యుండి పిమ్మట పిర మేడపి చేరి తక్కినగడువుకాలము నంతయు నచట గడపెను. అచట నున్నకాలమున ధనము విశేషముగా సంపాదించుటయే గాక కాల్బలమునుగూడ విశేషముగఁ జేర్చుకొనియెను. పల్నాటిలో నున్న కాలముకంటెను బలవంతుఁడై బ్రహ్మనాయుఁడు గడు వెప్పుడు తీరునో, పల్నాటిపై దండయాత్ర నెప్పుడు సాగింతునో, అని తత్తరపడుచుండఁగా గడువు ముగిసెను. పల్నాటిసీమల మోములు విలసిల్లెను. బాలనాయుఁడు కత్తులు నూరుటకుఁ బ్రారంభించెను.



# ఎనిమిదవ ప్రకరణము.



“ ఈసంధికార్యము నావలన నగునా ? నామాట వినువా రెవ్వరు ? తన వెనుక పల్నాటిరాజ్యమునకుఁ దనకొమారునకుఁ బట్టము గట్టి రాజ్యనిర్వాహకత్వ మంతయు నాపైఁ బెట్టవలయు నని నామామ గారి తలంపు. తనయన్నగారి వెనుక తానే రాజ్యమునకుఁ బట్టము గట్టుకొనవలెన [illegible] నరసింగరాజు తలంపు. ఎట్లయిన పెదమలిదేవ రాజునకు [illegible] అర్ధభాగము విడఁదీయించి యిచ్చినయెడల నల గామరాజునకు వెనుక మలిదేవరాజునకు సులభముగాఁ బట్టము గట్టించ వచ్చు నని బ్రహ్మనాయుని తలంపు. నరసింగరాజుపక్షమును బూని పల్నాటి విభాగము గాకుండఁ జేసి నలగామరాజునకు వెనుక నరసిం గరాజునకుఁ బట్టము గట్టవలయు నని నాయకురాలి తలంపు. ఎట్లయి నను పల్నాటిరాజ్యము నాకు రావలయు నని మాతల్లిగారి తలంపు. పల్నాటిరాజ్యములో సగముభాగము నాకును, సగముభాగము తన తోఁబుట్టువుపెనిమిటి యైనమలిదేవరాజునకును గట్టిపెట్టవలయు నని మాతండ్రిగారితలంపు. ఈవిధముగా నిందఱిన్ని యూహలతో నున్నా రు. ఈరాజ్యమును బంచుకొనుట కెవ్వరికి నధికారము లేదు. మామా మను బెదరించి మాయ చేసి మాచర్లసీమను అక్రమముగా బ్రహ్మ నాయుఁడు మలిదేవరాజున కిప్పించెను. దీని సహింపఁజాలక నాయకు రాలు మాయోపాయమును బన్ని మరల మాచర్లను వశపఱచుకొని పల్నాటిరాజ్యములోఁ జేర్చుటయే గాక తనశత్రువులను దేశమునుండి వెడలఁజేసి యష్టకష్టములపాలు చేసినది. వీరును వారును యుద్ధసన్నా హములను జరుపుచునే యున్నారు. బ్రహ్మనాయుఁడు నన్ను రాయ

రాయబారమునకుఁ బంపుచుఁ బర్యవసానము తేల్చుకొనకుండ యుద్ధప్రయ
త్నము లని యు నలుపుచునే యున్నాఁడు. నాకు ప్రాణరక్షగా మొదట
నల్వురు చూచుచుండఁ దులసివనమాల నిచ్చి వెనుక మాయచే బాల
నాయునిఁ బిలిపించి తెప్పించుకొన్నాఁడు. నే నేమనుకొందునో యను
సంశయముచేత రాయబారమంతయు బ్రహ్మనాయుఁడు నడుపుచు
న్నాఁడు గాని, అతనికిఁ గూడ నీరాయబారమునందు విశ్వాసము
లేదు. నేను మామామతోఁ జేరుదునేమో యను భయముచేత నా
తండ్రికి నన్ను రాయబారినిగాఁ బంపుట యిష్టము లేదు. ఎట్లో మాయ
చేసి నరసింగరాజు నాయుసుతులఁ గైకొనక మానఁ డని తలపోసి
తక్కినవారు నన్నే రాయబారిగఁ బంపుచున్నారు. ఎవ రెట్టియుద్దేశ
ములతో నున్నను దేశోపద్రవకర మైనయుద్ధమును మాన్పి సంధి
కూర్చుట నాకు పరమధర్మము గనుక నే నీమహాకార్యమునకుఁ బూను
కొన్నాను. ఉభయపక్షములవారికి బంధుఁడ నగుటచేత నారాయ
బారమువలన కార్యములు చక్కఁబడు నని కొందఱ కాశగలదు. ఇం
తకు రాయబార మేమని? మాచర్ల మలిదేవుని కిమ్మని చెప్పనా?
మాచర్లసీమ వీరవిద్యాదేవిపుత్రుల కిచ్చినయెడల భూరమాదేవిపుత్రు
లయిననరసింహరాజు మొదలగువారి భాగముమాట యేమని యడి
గిన నే నేమిసమాధానము చెప్పఁగలను? వీరికి భాగ మున్నప్పుడు
వారికి లేకపోవునా? నాయకురాలియుద్దేశ మెట్లున్నను ఆమెవాదము
సమంజసముగాఁ గన్పట్టుచున్నది. అంతయును గలిసి పల్నాటిప్రభు
వయిన నలగామరాజు గొడుగుక్రింద నుండుఁడని కోరుచున్నది. దీనిని
బ్రహ్మనాయుఁ డంగీకరింపక యున్నాఁడు. నలగామరాజు బుద్ధిపూర్వ
కముగా మాచర్లసీమ మలిదేవరాజున కిచ్చివేసినాఁడు గనుక మాచర్ల
సీమ మలిదేవరాజునకు రావలె నని బ్రహ్మనాయుఁడు కోరుచున్నాఁ

డు. ఇట్టిధర్మసందేహము యుద్ధమువలన తీరవలసినదే గాని మఱియొక విధముగా తీఱునది కాదు. అయినను రాయబారము పైని వైచుకొని వచ్చినాను కావున వారు చెప్పుమన్న మాటలు మామామకు విన్పింతును. యుద్ధము వలదని నరసింగరాజునకు నాయకురాలికి నచ్చఁజెప్పెదను. తరువాత దైవఘటన యెట్లుండునో యట్లు జరుగును. అదిగో గురిజాలసమీపించుచున్నాను."

అనితలపోసికొనుచు "రాచమల్లుఁడు" అలరాజు గుఱ్ఱము స్వారి చేయుచు వచ్చి రాజమందిరముకడ నిలువంబడియెను. అప్పుడు మేడపై నుండి రత్నాలపేరమ్మ తనభర్తను గాంచి యేడేండ్లకు వచ్చెను గదా యని పరమానందభరితురాలై క్రిందికి వచ్చి తనతల్లిదండ్రులతో మీయల్లుడు వచ్చి వాకిట నున్నవాఁడని ముందుగా వచ్చి చెప్పెను. తరువాత ద్వారపాలకుఁడు వచ్చి పెద్దదొరగారి అల్లుడు అలరాజుగారు వచ్చినారని చెప్పెను.

ఆవార్తను విన్నవాఁడై నలగామరాజు పట్టరాని సంతోషముతో నల్లునకు నెదురేగి "ఎన్నాళ్లకు చూడఁగలిగితిని నాయనా' యని సందిట కౌఁగిలించుకొనియెను. అలరాజున కానందబాష్పబిందువులు నేత్రయుగ్మమునుండి జలజల రాలెను. నలగామరాజు తని నంతఃపురమునకుఁ గొనిపోయి యుచితాసనాసీనుఁ గావించి కుశలప్రశ్నము చేసెను.

ఇంతలో రత్నాలపేరమ్మయు వచ్చి 'నాఅదృష్టము ఫలించి యింతకాలమునకునైన నాప్రాణేశుని మరల చూడఁగల్గెడుభాగ్యమబ్బె' నని మృదుమధురభాషణంబులతోఁ బలికి భర్తగారి పాదపద్మములకుఁ బ్రణమిల్లి నిలిచెను. 'నాయనా! అలరాజా! ఏడేండ్లకాలము నిద్రాహారములకు వెలియై అనవరతము నిన్నే స్మరించుచు,

మరల నీసందర్శన మెప్పుడు లభించునా యని వేయిదేవుళ్లకు మ్రొక్కుచు మాపేరమ్మ దిన మొక యుగముగాఁ గడపుచున్న' దని అత్తగారు పలికి కన్నీరు నించినది.

మనపేరమ్మభర్త అలరాజు వచ్చె నని రాజబంధువు లెల్లరును చాచనగరునకు వచ్చి చూచి యానందించుచుండిరి. అలరాజు వచ్చె ననువార్తను విన్నప్పుడు నరసింగరాజునకు గుండె నీఱయి పోయినను ఏకోశమునందును లేని ప్రేమ యున్నట్లు నటించుచువచ్చి "కుమారా! అలరాజా! ఇంతకాలమునకు నాఅల్లునిమోము చూడఁగల్గితిని? నిజముగా మాపేరమ్మ అదృష్టవంతురాలు. ఎన్నో సంవత్సరము లెడఁబాటు గలిగినను సీతారాములవలె మీరు మరలఁ గలిసికొనఁగలుగు భాగ్యము లభించినది. ఇది నిజముగా మాపేరమ్మ తల్లిదండ్రులతపః ఫలము లభించుటచే సంభవించిన దని చెప్పనగు" నని పలుకుచు, అలరాజు చిఱునవ్వు నవ్వుచుండఁ గౌఁగిలించుకొనియెను.

అటుపిమ్మట నాయకురాలు వచ్చి 'అలరాజుగారూ! మిమ్మును జూచి చాలకాల మైనది. నన్ను మఱచితిరి కాఁబోలు! నేను నాగమ్మను. మీరు మాకు మహారాజుగారి తరువాత మహారాజుగా రంతటి వారు. మాకు ప్రభువులు. నేను మీసేవకురాలిని. మాఅమ్మగారు రత్నాల పేరమ్మగారు చేసినపూజ మంచిది కాఁబట్టి గురిజాలలోనే మిమ్ము చూడఁగలుగుభాగ్యము భగవంతుఁ డామెకుఁ బ్రసాదించినాఁడు. ఇంక మామహారాజుగారికి మాపట్టపుదేవిగారికి దుర్భరదుఃఖము తొలఁగిపోయి మహదానందము లభింపఁగలదు." అని యభినందించెను. అందఱు తనచుట్టును జేరి అన్నివిధముల అభినందించుచుండ అలరాజు దిగ్గన లేచి యెల్లరకు నమస్కరించి యిట్లు పలికెను.

"నేను మీయభివందనముల కెంతయుఁ గృతజ్ఞుఁడను. నేను

వచ్చినవిధము వేఱు. నే నీపట్టణమునకు మహారాజ [illegible] విందులు గుడుచుటకు అల్లుడుగా వచ్చి యుండలేదు. ఈసందర్భమున మీా కొక్క సందేశము దెలుప పెనుభారము వహించి వచ్చితిని. అది రాయబారము. ఏడేండ్లకాలము నేను మలిదేవరాజుగారితోఁ బ్రవాసమునకుఁ బోవుట మీాయెడ ద్వేషముచేత కాదు; వారియెడఁ జూపు మైత్రిచేతను కాదు. నాతల్లిదండ్రులు మలిదేవరాజుతోడి సంబంధము ను బట్టి వారు ప్రవాసమునకుఁ బోయి, అష్టకష్టము లనుభవించు చుండఁగా నేనిచట మహారాజభోగంబు లనుభవించుచు నుండుట కు మారుఁడ నైననాకు ధర్మ మగునా? 'మాతృదేవోభవ; పితృదేవోభవ' అని వేదము పల్కుచున్నదిగదా. ఈధర్మము మీా రెఱుంగనిది కాదు. మీాకడకు రాయబారిగ వచ్చి విందులు గుడుచుచుండుట నాకు ధర్మము గాదు."

నాగ—అలరాజుగారూ! మీారు చెప్పి సమర్థించుకొను ధర్మములను మేము కాదనము గాని మీా రాయబార మెందుకో మా కర్థ మగుచుండ లేదు.

అల—వారిమాచర్ల రాజ్యము వారి కీయవలయు నని కోరుట యే యీరాయబారమునకు ముఖ్యోద్దేశము.

నాగ—వారి కెందు కీయవలెను? ఎఱుఁగక యొకప్పు డీయఁ బడినది. కాని యది వారికి దక్కలేదు.

అల—వారు చేసిన సమయముప్రకారము వారిరాజ్యమును విడిచి యేడేండ్లు ప్రవాసము చేసి గడువు చెల్లించినారు గనుక వారి మాచర్ల రాజ్యమును వారు కోరుచున్నారు. అనుకొన్నవిధముగా వా రన్నియు జరిగించినప్పుడు మీారుమాత్ర మేల యాడినమాట నిలుపు కొనఁగూడదు?

నాగ—మాచర్ల వారి కేల రాదు. వారి కది భాగముగా నీయలేదు. నలగామరాజుగారిపల్నాటిరాజ్యము విభాగింపఁబడునది కాదు.

అల—ఆవిషయము నేనెఱుంగనిది కాదు. మున్ను నలగామ రాజుగారు మలిదేవరాజుగారి కొసంగి యున్నారు గనుక—ఇప్పుడుమాత్ర మేల యీయఁగూడ దని యడుగుచున్నాను.

నర—బ్రహ్మనాయుడు నలగామరాజుగారి కబద్ధములు చెప్పి యిప్పించినది గాని మాచర్లసీమ మలిదేవరాజునకు బుద్ధిపూర్వకముగా నిచ్చినది కాదు. బ్రహ్మనాయునిమోసము తెలిసినవెనుక దీనిని రాజు గారు లోకమునకు వెల్లడించియే యున్నారు.

అల—అట్లయినయెడల యుద్ధము తప్పదనుమాట. అంతేనా? అదియే మీకుచితముగా నగపడుచున్నదికాఁబోలును !

నాగ—వారు తలపెట్టెడుయుద్ధము న్యాయమైనది కాదు. ఆయన్యాయయుద్ధమునకు భయపడి మాచర్లసీమ వారికి మరల నిచ్చుటయును న్యాయము గాదు !

అల—అది న్యాయమో అన్యాయమో. ఆనిర్ణయమునకు నేను రాలేదు.

నాగ—అలరాజుగారూ ! పెనుభారము వహించిన రాయబార మని చెప్పినారే ? అసలు రాయబారములో భారమే లేనిచో పెనుభార మెక్కడనుండి వచ్చినది ?

అల—వారిభాగ మగుమాచర్లరాజ్యము వారి కీయుదురని చెప్పుటకు రాయబారము పైనిఁ బెట్టుకొని రాలేదు. వారి కొసంగఁ బడిన మాచర్లరాజ్యము వారిసమయము తీరినది గనుక వారి కొసఁ గుఁ డని చెప్పుటకుమాత్రమే రాయబారము పూని వచ్చితిని.

నాఁగ—మాచర్లసీమ పల్నాటిరాజ్యములోనిది. పంపకము కాలేదు. మాచర్లరాజ్యము ప్రత్యేకముగ నేర్పడియుండలేదు. తన యిష్టము ననుసరించి బ్రహ్మనాయుని యొత్తిడిమీఁద మాచర్లసీమను బరిపాలించుకొనుచు నందుపై వచ్చునాదాయము కుటుంబభరణము నిమిత్తము వినియోగించుకొనవలసిన దని చెప్పెనే గాని ప్రత్యేకరాజ్యముగా స్వతంత్రముగా నేలుకొమ్మని యొసంగినది కాదు. రాజుగారి కిష్టమున్న పాలించుకొననియ్య వచ్చును. ఇష్టము లేకున్న మాన్పింపవచ్చును. అంతియకాక పందెములకొఱకు దేశదేశముల కాహ్వానములు పంపినప్పుడు 'పల్నాటిప్రభువు నలగామరాజు' అనుసంతకముతోఁ బంపఁబడినవి గాని గురిజాలప్రభు వని సంతకము చేసియుండలేదు. దాని నంగీకరించియే గదా వారు గురిజాల వచ్చి కోడిపందెము లాడినది! పందె మొడ్డినప్పుడు గూడ తా నోడిపోయినయెడల రాజ్యము విడిచి యేడేండ్లు ప్రవాసమున నుండు నని చెప్పినప్పుడు తన మొదటిస్థితి తన కుండనే యున్నదనికూడ చెప్పినాఁడు. మొదటిస్థితి అనగా అన్నగారితోఁ గలిసి పల్నాటిరాజ్యములో నుండుట. ఈ హేతువులచేత మాచర్ల వారికి రాదు. మఱియు నాన్నగారిపై తిరుగుబాటు చేసియున్నారు గనుక నీసారి నలగామరాజు మలిదేవరాజునకు మరల మాచర్ల నొసంగఁ దలంచుకొనలేదు. మలిదేవరాజునకు ప్రభుత్వమును బ్రహ్మనాయునికి మంత్రిత్వమును రెండును పోయినవి. ఏమీ! భూరమాదేవిపుత్రులు నల్వురు భరణము దీసికొనుచు నలగామరాజును గొల్చుచున్నటుల వీరవిద్యాదేవిపుత్రులు మువ్వురును భరణము పుచ్చుకొనుచు నలగామరాజును గొల్చుచుండలేరా? వీరికి లేవుగాని వారికి కొమ్ములు మొలచినవి కాఁబోలు? ఇదంతయు బ్రహ్మనాయుఁడు పెట్టిన తంపి గాని మఱియొండు గాదు.

నలగామ—అలరాజా! నాయకురాలినోటినుండి వెలువడిన పలుకులే నేనును మరల మరల పలుకవలసి యుండును. ఈరాజ్యము శీలవిద్యాదేవిపుత్రులకుఁ బంచి యిచ్చుటకు నే నిష్టపడువాఁడను గాను. రాజ్యము పంచుటయే ధర్మ మయినయెడల నెనిమిదిభాగము లుగఁ బంచవలయును గాని మలిదేవరాజు కోరినట్లు రెండుభాగము లుగఁ బంచఁబూనుట అధర్మము, అక్రమము, అన్యాయము. ఈరీతిగా రాజ్యములు పంచినపక్షమున రాజ్యములే నిలిచి యుండవు. ప్రజా పాలనాసౌకర్యార్థము రాజ్యము లేర్పడినవి గాని తరతరములుగాఁ బంచుకొనుటకు రాజుల సొంతసొత్తులుగా నిరూపింపఁబడినవి కావు. నాకు పురుషసంతానము లేనికారణమున నావెనుక పల్నాటిరాజ్యము నాకొమార్తె పేరమ్మ పరిపాలింపవలసి యుండును గాని యితరులకు రాదు. అనగా దౌహిత్రరీత్యా నీకుటుంబమునకుఁ జెందవలసి యున్న ది. ఇది ధర్మము. నాతమ్ము లంతయును ఈరాజ్యముకు సేవించుచు ఈరాజ్యమునుండియే భరణాదులను పొందుచుండవలయును. ఈరాజ్య ముకు సేవించుట యనగా వారివారిశక్తిసామర్థ్యముల ననుసరించి మంత్రిత్వాది రాజకీయోద్యోగములను బడసి నిర్వర్తించుటయే వార లకుఁ బరమధర్మము.

అల—మామగారూ! ఈనీతులు, ఈన్యాయములు, ఈధర్మ ములు నేనెఱుఁగనివి కావు. ఏదో సాధనవిధానముఁ జూచి కుటుంబ కలహమును మాన్పి యుద్ధము నివారింపవలయు నని నాతలంపు. "పోరు నష్టము పొందు లాభ"మను సూక్తి నిన్న నేఁడు పుట్టినది కాదు. ఎంతో లోకానుభవము గడించిన పెద్దలు పల్కెడుసూక్తి.

నాగ—రాజ్యములు విభాగింపఁబడవలసినవి కావు గనుక నే యుద్ధము ను రాజులకుఁ దప్పవు పలుపురకు రాజ్యాభిలాష జనించు

ంటకు కారణ మిదియే. "పోరు నష్టము పొందు లాభ" మను సూక్తి యెంత సత్యమో "పోరు లేకుండ పొందు పొసఁగుట కష్ట" మను సూక్తియు నంతసత్యమైనదే. ఈ రెంటిఫలితములను మనము ప్రపంచ ములో చూచుచుండలేదా ? కనుక 'పోరు నష్టము పొందు లాభ' మనుదానిని మలిదేవునకు, బ్రహ్మనాయునకును బోధింపుఁడు. వారు పల్నాటిరాజ్యమునకు శత్రువులై పల్నాటిపై దండెత్తి రానున్నారు గనుక యీబోధ ముఖ్యముగా వారికి చేయుట ధర్మము గాని, రాజ్య సంరక్షణార్థము, ధర్మసంరక్షణార్థమును పాటుపడుచున్న మాకుఁ గాదు చేయవలసినది. వారికుటుంబపోషణముకొఱకుఁగాని, ఇతరసా కర్యములకొఱకుఁ గాని, మీరు కోరువిధముగా నేమయిన చేయఁగలు గుదుము గాని మాచర్లసీమను విడఁదీసి యిచ్చుట రాజధర్మమునకు విరుద్ధము. యుద్ధము జరుగు నని మమ్ము బెదరింపఁ బనిలేదు. యుద్ధ ములో గెల్పు గొన్నవానికే రాజ్యముండును. పోనిండు. రాజ్యసంర క్షణార్థము మేము యుద్ధము చేయక తప్పదు. యుద్ధములో బ్రహ్మ నాయుఁ డొక్కఁడే మిగిలి యున్న యెడల అతఁ డొక్కఁడే పల్నాడు పరిపాలించుట కర్హుఁడగును. అంతియ కాని పంపుళ్ళు జరుగఁబోవు.

అల — అబ్బా! నాగమ్మగారూ! మీరు జవాబు చెప్పుట మాబోంట్లకు సాధ్యము గాకున్నదే.

నాగ — అలరాజుగారూ! ఇందువిషయమై మీరీరాయబా రము నెత్తిపైఁ బెట్టుకొని వచ్చుట మాకు బహుకష్టముగా నున్నది.

అల — (తనలో) నేను తలంచినట్లే యైనది. ఎట్లును సంధి పొసఁగనేరదు. యుద్ధము జరిగితీరును. నాయకురాలు చెప్పినది సత్యముగానే కనుపట్టుచున్నది. నేను రాయబారము పైఁ బెట్టుకొని వచ్చుట పొరబాటు సంధి పొసఁగనేర దని బ్రహ్మనాయునికి వర్త

మావ మంపెదను. అత: డీపాటికి దండయాత్రకు బయలువెడలి వచ్చుచుందును. ఇక్కడి ప్రయత్నములు చూడ వీరును యుద్ధమునకు సంసిద్ధులై యున్నారు. నే నీపక్షమునను జేరకుండుట నా కుత్తమపథముగాఁ దోఁచుచున్నది. నాతండ్రిగారు మలిదేవరాజుగారిపక్షమున నుండ మామామ నలగామరాజుగారిపక్షమునఁ జేరి యుద్ధము చేయుట నాకు నీతి కాదు. కావున నీయుద్ధము ముగియువఱకు నేను మామగారియింటను నుండఁజాలను. ఉండుటయు వివేకము గాదు. నేను ప్రత్యేకముగాఁ బరస్థలమునం దుండుటయే సమంజసముగాఁ గన్పట్టుచున్నది. ”

అని తలపోసికొని అలరాజుగారు మామగారినిఁ జూచి యిట్లు పలికెను.

“ నారాయబారము వ్యర్థమయి పోయినది. బ్రహ్మనాయుడీవఱకే దండయాత్ర సాగించి యుండును. ఇఁక యుద్ధమే గాని సంధి పొసఁగ దని బ్రహ్మనాయునికి వర్తమానము చేసెదను. ఈయుద్ధములో నే నేపక్షమున నుండఁదలంచుకొనలేను. మీపక్షమున నుండి మాతండ్రిగారిపై కత్తి గట్టఁజాలను. వారిపక్షమున నుండి మీపై కత్తి గట్టఁజాలను. ఈయుద్ధము ముగియువఱకు నేనచటికిఁ బోను; ఇచ్చటను నిలువఁబోను. నేనొక ప్రత్యేక ప్రదేశము చూచుకొని యీరాజ్యములోనే యుండి యుద్ధక్రమము వీక్షించుచుందును. నావిషయమై మఱియొకలాగు మీరును వారునుగూడఁ దలంపవలదు. నేను మీయింట నున్నట్లుగానే భావింపవలసినది. ”

అని చివాలున లేచి రాజమందిరమును విడిచి గుఱ్ఱ మెక్కి స్వారిశాడలిపోయెను. నలగామరాజు మొదలగువా రాతఁడు తమపక్షమున నుండకుండుటకు విచారించినవా రయినను, అలరాజు

శత్రుపక్షమునఁ జేరకుండను, యుద్ధములోఁ బాల్గొనకుండను నుందు నని వాగ్దత్తము చేసినందుకు సంతోషించుచు నాతనిధర్మైకతత్పరతను ఘనముగా శ్లాఘించిరి. అలరా జెక్కడకుఁ బోవునో కనిపెట్టి తనకుఁ దెలియఁ జేయవలయు నని నలగామరా జొకయాశ్వికు నాని వెనువెంటనే పంపించెను.



# తొమ్మిదవ ప్రకరణము.

అదివఱకే నలగామరాజు నాయకురాలి ప్రేరేపణమువలన
బ్రహ్మనాయునితో యుద్ధము సేయ నిశ్చయించి యుద్ధవార్తను నానా
దేశరాజులకుఁ దెలియఁజేసి సాహాయ్యముఁ బడయుటకై ప్రయత్నించె
ను. కొండజికడకు రాయబారులనుగూడఁ బంపెను. ప్రతాపరుద్రుఁ
డు మొదలగు కొందఱురాజులుమాత్రము కొంతకొంతసైన్యమును
తోడుగా నంపిరి. అట్లితరరాజులసేనలును, నాయకురాలు సమకూర్చి
న సేనలును గలిసి గురిజాల మైదానము నంతయు నాక్రమించుకొను
టయే గాక గురిజాలచుట్టును రెండుక్రోశములకు లోపల నుండుప్రదే
శముల నన్నిటిని మహాసంరంభముతో నాక్రమించుకొని విడిసి
యుండెను.

ఈమహాసైన్యమున కంతకును మాడుగల వీరారెడ్డిని అధ్యక్షు
నిగ నియమించెను. అనుక్షణమును నలగామభూపతి కిరుప్రక్కలను
జేరి నరసింగరాజును, నాయకురాలును వాని యుద్ధోన్ముఖునిగాఁ జే
యుచుఁ బ్రోత్సహించుచుఁ బౌరుషము నెక్కించుచుండిరి.

ఒకదినమున నలగాముఁడు కొల్వుకూటమున సభ దీర్చియుండ
'బైచరాజు' అను పేరుగలయొకబట్టు దర్శనార్థము వచ్చి సింహాద్వా
రముకడ వేచి యున్నవాఁ డని ద్వారసంరక్షణమున నున్న భటుఁ
డొకఁడు వచ్చి విన్నవింపఁగా నాతని సభకు రప్పించిరి. అతఁడు
బ్రహ్మనాయుఁడు పంపఁగా వచ్చిన దూత ననియు, భట్రాజుననియుఁ
జెప్పుకొనఁగా నుచితవిధానమున సత్కరించి 'వానిని వచ్చినకారణ
మే' మని హెచ్చరించిరి. అతఁ డిట్లు విన్నవించుకొనియెను.

“ఓ రాజాధిరాజ! విరాజితకీర్తి! ధైర్యనిర్జితమేరుధరణీధరేంద్రా! గండరగండాంకబిరుదా! శౌర్యవిక్రమకళాసంపూర్ణచంద్రా! భాస్కర సమతేజా! ప్రౌఢగుణాఢ్యా! మానదుర్యోధనా! మైలమసుతా! విభవ దేవేంద్రా! వీరకామవరేంద్రా! ఇటు వినుము.

బ్రహ్మనాయుఁడు యుద్ధము చేయుటయే విధికృతమైనధర్మమని నిశ్చయించి బాలమల్లదేవుని వీరమేడపికిఁ బట్టముగట్టి తనపుత్రుఁడయిన బాలచంద్రుని సచివకార్యమునందు నియోగించి కరణకార్యంబను పోతనకిచ్చి మాడచి యనువీరవనితను రాణివాసమునకు రక్షకురాలినిగఁ జేసి తనపక్షమును బూని వచ్చిన వీరనాయకులతో నొక్క శుభముహూర్తమున దండయాత్ర వెడలి వచ్చి కారెమపూడికి దక్షిణముగా మూఁడుక్రోశముల దూరమున నున్న మేళ్లవాగునందు దండు విడిసి యున్నవాఁడు.

నలగా—వీరు లందఱును వచ్చినారా! ఏమనుచున్నారు?

బైచ—మహారాజుగా రభయాజ్ఞ నిచ్చినయెడల విన్నవింతును.

నాయ—మఱేమి భయము లేదు విన్పింపుము.

బైచ—వీరనాయకులు బ్రహ్మనాయునిచుట్టును మూగి

“మమ్ముఁ జూడు నాయుఁడా ♦ మాలావు కొలఁది
మముఁ జూడు బ్రహ్మన్న ♦ మా శౌర్యపటిమ
సింధురంబులమీఁదఁ ♦ జెన్నుగా దుమికి
కుంభస్థలంబులఁ ♦ గ్రుంగఁ జేసెదము
కోదమసింగంబులఁ ♦ గూలఁ ద్రోచెదము
గండభేరుండాల ♦ ఖండింతు మలుక
వాయువుఁ బోనీక ♦ పడి సాఁపఁగలము
జాతవేదునిఁ బట్టి ♦ దమిరి నైచెదము

ఘనసముద్రముఁ జొచ్చి ♦ కలఁగఁజేసెదము
కుంభినిఁ గాళ్లతోఁ ♦ గ్రుంగఁ దన్నెదము
కులగిరులైనను ♦ గొట్టివైచెదము
గురిజాల నేలెడు ♦ కువలయేశ్వరునిఁ
గొలపగక్కైపట్టి ♦ క్రొవ్వణఁగించి
చలమున విడువక ♦ చంపఁగాఁగలము."

అని పంతంబు లాడుచు వీరనృత్యములు సలుపుచున్నారు.

నాయ—ఈవీరనాయకుల కెల్లర కధినాయకుఁ డెవ్వఁడు?

బైచ—కనుకల కన్నమనాయుఁడు

నాయ—అతఁడు కదనభూమికి వచ్చినాఁడా! ఎట్టివేషముతో వచ్చినాఁడు?

బైచ—"కరమున గుజ్జరి♦కడియముల్ మెఱయ
నీటైన పిడిఘంట ♦ నెమలిసోగలును
నల్లని ధట్టిని ♦ నయముమెప్పఁ గట్టి
అర్ధనారీశ్వుల్ల♦కాదులు నమర
ఘోరవైభవగద♦కోరమీసములు
నిగుభుజంబులు మించు♦నెఱజేరుగుళ్లు
ఘనమైన దేహంబు♦కాలిపెండెరము
వెరవైన భీకర♦వేషంబుతోడఁ
గదలెఁగన్నమనీఁడు ♦ కదనభూమికిని."

నలగా—ఇతఁడేనా బ్రహ్మన్నగారి సకలసైన్యాధ్యక్షుఁడు?

బైచ—అవును మహాప్రభూ!

నాయ—అయితే మీరు వచ్చినకార్య మేమి?

బైచ—సంధికార్యముకొఱకు.

నాయ—అంత అట్టహాసముతో అంత సైన్యమును దరలించుకొని వచ్చి అంతమంది వీరనాయకులు తనచుట్టును జేరి అంతఱంతములాడుచు సేవించుచుండ అట్టిమహావీరుఁడు సర్వసైన్యముల కధ్యక్షుఁడై యుండఁగా నింక సంధికార్య మెందుకూ ?

వైచ—ఎందుకో చెప్పెదను దయతో వినుఁడు.

« పగ వృద్ధిఁ బొందించు ♦ భ్రష్టులే కాని
యడఁగించు నేర్పరు♦లవనిలో లేరు
పోరు మంచిది కాదు ♦ భూమి నెక్కడను
పాడౌను దేశంబు ♦ పగ మించెనేని
ప్రజ లెల్ల నశియించి ♦ పాఱి పోవుదురు
బండారమునకును ♦ బైకంబు లేదు
రాణువ యందుచే ♦ రహి చెడి యుండుఁ
జేజీతగాండ్రెల్లఁ♦జెలఁగి కోపించి
యీఁగలజీతంబు ♦ లిమ్మందు రపుడు
పతి బంటుమేరలు ♦ పతిహార మౌను
బంపినపని సేయఁ ♦ బ్రాలుమాలుదురు
తెలిసినశాత్రవుల్ ♦ ధీరతతోడ
భూమినిఁ గొనుటకు ♦ బుద్ధి వెట్టుదురు
పరవారివార్తలు ♦ పరికింపలేరు
మేకొన్న మీలోన♦మీరు పోరాడఁ
జూచెడువానికిఁ ♦ జులకన యౌను
పలువలు మిముఁ జేఱి ♦ పగఁ జాడనీక
చెప్పుచు నుందురు ♦ చెనటివాక్యముల
నైకమత్యము చెడ♦నద్దానితోడఁ

చెడును బలంబును ♦ చెడును భాగ్యంబు
చెడును యశంబును ♦ చెడును శౌర్యంబుఁ
చెడును రాజ్యమ్మును ♦ చెడ్డపిమ్మటను
దేశంబు పరనృపా♦ధీనమౌ సుమ్ము.

నలగా—ఓయి భట్టురాజా! ఈహితవునే పోయి మాబ్రహ్మనాయునికిఁ జేయుము. "బ్రమకఁదలంచిన యెడల బాలరాజులను దోడ్కొని మరలి పొమ్ము. పోకయున్న రణభూమికి నిన్ను బలిగ నర్పింతు."మని నలగామరాజు చెప్పె నని బ్రహ్మనాయునికిఁ జెప్పి బుద్ధిగఱపుము.

భట్టు—బ్రహ్మనాయుఁడు అవతారపురుషుఁడు. ఆతనిమీరు జయింపలేరు. బాగుగ నాలోచించుకొని మఱి సెలవిండు!

అనుటయు నాయకురాలు లేచి "ఓయీ! నీవు మతిలేక మాటాడుచున్నావు. నామాలు పెట్టినంతమాత్రమున నాయఁడు నారాయణుఁడగునా? కులములు చెరిచినంతమాత్రమునఁ గోపాలుఁడగునా? కష్టపడి వనవాసాలు చేసి కన్నులలోఁ బ్రాణములు పెట్టుకొని వచ్చినవా రిప్పుడు కత్తులు పట్టుకొని యేమి చేయఁగలరు? గురిజాలప్రభువు నాశ్రయించి హాయిగాఁ గుడిచి కూర్చుండరాదా? ఈపోటుమాట లెందులకు? ఈపౌరుషాలెందులకు? బ్రహ్మనాయని కింకను బరతత్త్వము బోధపడలేదు కాఁబోలును!" అనియెను.

భట్టు—ఎవరిపక్షమువారు వారిమాట లాడుచుందురు. ఆపక్షమునకంతకు నవియే హితముగా నుండును. కాని యిట్టిమాటలే యాత్మవినాశకారులగుచుండును. ధర్మమునకుఁ గట్టుపడి బ్రహ్మనాయఁడు రాజ్యమును విడిచి పోయినాఁడు గాని యిప్పటియీకోడిపోరే ఘోరయుద్ధముగాఁ బరిణమింపఁ జేసినచో నీపాటికే మైయుండునో?

నాయ—ఏమైయుండును? అప్పుడే వారందఱును గూడ నమరరాజ్యమున కధీనులై పోయి యుందురు. ఇంక నిప్పుడిట్టిరాయబారముల కవకాశమే లేకయుండును.

బైచ—ఆలాగా! అప్పటినుండి యిప్పటివఱకునుగూడ నీవట్టి యుద్దేశముతోనే యున్నావు కాఁబోలును! అవును. ఆఁడుదానికి సాహసమే గాని దూరదృష్టి యెట్లుండును?

నాయ—మీబ్రహ్మనాయని మగతన మీయేడేండ్లనుండియు లోకమునకుఁ దెలిసిపోయినది కాదా?

బైచ—ఆవీరుఁడు ధర్మబద్ధుఁడై యట్లున్నాఁడు గాని యాఁడు దానికొఱకు భయపడి కాదు.

అని యాతఁడు నలగామరాజువంకఁ జూచి "మహారాజా! మీరందఱునన్నదమ్ములు. ఈయాఁడుదానిమాటలు విని యాత్మద్రోహము చేసికొనవలదు. బ్రహ్మనాయని రణరంగమునఁ బ్రవేశించునట్లు చేయకుము. అట్లయినచో యాదవులంబోలి పల్నాటివీరు లందఱును బరస్పరనిహతులై పోవుదురు. మానవీయు లందఱును మడఁగి పోయినపిదప మహాశ్మశానమువంటి యీమహీమండలము నవ్వు రెవ్వరు పాలించిన నేమిలాభము? ఇరుతెగలవారికిని విజయము రాదుగదా! కాని యుభయపక్షవీరులును జాలమంది రణరంగమున నిహతులు గాక మానరు. కావున నెట్లయిన సంధి చేసికొనుట మంచిది. ఈనాయకురాలి నాయకత్వము—"

అని యింకను మాటాడుచున్న బైచరాజుం గాంచి నలగామరాజు కోపముతో "ఓయిమూర్ఖుఁడా! నీవు మర్యాద నతిక్రమించి మాటాడుచున్నావు. బట్టువాఁడవు. నీవెంత? నీబలమెంత? దూతవై

వచ్చితివి గావున బ్రతికిపోయితివి. కాని పల్నాటిరాజ్యలక్ష్మి యైన నాయకురాలిని దూషించినందులకు నీనాలుక చీలికలు గావింపవల సినదే—పోపొమ్ము! నీవీకొలువునందు నిమిషమైన నిలువఁదగినవాఁ డవు గావు" అని యదలించుచు భటునిచే నాతని నవ్వలికి గెంటించి వైచెను.



## పదియవ ప్రకరణము.

అట వీరమేడపిలో బ్రహ్మనాయుఁడు సకలసైన్యసమేతుఁడై పల్నాటిపై దండయాత్ర వెడలిపోయినతరువాత బాలనాయుఁడు మఱునాఁడు చాకలిచందుతోఁ జదరంగము నాడుచు నాటలో నోడిపోయెను. అంతఁ బట్టుదలయు, పౌరుషమును బెంపు నొంద నినుమడిం చిన యుత్సాహముతో నాతఁడు రెండవయాట మరల తలపెట్టియాడి యందులోఁగూడ నోడిపోయెను. మఱింతపౌరుషము పెచ్చుపెఱుఁగ మూఁడవయాట ప్రారంభించి యందును నోడిపోయెను.

అది యంతయుం గాంచి దోర్నీడు, చందన్న, తేర్కుఁడు, మంచన్న మొదలగుమిత్రులు అందఱు బాలనాయునిఁ బరిహసింపనాగిరి. "వీఁడు పట్టి పిఱికిపంద యగుటచేతనే తండ్రి వీనిని యుద్ధమునకుఁదీసి కొని పోక కుండలలో గుఱ్ఱాలు తోలుచుఁ గూరుచుండు మని యింట దిగవిడిచి పోయినాఁడు" అని చాకలిచందు పరిహసించెను.

"అది గాదురా! మన బాలనాయుఁడు చిన్నవాఁడు బొంగర ము లాడుచుండఁగా చూడవచ్చిన యమ్మలక్కలలోఁ గోమటిఅన్నమ్మ మీఁగాలికి మనబాలుని బొంగరము తగులుటచే నామె మూర్ఛిల్లె నఁట. అంతఁ గొంతవడికిఁ జుట్టును మూఁగిన యువతు లుపచారములు సలుపగా నామె తెలివి గాంచి 'ఓరీ! బాలుఁడా! నీకండకావరము యుద్ధభూమిలోనే తీఱుఁగల' దని శపించెనట! ఆఁడుదానిశాపమునకు భయపడి వీఁడు యుద్ధమునకుఁ బోలేడు. పట్టిపిఱికిపందరా" అని మంచన్న యొకసక్కెము లాడెను.

"ఏడేండ్లు కత్తి చేతఁ బట్టి సొరకాయకోఁతలు కోసిన బాలా

మహావీరుఁడు యుద్ధసమయము వచ్చునప్పటికి కల్తి పాఱవేసి సశోభ్యు యింట శృంగారపురుషుఁడై విహరించుచున్నాఁడు. ఛీ! వీని మొగ ము చూడవచ్చునా” యని తేఱ్ఱఁడు హెచ్చరించెను.

“చదరంగపుటాటలో చాకలిచందన్నచే ముమ్మాఱు లోడిపో యిన మనయీబాలనాయుఁడు నరసింగరాజుతల ఖండింతు నని యే డేం డ్లుత్తరకుమారప్రజ్ఞలు పలికెనే కాని రణరంగము వీక్షించిన నచట నొక క్షణమైన ధైర్యముతో నిలుచుండఁగలఁడఁటరా’ యని తోర్నీడు పలికెను.

ఈపరిహాసములకు బాలనాయునిమనస్సు చివికిపోయెను. ఎక్కడలేనిపౌరుషము వచ్చెను. అతఁడు తోఁక త్రొక్కఁబడిన త్రా చువలె లేచి “సోదరులారా! సత్యము పలికితిరి. ఇదివఱకు పెటికిపం దనే సారకాయకోతలు కోయుటకు చొరవ గలవాఁడనే. శీలము లేక స్త్రీలంపటుఁడనై సిగ్గు విడిచి విహరించినవాఁడనే. ఇఁక ముందు చూ డండి. మాతల్లిగారికడ సెలవుగైకొని రణరంగమునకు దుమికి రణ కేళి సలిపి నరసింగుని తల పట్టి ఖండించి తండ్రిపాదములకడఁ బెట్టి పితృఋణము దీర్చుకొని వీరస్వర్గమును జూఱఁ గొందును. వీరసమర కేళికి నాఁడోడ రండు; రండు!” అని పిచ్చియెత్తినవానివలె నొక్క పఱుగునఁ బోయి ఖడ్గము చేతఁ గొని మైలాంబకడకుఁ జని “తండ్రి లకడకుఁ బోయి స్వధర్మము నెఱవేర్చుకొనుట కనుజ్ఞయి” మ్మని వేఁ డికొనియెను.

తల్లి వానిసాహసంబున కచ్చెరు వందుచు “కుమారా! నీతండ్రి గారు నీకేమి యాజ్ఞ చేసినారో మఱచి యుద్ధమునకుఁబోవ నువ్విళ్లూ రుచున్న నీసాహసమును జూచినప్పుడు నేనేమి పలుకుటకును నోరాడ కున్నది. యుద్ధము లనర్థదాయకము” లని పలుకుచు సామోపాయ

ములచే వానిని యుద్ధసన్నాహమునుండి మరలింపఁ జూచెరు గాని యతఁడు మనస్సు మరలించుకొనక తల్లికి వీరధర్మము నిట్లు ప్రబోధించెను.

"కారెముపూడిలో ♦ ఘనపరాక్రమతఁ
దండ్రిలు నిలుచుండి ♦ దండు సేయంగ
నే నిట నుండుట ♦ నీతియే తల్లి ?
ఉండు మంటకు నీకు♦నొప్పునా మనసు ?
నీ వెఱుంగని ధర్మ♦మే నెఱుంగుదునె ?
ప్రాకృతభామల♦పగిదిఁ బల్కెదవు
వెఱ్ఱితనం బేల ♦ వీరునిసతికిఁ ?
గాయ మనిత్యంబు ♦ కల్మి పాలెక్క
జలబుద్బుదవిధంబు ♦ క్షణభంగురములు
షట్చక్రవర్తులు ♦ సకలభూపతులు
చనిరి బ్రహ్మేంద్రాది♦సర్వదేవతలు
భూతంబు లైదును ♦ జాలియుచు నుండు
శౌర్యసత్కీర్తులు ♦ సమయ వెన్నఁటికి
సకలపురాణముల్ ♦ సద్ధర్మకథలు
నీతిశాస్త్రంబులు ♦ నీ వెఱుంగుదువు
పౌరుషాధికతచే ♦ బ్రదుకుట లెస్స.
జననమరణములు ♦ జనులకు నిక్క
మాలయంబున నున్న ♦ నడవిలో నున్నఁ
దప్పక దార్కొనుఁ ♦ దథ్యంబుగాను
బుణ్యలోకంబును ♦ బొందుమార్గముల
వినిపింతు నేఁదల్లి ! ♦ విశదంబుగాను

సజ్జనసంగతి ♦ సంసార మొడల
గురువు బోధించిన ♦ గుఱిమీఁద మనసు
నిలిపి మరణ మొందు ♦ నిశ్చలుఁ డొకఁడు
ప్రాజ్యసామ్రాజ్యసం♦రక్షణమందు
ఘనరణమ్మున బొమ్మ ♦ గాయాలనొంది
మనసు చలింపక ♦ మరణంబు నొందు
శౌర్యపరాక్రమ♦సంపన్నుఁ డొకఁడు
వీర లిద్దఱు లెస్స ♦ వినువీధి కేఁగి
యాదిత్యమండలం♦బరుచాఱఁ జించి
పోయి పుణ్యాంబులభూమిఁ ♦ జెందుదురు
మొదటికార్యముఁ బూను ♦ ముఖ్యత లేదు
శౌర్యంబుచే మాకు ♦ సంపాద్య మగును."

ఇట్లు వీరధర్మమును బోధించుటఁ జూచి తనకుమారుఁ డింక యుద్ధమునకుఁ బోయి మరణము నొందఁగలవాఁ డని నిశ్చయించి బెగ్గడిల్లుచు నెట్లయిన మరలింపఁ జూచెను గాని వాఁడు వినకుండుటఁ జూచి తల్లి 'నాయనా! నాహితవచనంబులు నీచెవి నాటకున్నవి; పోయినవాఁడవు పోవుచునే యున్నావు గానఁ బోవునపుడు నీభార్యను మాంచాలను జూచి మఱి పొమ్ము." అని యనుజ్ఞనిచ్చెను.

అంత బాలనాయుఁడు తల్లియాజ్ఞను శిరసావహించి తనమామగా రయినగండుకన్నమనాయని యింటికిఁ జనెను. రాకరాక తమ యింటికి వచ్చిన తనభర్తను బరమసంతోషభావముతో నెదుర్కొని మాంచాల పూజించెను. ఆరాత్రి యామెతోఁ గడపుటకు నిశ్చయించి బాలచంద్రుఁ డత్తవారింట నిలిచెను.

అతఁ డారాత్రి యంతయు నంతఃపురంబును విడువక నిజసఖ

తో సరససల్లాపము లాడుచుఁ గ్రీడించుచు పతివ్రతయు, సుగుణవతి
యు, సుందరియు నగునిట్టిభార్యను విడిచి దుస్సాహసమున దుర్వర్తు
నుఁడనై విహరించి శీలము పోఁగొట్టుకొంటిని గదా యని మిక్కిలి
పశ్చాత్తప్తుఁడై యామెకుఁ దనపశ్చాత్తాపము తేటపడునట్లు "సఖీ!
మాంచాలా! ఇదివఱకు నీపట్ల మహాపరాధము గావించి మహాపాపుఁ
డనై విహరించితిని. ఇప్పుడు మనఃపూర్వకముగాఁ బశ్చాత్తప్తుఁడనై
క్షమాపణము వేఁడికొనుచున్నాను. క్షమింపుము" అని ప్రార్థించెను.

మాంచాల తనభర్త వచ్చినపని మఱచినవాఁడని తలంచి
యాతనితలపై నున్నకార్యభారమును సూచించుచు "నాథా! ఇక్కడనే
నాతో ప్రొద్దులు పుచ్చిన జనులు నవ్వుదురు. కడువేగముగాఁ గదన
భూమికిఁ గదలుఁడు. పరికించి చూడఁగాఁ గులవైరమును దీర్చునట్టి
మహావీరపురుషులు మీరు తక్క మఱియెవ్వరున్నా"రని హెచ్చరించి
పల్కెను.

అంతలోఁ దెల్లవాఱుచుండ నాయకసోదరమిత్రు లార్వురును
వచ్చి తనకార్యమును ధర్మమును మఱచి బాలనాయుఁడు పిఱికిపందయై
స్త్రీలోలుఁడై యంతఃపురమునఁ గ్రీడించుచున్నాఁడని మిక్కిలి రోష
ముతో రౌద్రాకారులై కత్తులు దూసి వెడలినకోపాగ్నిచే మాఱు
ఱుంగక కేరునట్టిమదగజములరీతి గండువారింటిముంగల నిలిచి నగరు
తల్లడమందునట్లు భీకరముగా నార్చి పెడబొబ్బ లిడిరి.

అప్పుడు బాలనాయుఁ డాగ్రహముతోఁ గటారి పెఱికి బయ
ల్వెడలి వచ్చి పైఁబడ నూహించెను గాని లజ్జాకరము లగువారిపోటు
మాటలచేఁ దెలివి గాంచి సిగ్గుపడి తనతప్పును గ్రహించి లోనికిఁ
బోయి తనచేతికటారిని తనభార్య మాంచాలచేతి కీయఁగా నామె
యుత్సాహముతో నందికొని

" రతిరాజసౌందర్య ♦ రణరంగధీర
కమలబాంధవతేజ ♦ కరుణాలవాల
వినతాత్మజునిలావు ♦ వెస నీకుఁగలుగు
నాదిరాజసమమైన ♦ సాహసం బబ్బుఁ
గృష్ణుని కైవన్నెన ♦ కీర్తి ఘటిల్లు
రవికాంతియుతుఁడవై ♦ రంజిల్లుచుండి
అలరాజుపగ దీర్పు ♦ మనుజులతోడఁ
బటుతరవిక్రమ ♦ ప్రౌఢిమ మెఱయ
శ్రీగిరిలింగంబు ♦ చెన్నకేశవుఁడు
వరము లొసంగఁగ ♦ వర్ధిల్లఁగలవు
క్షాత్రవవిజయంబు ♦ సమకూరు మీకు
నీ నాయుధము వడి ♦ నిచ్చును జయము
కలియుగంబున మీకు ♦ ఘనపూజ లమరు. "

అని పూఁబాల తన ప్రాణనాథుని దీవించి యాకటారిని మరల నొసంగెను.

అంత బాలచంద్రుఁడు వికసించిన మోముతోఁ దమ్ములతో బయల్వెడలి నిజగృహంబునకుఁ జని తల్లికిం జెప్పి మ్రొక్కిన నామె దీవించి 'కుమారా! శత్రువులం గెలువు'మని దీవించి పంపెను.

అంత బాలచంద్రుఁడు రణరంగమునకుఁ బోవుటకు సంసిద్ధుఁడై తనసోదరుల నందఱను జేర్చుకొని "సోదరులారా! అన్నయగు మన పోతురాజు వీరాధివీరుఁడైనను విప్రకుమారుఁడుగదా! అతనిని మన వెంటఁగొనిపోవుట సమంజసము గాదు. పోరాటమునందు మనకు విజయమో వీరస్వర్గమో తప్పక లభింపఁగలదు. ఒకవేళ రెండవదియే తటస్థించినచో మనపక్షమువారి కందఱకును బ్రహ్మహత్యాదోషము

సంఘటిల్లక మానదు. కావున మన మెల్లయినను అనపోతని మేడపి యందు విడిచి పోవలయును అందుకొఱకు నేనొక యుక్తి చేసెదను. అది యసత్యమైనను ముందు గలుగఁబోవు బ్రహ్మహత్యయంతటిదోష ముగాదు ”

అని చెప్పి వారినంగీకరించి కాలచంద్రుఁడు అనపోతని చెంతకుం బోయి “ అన్నా ! నాకు రాత్రి తెల్లవాఱుజామునఁ జెడుకల వచ్చి నది. ఆదోషపరిహారార్థమై నేను శ్రీశైలము పోయి రుద్రాభిషేకము గావించవలయును. అన్నగారియొద్ద సెలవు దీసికొంటిని. తమ్ములతోఁ గలసి యిప్పటికిఁ బోయి సాధ్యమైనంతశీఘ్రముగ నే మరలి వచ్చెదను. నాయనగారు సేనాసహితముగాఁ గదనరంగమునకుఁ గదలిపోవుచున్నారు. సకల రాజకార్యభారమును, అంతఃపురజనరక్షణాభారమును మనతలలపైఁ బెట్టి ధైర్యముతోఁ బోయియున్నారు. రాజకార్యములను, పితృవాక్యమును పాలింపవలసిన బాధ్యత మనయందున్నది. నీవు మాయందఱికంటెను పెద్దవాఁడవు. విద్యాధికుఁడవు. ధీరశిరోమణివి. కావున నీవు మేము వచ్చువఱకును రాజాంతఃపురమును, నగరమును గూడ వేయికన్నులతోఁ గాపాడుచుండవలయునని ప్రార్థించుచున్నాను. ఏకవీరుఁడవగు నీశక్తిసామర్థ్యములయందలి విశ్వాసముచే ననివార్యమగు నా దుస్స్వప్నశాంతికొఱకు నేనిల్లు గదలుచున్నాను. నీతమ్ములకార్యభారమంతయు నీవొక్కఁడవే భరింపఁగలవు. అట్లు భరింతు నని బాస యిచ్చినచో నిర్విచారముగా మేము పోయివచ్చెదము. మేము తిరిగి వచ్చువఱకును నీవిందు జాగ్రత్తగా నుండవలయును ” అని ప్రార్థించెను.

అనపోతరాజా మాటలు నిక్కములుగా భావించి “ అట్లే చేసెదను. మీరు వేగముగా రావలయును. ఆహవరంగమునుండి

వార్త లేమియును వచ్చుట లేదు. ఎప్పుడో యొకప్పు డాకస్మికముగా మనముగూడఁ బోవలసి యుండును. ఎంతమాత్రము నాలస్యము చేయక రావలయును" అనియెను.

బాల—మాకార్యము ముగించుకొని దైవానుగ్రహముచే శీఘ్రముగనే వచ్చెదము. ఎట్టిచిక్కులు తటస్థించినను, ఎన్నియవాంతరములు వచ్చినను మేము వచ్చువఱకు నీ పీయుఱాలు విడువ నని ప్రమాణము చేయవలయును.

అన—అట్లే మీరు వచ్చువఱకు నేనీనగరమును రక్షించుచుండెదను.

బాలచంద్రుఁ డీవిధముగా నవపోతరాజుచే బాసచేయించుకొని సోదరసహితుఁడై గురిజాలయుద్ధరంగమునుగూర్చి వెడలిపోయెను.

వారముదినము లయ్యెను. వారు తిరిగి రాలేదు. మొట్టమొదట బాలచంద్రునిమాటలయం దనపోతునకట్టి యవిశ్వాసమునుగలుగలేదు. క్రమముగా సంశయము గలుగుటచే నాతఁడు వారిపోవడనుగూర్చి విచారించెను. వారు నిజముగా శ్రీశైలము పోలే దనియు బ్రాహ్మణకుమారుఁడగు తన్ను రణభూమికిఁ గొనిపోవుటకు సంశయించి యిట్లు మాయోపాయము చేసి వెడలిపోయి రనియుఁ దెలిసికొనియెను. ఇఁక నాతఁ డేమిచేయఁ గలఁడు. ఆడినమాట తప్పి రణరంగమునకుఁ బా నెట్లుపోఁగలఁడు! యుద్ధ మెప్పుడు తటస్థించు నని యాతఁడువ్విళ్ళూరు చుండెను. తనయాయుధవిద్యానైపుణ్య మంతయుం జూపవలయు నని యాసపడుచుండెను. ఇంకేమున్నది? ఆతనియాశయంతయు నిరాశమైపోయెను. ఆతని యుత్సాహ మంతయు భగ్నమైపోయెను. తుద కాతని కీజీవితమే నిరర్థక మని తోఁచెను. ఆతఁడప్పుడు తనజీవితమును, తమ్ములయవివేకమునుగూర్చి గర్హించుచు

“ వెంగలి నైతిని ♦ వెలమలవద్దఁ
గలిమికోసము వచ్చి ♦ కలియుట లేదు
కులమునఁ గూడ నని ♦ కూడుట లేదు.
తల్లిని, దండ్రిని ♦ దాయాదిజనుల
నెడఁబాసి నీపొందు ♦ నే నమ్మియుంటిఁ
బగవాఁడ నైతినే ♦ బాంధవతతికిఁ ?
బాసి పోఁదగునయ్య ♦ బ్రహ్మన్నతనయ ? ”

అని పలుకుచు హతాశుఁడై, యపగతోత్సాహుఁడై, యప హృతవివేకుఁడై వీరావేశముతోఁ గరవాలము నొరనుండి చటాలునఁ బెరికి కంఠమున గ్రుచ్చుకొని యాత్మహత్య గావించుకొనియెను.



## పదునొకండవ ప్రకరణము.



బ్రహ్మనాయుఁడు మొదట దండు విడిసినతావు మేళ్లవాగనునది. మేళ్లవాగు పల్నాటిసీమలో నొక రమ్యమయినప్రదేశమున నున్నది. ఇది రెండుకొండల వరుసలకు నడుమ నొకచిన్నకనుమ. ఈకనుమలోనుండి 'మేళ్లవాగు' అను సెలయేఱు పాఱుచుండెను. ఆయేటియొడ్డున నీగ్రామ ముండుటచేత దీనికి నాకనుమకుఁ గూడ 'మేళ్లవాగు' అను నామ మేర్పడినది.

దీనికి నుత్తరముగా కారెముపూడికి నాఱుమైళ్లపొడుగున నొక కనుమమార్గము గలదు. నాయకురాలు మొట్టమొదట నీకనుమలో ప్రవేశించి బ్రహ్మనాయుని సైన్యముల నెదుర్కొని యుద్ధము చేయుట చేత తరువాతివారిచే నీకనుము 'నాయకురాలికనుమ' అని వ్యవహరింపఁబడుచువచ్చినది.

కారెముపూడి నాగిలేటికి (నాగులేఱు) నెడమయొడ్డున నున్నయొకపట్టణము. ఈనాగిలేఱు పల్నాటినదులలో ముఖ్యమయినది. ఇది కృష్ణానదిలోఁ గలియుచున్నది. ఈనది విశేషభాగము శిలాప్రదేశములలోఁ బ్రవహించునది యైనను కారెముపూడికడ కొంచెము వెడల్పెక్కువగ నుండి నదీగర్భ మిసుకతో నిండియుండెను.

నాగిలేటికి పడమరగా నాఱుమైళ్లదూరములో పల్నాటికి రాజధానియైన గురిజాలపట్టణము గలదు. బ్రహ్మనాయుని సైన్యములు మేళ్లవాగు మొదలుకొని కారెముపూడివఱకును, నాయకురాలి సైన్యములు గురిజాల మొదలుకొని కారెముపూడివఱకును విస్తరించి

యుండుటచేత కౌరవపాండవవీరులకు మున్ను కురుక్షేత్రములోని శమంతకక్షేత్రము రణరంగముగ నేర్పడినట్లు పల్నాటివీరులకు కారెముపూడిక్షేత్రము రణరంగముగ నేర్పడి వీరారాధనాతత్పరు లగువారికిఁ బుణ్యక్షేత్ర మయ్యెను.

మహారాజు లనేకులు పంపిన సేనలతో నాయకురాలు సేనలను జేర్చి నలగామునిని యుద్ధమునకుఁ బురికొల్ప నాతఁడు వీరపురుషోచితములయినకర్మముల నెల్ల నాచరించి గజారోహణం బొనర్చి జయలు దేటి యెల్లపరివారముతోను, సామంతులతోడను, సేనానులతోడను రణరంగమును బరీక్షింప కారెముపూడికి వచ్చి యుండెను. ఆవార్త విని మేళ్లవాగునందు దండు విడిసియున్నబ్రహ్మనాయుఁడు రణభేరి మ్రోగింపఁజేసి రణభూమికిఁ గదలెను. అంత నతనితోడి వీరవరాగ్రణులయొడళ్లు వీరావేశముచేఁ బరవశములై పోయెను. పల్లెమూకల గుండె లదరి బెదరి చెదరునట్లుగా వారుగావించు జయజయధ్వానములు మిన్ను ముట్టుకొని నల్దిక్కులు పిక్కటిలఁ జేయుచుండెను.

ఇరువురువీరు లిరుప్రక్కలఁ జేరి ప్రొద్దుటెండ పైఁబడకుండ గొడుగులు పట్టి వెంటరాఁగా బ్రహ్మనాయుఁడు విజయశంఖ మెత్తి పూరించి యొకపాలకి నెక్కి బయల్వెడలెను. అరిగెలజోళ్లు అతని పాలకి కిరుప్రక్కల నందముగాఁ బట్టిరి. నెమలికుంచెలవారు వింజామరములు వీచుచుండిరి. రాజులు వాని వెన్నంటి నడచుచుండిరి. వాని ముందు పల్నాటివీరులు ' జయజయ బిరుదుబిట్టరగండా ! జయజయ జగమెచ్చుగండా ! జయజయ గండరగండభేరుండా ! జయజయ కలవాలవీరభైరవా ! జయవిజయీభవ ' అని నాయుని హెచ్చరించుచుండిరి.

వీరికి ముందు తమతమబట్టువాండ్రు బిరుదుపద్యములం జదివి కైవారములు సలుపుచుండ,ఆవాలవారు, ఆనెమువారు,కొండ్లవిందుల వారు, గోవిందువారు, ముతసానివారు, ముయ్యూరువారు, నర్మాల వారు, నాయనివారు, పైడిచుక్కలవారు, పాలపర్తివారు, బలుమూరి వారు, బాలెమువారు, రేవనూళ్లవారు, రేచర్లవారు, అట్లూరివారు; మట్లూరివారు, చెవులవారు, చిల్లరవారు, మేకలవారు, కోకలవారు, గండువారు, గడుసువారు, సుంకరవారు, శూరపురివారు మొదలగు వారు నడుమ నడుమ వీరశంఖము లెత్తి యంబరము విచ్చిగి మీఁదఁ బడునట్లుగాఁ బూరించుచు నయముగాఁ జనుచుండిరి.

వీరిముందు డమాయీలవారు, మురజములవారు, బూరల వారు, పోటుధారలవారు, కాహళులవారు, వంకిణులవారు, కాలికొ మ్ములవారు, శంఖములవారు, సన్నాయిజోళ్లవారు, మురళీవారు, ముఖవీణెవారు, నరగలవారు, తప్పెటలవారు, డోళ్లవారు, వీరణముల వారు, తమ్మటమ్ములవారు, రుంజలవారు, చేగంటలవారు, చిఱుగంట లవారు తమతమవాద్యఘోషములతోఁ గుంభిని వణఁకునట్లుగా వెస వెస నడచుచుండిరి.

వారికి ముందు గుఱ్ఱపురౌతులును, వారికి ముందు మావంతు లును నడచుచుండిరి. వారికి ముందు రణభేరి మ్రోగుచుండెను. ఇట్లు బ్రహ్మనాయుఁడు రణరంగమును వీక్షింప నరుదెంచి కారెముపూడి నొకప్రక్కను విడిసియుండెను.

ఇట్లిరుదెగలవారును మహారణంబు గావించుటకు సర్వసన్నద్ధు లై సమయము నెదురుచూచుచుండఁగా నలగామరాజు కోడియల్లుఁ డును, వెలనాటిరాజేంద్రచోదుని మేనల్లుఁడును, ధాన్యవాటీపురాధీ శ్వరుఁ డయిన భీమరాజుపుత్రుఁడు నగు ‘‘కేతురెడ్డి’’ యని వ్యవహా

తింపఁబడుచున్న కేతరాజు నాయకురాలిచేఁ బ్రేరితుఁడై నలగామరాజు నంగీకారమును బడసి యుభయపక్షములకును సంధి గావించుటకై బ్రహ్మనాయనిచెంతకు బయలుదేఱి వచ్చుచుండెను.

బ్రహ్మనాయఁడావార్తచారులవలన విని యుచితపరివారముతో నెదురుగఁబోయి సబహుమానంబుగ నాతనిఁ దోడ్కొనివచ్చి పెదమలిదేవరాజు కొలువుకూటంబున రాజాజ్ఞచే నాతని నర్హాసనాసీనుం గావించి గౌరవించెను. అనంతరము యథోచితముగ నొండొరులకుశలప్రశ్నంబులు జరగినతరువాత కేతరాజు మలిదేవరాజు ననుమతిం గాంచి బ్రహ్మనాయనినుద్దేశించి యిట్లనియెను.

"బ్రహ్మనాయఁడా! ఈపెదమలిదేవరాజునకు మహామంత్రివైనను, ఆత్మబంధుఁడవైనను, రక్షకుఁడవైనను సర్వస్వమును నీవే యైయున్నావు. నీవు వివేకవంతుఁడవే కాక మిగులఁ బరాక్రమవంతుఁడవుగూడ నైయుంటివి. నిశ్చయముగా నీవంటిసత్పురుషుని, సత్యపరాక్రముని నేనెందును జూచి యుండలేదు. నీవు నీతిమంతుఁడ వనువిశ్వాసము గలిగియున్నవాఁడ నగుటచేఁ గట్టకడపట నేనుగూడ నీతో నొక్కమాట చెప్పి పోవలయు నని వచ్చితిని. మీవిభేదములకును, మీకష్టనష్టములకును నరసింహరాజే మూలకారణుఁ డని భావించి మీరాతని గొంతు గోసి పగ దీర్చుకొనవలయు నని నిశ్చయించుకొనియున్నారు. సరే. అట్లే కానిండు. మీగర్భశత్రువగునరసింహరాజును నేనిప్పుడే తీసికొని వచ్చి మీసమ్ముఖమున నిలువఁబెట్టెదను. బాగుగ నాలోచించుకొని మీరాతని రక్షించినను, శిక్షించినను భారమంతయు మీమీఁదనే వదలివైచెదను. మీరును వారును గలసి మైత్రితో మెలంగుచుండుట బంధుల మగు మావంటివారికిఁ బరమసంతోషవిషయము గదా! అందువలన లోకముగూడ సంతోషింపఁగలదు. ఉభయపక్ష

ములవారు నొక్కటై పల్నాటిని బాలించుచున్నచో సామంతరాజు
లెల్లరును మీయాజ్ఞలను జెల్లించుచుండుటయేకాక పరరాజులు మీ
బలమువంకఁ దేఱి చూచుటకైనను భయపడుచుందురు. మీమనసులు
మాత్రమే కలయవలయును గాని మాచర్లసీమ నెప్పటివలెనే పెదమ
లిదేవరాజు పాలించుచుండవచ్చును. అందుల కెవ్వరు నెట్టియభ్యంత
రమును జెప్పువారు గారు. నలగామరాజునకు నరసింహారాజైనను,
పెదమలిదేవుఁడైనను సోదరులేగాదా? మాచర్లసీమ నీయిరువురిలో
నెవ్వరు పాలించినను నాతనికి సమానమే. అట్టియుద్దేశముతోనే యీ
లేఁడు మాచర్లసీమను మీకిచ్చివైచినాఁడు. ఇప్పుడైనను గాదను
వాఁడు గాఁడు. ఇదివఱ కీపల్నాటిరాజ్యముయొక్క నిర్వాహకృత్య
మంతయు నీచేతులతో జరిగినది. ఈరాజ్యమును నిలిపినవాఁడవే నీ
వని చెప్పవచ్చును. అనుగురాజేంద్రుఁ డవసానకాలమునందు తనరా
జ్యమును, దనబిడ్డలను నీయందలి విశ్వాసముచేతనే నీ చేతులయం
దుంచి యీరాజకుటుంబమును, రాజ్యమును వర్ధిల్లఁజేయవలసిన దని
యొప్పగించి యున్నాఁడు. నీవును నట్లే విశ్వాసముతోఁ బని చేసితివి.
కాలకారణవశంబున నీనడుమ నొకరాజ్యము రెండుభాగములుగాఁ
జీల్పవలసి వచ్చినది. అప్పు డెవ్వరైన నీ కెదురాడి యుండిరా? అది
కారణముగాఁ గొంతకాలమునుండి యుభయపక్షములవారికిని బుద్ధులు
చెడిపోవుచుండుటచే మనసులు కలఁగిపోయినవి. అందుచేతనే యసూ
య లంకురించినవి. పగలు ప్రబలిపోయినవి. ఆనాఁడు కోడిపందెము
లు వలదని యెవ్వ రెంతగాఁ జెప్పినను నొక్కరైన విన్నారా? అనర్థ
కారణము లగు నట్టిపందెము లాడుటకై ముందుగా గురిజాలకు వచ్చి
నవా రెవ్వరో నీవెఱుఁగని దేమున్నది? ఇప్పు డావిమర్శన మంతయు
ను గతజలసేతుబంధనము. ఇఁక నామాట లటుండనిమ్ము! అనుగురా

జు కాలము నుండియు నమాత్యశేఖరుఁడ వై యున్న నీవు ఆతని బిడ్డలగు నీ రాజకుమారులందఱు నభ్యుదయపరంపరలం గాంచునట్టి యుపాయ మాలోచింపవలయును. ఆ భార మంతయు నీమీఁదనే యున్నది. పూర్వము పాండవులు తమ భ్రాతలగు ధార్తరాష్ట్రుల నందఱను గురుక్షేత్రయుద్ధరంగమునఁ గూకటివేళ్లతోఁ గూల్చివైచి తాము మాత్రము బావుకొన్న దేమున్నది? తుదకడవులపాలై పోవుటయేనా? సమస్తసామంతులును, సకలబాంధవులును సమసిపోయిన వెనుక శ్మశానమువంటి రాజ్యమును సంపాదించినంతమాత్రమున లాభ మేమి వచ్చినది? కావున నో మంత్రిశేఖరా! ప్రాజ్ఞుఁడవైన నీవు బాగుగ నాలోచించుకొనుము. నీమూలముననే బలపడిన యీ పల్నాటి రాజ్యము నీచేతనే భగ్నమైపోవునట్టి మార్గమునఁ బోకుము. నామాట మన్నించి యిఁక మహారణము మాట తలపెట్టకుము. సవతిపుత్రులకు సంధి ఘటించి యుభయపక్షములవారును సుఖముగా వర్ధిల్లునట్టి యవకాశమును గల్పింపుము. ఈ సత్కార్యమును నిర్వహించుశక్తి యంతయును నీచేతులలోనే యున్నది. మనకును, లోకమునకును, మన రాజకుటుంబమునకును శ్రేయోపాయ మింతకంటె నేదియును లేదు. నీ వీయనుసంధానము చేయక తప్పదు. నీకో దండము! నాకో దండము! అనుగురాజుతోడు! ఇఁక నేను చెప్పవలసిన దేమియును లేదు. నాకు సెలవు!" అని సర్వజ్ఞ యనుగు సంధిమార్గమును దెలియఁజేసెను.

ఆమాట లన్నియు నాహావనిశ్చయులై యున్న వీరవరులకందఱకును గూడ నసహ్యములుగా నుండెను. అందుఁ గొందఱు బాలవీరులు యుద్ధమున కంతరాయముం గూర్పఁజూచుచున్న యా కేతరాజును బంధించి పగను మఱింత పెంచవలయు నని ప్రయత్నించిరి గాని గండు కన్నమనాయుఁడును కొమ్మరాజు మొదలగు పెద్ద లడ్డు పెట్టుటయును ప్ర

హించి యట్టికార్యము జరుగకుండ నాఁపివైచిరి.

అప్పుడు బ్రహ్మనాయఁడు కేతరాజుం గాంచి "అయ్యా! మీరు వచించిన వాక్యములు యుక్తియుక్తములును, సర్వసమ్మతములు నైయున్నవి. కాని యేడేండ్లపాటుగా నింతింతలనరాని కష్టముల నెన్నిటినో యనుభవించి యెప్పుడు పగ దీర్చుకొందుమాయని యిచ్చటి వీరశేఖరు లందఱును యుద్ధార్థులై యువ్విళ్లూరుచున్నారు. అందఱను శాంతచిత్తులఁ జేసి యానుకూల్యముం గూర్చుటకుఁ బ్రయత్నించెదను. దైవ మనుకూలించుఁగాక!" అనియెను.

కేత—పురుషప్రయత్నము సంపూర్ణముగఁ గావించినచో దైవాధీన మగుఫలసిద్ధియును లభింపవచ్చును.

కొమ్మరాజా మాట విని "ఈముగ్గురుతల్లులబిడ్డలును ముల్లోకములు మెచ్చునట్లు కలసిమెలసి యుండుచోఁ గన్నులుచల్లగాఁ గాంచుటకంటె మనవంటివారి కింకఁ గావలసిన దేమున్నది? అట్లే యాలోచింతము!" అనియెను.

అంత పెదమలిదేవరాజు "సోదరా? కేతరాజా! ఆత్మబంధుఁడ వగునీవు మాయన్నదమ్ముల కనుకూలముగా సంధిచేయ వచ్చినందులకు సంతసించితిని. ప్రస్తుతశాంతిమాత్రమే ప్రధానముగఁ జూచుకొని ప్రయత్నించుటవలనఁ బ్రయోజనము లేదు. మాటలుమాత్రమే కాక యుభయపక్షములందును మనసులుఁగూడ మాఱవలయును. ఇఁక దీనితో నెన్నఁడు నెట్టియవాంతరకలహములును లేకుండఁ బోవలయును. తొందరపడి యేదోవిధముగా సంధిచేసికొంటి మని సంతోషించుటవలన లాభము లేదు. ఒకవారముదినములవఱకు నుభయపక్షములవారము బాగుగ నాలోచించుకొని యిఁక నెన్నఁడు

నెట్టిభేదమును బుట్టనిపద్ధతి నైకమత్యముతో సంధి చేసికొనవలయును" అనియెను.

కేత—చిత్తము. అట్లే చేయవచ్చును. సెల వొసంగినచో నేను పోయి వచ్చెదను.

అని యాతఁడు రాజునొద్దను, కొమ్మరాజు మొదలగు రాజ బంధువులయొద్దను, బ్రహ్మనాయఁడు మొదలగు పెద్దలయొద్దను, సెలవుగైకొని వెడలిపోయెను.

---

ను. అంతమాత్రముతో నాఁగునా? ఆయపకీర్తి తరతరములవఱకు నక్లె యుండును.

నాయ—అపకీర్తిమాట కేమి? కావలసినకార్య మంత ఘనమైనది కావున సమర్థుఁడగువానిని బంపవలయును. అందుకొఱ కెల్ల విధముల నాలోచింపఁగా మనప్రతాపరెడ్డియే తగినవాఁ డనితోఁచు చున్నది.

నర—ఇఁక నేమి? అతఁడు సర్వసమర్థుఁడే. గుట్టునిలుపువాఁ డగునో కాదో నీవే యాలోచింపవలెను?

నాయ—ఆవిషయమై సంశయ మెంతమాత్రము నక్కఱలేదు. అతఁడు నాగూఢచారులలో నగ్రగణ్యుఁడే. నావాఁడై యుండియుఁ జాలకాలమువఱకు బ్రహ్మనాయనికిఁగూడ నాత్మీయుఁ డని నమ్మకము పుట్టునట్లు మసలఁగలిగినవాఁ డాతఁడొక్కఁడే.

నర—అట్లయినచో నిఁక నేమి? అన్నివిషయములను జక్కఁగా బోధించి యాతనినే పంపుదము.

నాయ—సరేకాని మంచివానిని వదలుకొనవలసి వచ్చుచున్నందులకు విచారించుచున్నాను.

నర—వదలుకొనుట యెందులకు? పని పూర్తి చేసికొని వెంటనే తిరిగి వచ్చును గాదా?

నాయ—నరసింహరాజుగారు! మీరు దూరమాలోచించుట లేదు. ఇంతపని యాతనిచేఁ జేయించి యింకను మనకడకు రానిచ్చుట యేనా?

నర—వచ్చిన నేమి? విశ్వాసముగల యాతని యెడల సంశయింపవలసినప నేమున్నది?

నాయ—అట్లనుకొనఁగూడదు. ఏకాలమున కెట్టి మార్పులు వచ్చునో. కేవలము నమ్మకముమీఁదనే యాధారపడియుండుట రాజనీతి గాదు.

నర—అట్లయినచో సర్వజ్ఞురాల వగునీవు నీయిష్టము వచ్చినట్లు చేయుము. ఆతనిపైని మఱి యెవ్వని నియోగింపఁ దలఁచితివి?

నాయ—అకష్టనిష్ఠురము లన్నియు మీకెందులకు? మీకుఁ గావలసిన దాయొక్కపనియే గదా! అది చల్లగా జరగి తీరును. మీరిఁక నిశ్చింతులై యుండుఁడు!

మంచి దని చెప్పి నరసింహారాజు నాయకురాలి మందిరము నుండి వెడలిపోయెను. ఆతఁ డట్లు పోయినతరువాత నాయకురా లొక్క పెద్దనిట్టూర్పు విడిచి “పల్నాటిరాజ్యము విభాగములు గాకుండ నొక్కటే ప్రభుత్వముక్రింద నుంపవలయు నని నా ప్రయత్నము. కాని నాకు విరుద్ధముగాఁ బ్రతిపక్షి యగు బ్రహ్మనాయఁడు మాచర్లసీమను బిడ్డలు గొట్టి పంచుకొనిపోయినాఁడు. కాని, దానిని మరల నేట్లో సాధించి సంపాదించితిని. ఇప్పు డాచిక్కు మరలఁ దట స్థించినది. పోరాటములో నొకవేళ నీచిక్కు తీఱిపోయినను ముందు ముం దింతకంటెను బెద్దచిక్కు తటస్థింపనైయున్నది. ఎట్లయిన నీరాజ్య మన్యకుటుంబాధీనము గాకుండ నన్ను నమ్మియున్న నరసింహారాజునకు నలగామరాజు ననంతరమందు చెందింపవలయు ననియే నాప్రయత్నము. ఈకార్యము సిద్ధించుకొఱకు కెట్టితంత్రముల నుపయోగించుట కైనను, నెట్టి ఘోరకృత్యములఁ గావించుటకైనను వెనుదీయుదానను గాను. నాతరువాతిలోకమువారు నాయకురాల నగునాదర్పముంగూర్చి ప్రశంసించునప్పుడు నన్ను మహాకాళితోఁ బోల్చినను, మరణదేవ

తతోఁ బోల్చినను, రాజతంత్రనిపుణురా అని భావించినను, రాకాసి యని భావించినను వారివారి యూహలతో నా కెంతమాత్రమును నిమిత్తము లేదు. నాముఖ్యోద్దేశముమాత్ర మింతే—ఇందుకొఱకే నాసర్వశక్తులను ధార వోసి సర్వవిధములఁ బ్రయత్నింపక విడువను" అని యనుకొనుచు నంతస్సౌధమునకుం బోయెను.

---

## పదుమూఁడవ ప్రకరణము.

తెల్లవాఱినది. కాని యింకను సూర్యోదయము గాలేదు. గురిశాలమైదానమునందు అలరాజామృతకళేబరము పడియుండెను. రక్షకభటుఁ డాశవముం గాంచి యదరిపడి పరికించి చూచెను. అతఁడు రాజగారియల్లుఁడని గ్రహించినంతనే యారక్షకభటుని సకలాంగకములును గంపించిపోయెను. అతనికిఁ గొంతసేపటివఱకు నాత్మజ్ఞానమే లేకుండఁబోయెను. ఇంచుక మనసు కుదురుపఱచుకొని యారక్షకభటుఁడు తనశంఖమును బూరించి యూదెను. "ఈవార్త రణరంగమునం దున్నరాజగారికిఁ దెలియఁజేసి యాజ్ఞను సంపాదించుట కాలస్యమగును. ఇప్పుడే పోయి యంతఃపురమున రాణిగారి కెఱింగింపవలయును." అని యాలోచించుకొనుచుండఁగా శంఖారావము నాలకించి మఱియొకరక్షకభటుఁ డచ్చటికి వచ్చి యాదారుణసందర్శనముం గాంచి మొదటివానివలెనే కళవళపడిపోయెను.

అతని నచ్చటఁ గాపుంచి మొదటి రక్షకభటుఁ డొక్కపరుగున రాజాంతఃపురమునకుం బోయి పరిచారికల కాఘోరవార్త నెఱింగించెను. అది విని వారుగుండెలు బాదుకొనుచు లోనికిఁ బోయి రాణిగారికి సర్వమును నివేదించిరి. అరనిమిషములో నంతఃపుర మంతయు నంత్యకాలసముద్రమువలె గొల్లున ఘోషించిపోయెను. ఆదుర్వార్త చెవినిఁ బడినంతనే రాజపుత్రిక యగురత్నాలపేరమ్మ రాతిబొమ్మవలె నిస్తబ్ధయైపోయెను. ఆకస్మికముగఁ గలిగినదుఃఖావేగముచే నంతరంగమంతయు శోషించిపోవుటవలన నామెకన్నులనుండి యొక్కయుష్ణజలబిందువైనను వెలువడుటలేదు.

చిత్రప్రతిమవలె నట్లే నిలువుగ్రుక్కై యున్న పేరమ్మను గాఁగిలిం చుకొని రాణి యొడలెఱుంగని దుఃఖముతో గోలుగోలున నేడ్చుచుం డెను. బంధుయువతులును బరిచారికలునుగూడ పేరమ్మయవస్థంగాంచి పరిపరివిధములఁ బలవించుచుఁ బెద్దపెట్టున విలపింపఁదొడంగిరి. అంతః పురరక్షణార్థమై నిలిచియున్న పరిజనులలోఁగూడ నేడుపులును, పెడ బొబ్బలును మిన్నులుముట్టుచుండెను. పురస్త్రీలందఱును నార్తనాద ములు చేయుచు గుంపులుగుంపులుగా నంతఃపురమునఁ బ్రవేశించుచుం డిరి. పురజనులందఱునుగూడ దుస్సహమైన యీదుర్వార్త నాలించి మిగుల శోకింపఁదొడంగిరి. అప్పుడు రాజధానినగరమంతయుఁ గూడ శోకతరంగతాడితమై క్షోభించి పోవుచుండెను.

కొంతసేపటికి రాజకుమారి యగు పేరమ్మ తెలివి దెచ్చుకొని యొక్కదీర్ఘశ్వాసమునువిడిచి తన్నుఁగాఁగిలించుకొని యనేకరీతులఁ బరిదేవనంబు గావించుచున్న తల్లిం గాంచి బాష్పగద్గదస్వరముతో “ అమ్మా ! ఎంతకాల మిట్లేడ్చినను మరణించినవారు మరల రారు గదా ! అట్టిచో నీదుఃఖమువలన నేమిప్రయోజనము ! బ్రదికి యున్న ప్పుడైనను ఆయనసందర్శనసంభాషణములు మనకుఁ గఱవే యైపోయి నవి. అయినను నట్టిసుగుణరాశి, అట్టిశుభచరిత్రుఁడు, అట్టిశూరశిరో మణి యల్లుఁడయ్యెనుగదా యని నీవును, దండ్రియును, భర్త యయ్యె నుగదా యని నేనుగూడ నానందించుచునే యున్నాము. ఇప్పుడు మాత్ర మాయానందమున కంతరాయ మేమి వచ్చినది ? ఆయన మర ణించి రనియా ? అట్టిపుణ్యపురుషునకు మరణ మన నేమి ? ఆపరిశు ద్ధాత్మునిఁ జంపఁగల సమర్థు లెవ్వరున్నారు. అమ్మా ! ఊరకదుఃఖింప కుము. ఆయన నాప్రాణేశ్వరుఁడు. నేనాయనసహధర్మిణిని ! ఆత్మస మర్పణముఁ గావించుకొని మేమిరువురము నైక్యమైపోయితిమి. మాకు

జననమరణములును, సుఖదుఃఖములును, సంయోగవియోగములును లేనే లేవు. అట్టిమాకొఱకు నీవింతగా శోకించు టెందుకు? ఊఱడిల్లు మూఱడిల్లుము!" అని తల్లి కన్నీరు దుడిచి కౌఁగిలించుకొనియెను.

రాణి యెంతమాత్రమును దుఃఖము నాపుకొనఁజాలక "తల్లీ! నీవు మాకేకపుత్త్రికవే యైనను అలరాజునకు నిన్నిచ్చి పెండ్లి చేసి యాఁడుబిడ్డగను మగబిడ్డగనుగూడఁ జేసికొనఁగల్గితి మని యెంతో యానందింపఁగలిగితిమి. ఆయాశ యంతయు నడుగంటిపోయిన తరువాత నేడుపుగాక యింకేమున్నదమ్మా! ఇఁక నే మొగము పెట్టుకొని నీ మొగము చూచుచు జీవింపఁగలను తల్లీ!" అని వెక్కి వెక్కి యేడువఁదొడంగెను.

"అమ్మా! దుఃఖము నడంచుకొనుఁడు. అమ్మాయిగారికిఁ గూడ గుండె చెదరిపోయినచో నావల మనమందఱము నేమియును జేయఁజాలము. బిడ్డను జూచుకొనియైన శోకమును మ్రింగివేయుఁడు" అని పరిచారికలును, బంధుయువతులును, పౌరకాంతలును బరిపరివిధముల రాణిగారి నూఱడింపఁదొడంగిరి.

కాని రాణిగా రెంతప్రయత్నించినను శోక మాచుకొనఁజాలకుండెను. అప్పుడు రాజకుమారి తల్లింగాంచి "అమ్మా! పరమసాధ్వియుఁ, బతివ్రతయు, వీరమతియు నగుకాంతకుఁ గర్తవ్యనిర్వహణమే ప్రధానమైనది గాని కష్టసుఖములతో నామె కెంతమాత్రమును నిమిత్తము లేదు. అనంతరకరణీయమున కాలస్య మగుచున్నది. ఆత్మేశ్వరుఁ డర్ధాంగి నగునాకొఱ కెదురుచూచుచుండును. నాకిఁక సెలవొసంగుము. నేఁబోయి వచ్చెదను." అని చటాలున లేచెను.

రాణి గుండెలు బాదుకొనుచు "అదేమితల్లీ! అదేమితల్లీ! ఎక్కడకుఁ బోయెదవు? మతి చెడిపోవుచున్నది కాఁబోలునే మా

తల్లీ! నీవుకూడ నిట్లయినచో నేనెట్లు బ్రదుకఁగలనమ్మా!" అని
యేడువఁదొడంగెను.

పేరమ్మ తల్లికౌఁగిలి విడిపించుకొని "అమ్మా! నామతి చెద
రిపోలేదు. నానాథుని పాదకమలములపై నర్తనము చేయుచున్నది.
దానిం గలయువఱకును నాకును స్వస్థతలేదు. భర్తృసహగమనమే
పతివ్రతలకుఁ బరమధర్మము. స్వధర్మనిర్వాహణార్థమై చనుచున్న నన్ని
వ్వరు నడ్డగింపవలదు. నాకొఱకెవ్వరును దుఃఖింపవలదు. అమ్మా!
అల్లునిచేతులం దెప్పు డప్పగించితివో యప్పుడే నేను నీబిడ్డను గాకుం
డఁ బోయితిని. అప్పుడే నేను నాయాత్మేశ్వరుని కర్ధాంగి నైతిని. ఇఁక
నాకెవ్వరితోడను నెట్టియాత్మసంబంధమును లేనట్లే—అజ్ఞానముచే
భ్రాంతిచే ననుకొనుటయే గాని—ఆశపడుటయే గాని యెవరికెవ్వ
రును లేరు. ఎవరికర్మము వారిదే. అమ్మా! నీవు మహారాజ్ఞి వైన
నేమి! నాకర్మఫలమును దప్పింపఁగలవా? ఇఁక నన్నడ్డుకొనకుము.
నాదారిని నేను పోయెదను." అని పలుకుచు నున్మాదినివలె, శివశ
క్తివలె, దేవీమూర్తివలె అవరోధమును విడిచి యొక్కపరుగునఁ బోయి
సింహద్వారమును దాఁటి రాజవీథినిఁ బడి మైదానమున కభిముఖయై
పోవుచుండెను. రాణియు, నంతఃపురకాంతలును, బరిచారికలును
గూడ నామెను వెంబడించిరి. ఆవెనుక నంతఃపురరక్షకులును, దక్కిన
పరివారజనులును, పురవాసులును విచారాద్భుతావేశచిత్తములతో
బయలుదేఱి పోవుచుండిరి.

ఒక్కనిమిషములో నగర మంతయు నామైదానమునకుఁ జేరు
కొనియెను. అట్లు తదేకదీక్షతో నన్యచింత లన్నియును మఱచి పోవు
చున్న రమణీరత్న మగు రాజకుమారి ప్రాణేశ్వరుని మృతకళేబరము
చెంతకుం బోయి యాతనిపాదపద్మములచెంతఁ జాగిలఁబడి చేతులు

జోడించి నమస్కారము గావించి యాచరణకమలములను గన్నుల
కద్దుకొనుచు దుఃఖగద్గదస్వరముతో " ఆత్మేశ్వరా! అదృష్టహీను
రాల నగు నన్నుఁ బెండ్లియాడుటచేతనే మీకిట్టి యకాలమరణము
గలిగినది! మీఘోరహత్యకు నేనే మూలకారణ మైతిని. యాదవ
కులంబునకు ముసలమువలెఁ బల్నాటిరాజకుటుంబమునందు బాలికనై
నేను జన్మించుటచేతనే దేశమం దంతటను దేవాసురసంగ్రామములు
పుట్టుచున్నవి. గర్భశత్రుత్వములు ప్రబలుచున్నవి. అన్యోన్యభేద
భావములును, బరస్పరాసూయలును వర్ధిల్లుచున్నవి. ఈసంక్షోభ
ములు, ఈఘోరకృత్యములు, ఈశాత్రవానలజ్వాలలు, నాచావుతోఁ
గాని చల్లారునవి గావు." అని హృదయోద్వేగముతోఁ బలుకుచుఁ
జటాలున లేచి " సేవకులారా! పేరాచెద రేమి! శీఘ్రముగాఁ జితిని
జేర్పించుఁడు. ఆత్మేశ్వరుని పవిత్రదేహము నందుంచి యగ్నిజ్వాలలను
రగుల్కొల్పుఁడు! ఆలస్యము చేయకుఁడు. స్వకుటుంబక్షేమమునకై,
స్వజనశ్రేయమునకై, స్వదేశకల్యాణమునకై నేనిప్పుడు స్వామితో
సహగమనము చేయవలయును! లెండు! త్వరపడుఁడు." అని వేగి
రపెట్టుచుండెను.

అందఱును శోకావేగముచే నేమి చేయుటకును దోఁచక చిత్ర
ప్రతిమలవలె నిర్విణ్ణులై యుండిరి. రాణి గుండెలు బాదుకొనుచు
" అమ్మా! అంతసాహసమా! నన్నేమిచేసిపోయెదవు? తండ్రిగారి
కేమియాధారము చూపించెదవు? ప్రాణము లన్నియును నీమీఁదనే
పెట్టుకొని బ్రదికియున్న మాయాశల నన్నిటిని నాశము చేసి పోవు
టకు నీమనస్సెట్లు సాహసించుచున్నదే తల్లీ! లోకమం దందఱును
జచ్చిననాఁటితోఁ జచ్చిపోయినదో నీక నీసృష్టి నిలువఁగలదా బిడ్డా!
రాజకుమారికవై నీవేమిభోగము లనుభవించితివి? బాల్యమునందే నీకు

బడిసి భారముగాఁ దోఁచుచున్నదా! కష్టములు జీవులకురాక కట్టె లకువచ్చునా తల్లీ! అయ్యో! నీవే లేకపోయినచో మాకీ రాజమందిరము లెందులకు? బ్రదుకు లెందులకు? కుమారీ! నామాట వినుము. ప్రాణబంధువుల దర్శనమువలన నెంతభరింపరానిదుఃఖములైనను క్రమక్రమముగా శాంతింపఁగలవు. నాయనగారు సకలసేనాసమేతులై సమరరంగమునం దున్నారు. ఈదుర్వార్త విని యింతలోనే రాఁగలరు! వారు నీకును నాకును బెద్దలుగదా! ప్రత్యక్షదైవతములు గదా! ఆయనయాజ్ఞ గైకొనకుండ నన్యథాప్రవర్తించుట యధర్మమని నీవెఱుంగవా? తల్లీ! దుఃఖావేగముచే దూరదృష్టి లేక సాహసము చేయకుము! నామాట వినుము! నాయనగారు వచ్చువఱకు నా చెంత నుండుము. అమ్మా! నామాట కెన్నఁడైన నెదురాడితివా? ఈయొక్కమాట మన్నించుట కింత కళవళమేల? తల్లీ! తొందరపడకుము. దుఃఖము నణచుకొనుము" అని కుమారిని గట్టిగఁ గౌఁగిలించుకొని విడువఁజాలక గోలుగోలున నేడువఁదొడంగెను.

వీరపతివ్రత యగు రాజకుమారి వియోగదుఃఖావేశముతోఁ దల్లికౌఁగిలి బలవంతముగ విడిపించుకొని "నన్నెవ్వరును బట్టుకొనవలదు. నేనీలోకమునందు లేను. నాకీలోకమం దేదియును లేదు. ఇఁక నాకీలోకముతోఁ బనిలేదు. రాజ్యముతోఁ బనిలేదు. తల్లిదండ్రుల యానతితోఁ బనిలేదు. నాకు నేనే నియంతను, గర్తను నైయున్నాను. అవిచ్ఛిన్నసతీత్వముగ నాశరీరము నగ్నిజ్వాలల నాహుతిచేసి యాత్మేశ్వరునితో నైక్యముం గాంచి యపవర్గమును జూఱగొనవలయు నని దృఢనిశ్చయముఁ గొనియున్నాను. నాపవిత్రోద్దేశమున కెవ్వరు నంతరాయమును గల్పింపఁజాలరు! ఓతల్లీ! నాకొఱకించుకంతయును విచారింపకుము! ఈనిర్భాగ్యురాలు నీకడుపునఁ బుట్టనే లేదని యనుకొనుము.

ఈక్షణమునందే నన్ను మఱచి పొమ్ము! ఓతండ్రీ! ఈ విధేయురాలు నీయొద్ద సెలవు గైకొనకుండ నన్నిటను సర్వస్వాతంత్ర్యురాలనై యానందముతో నత్తవారి యింటికి బోయినదని యసహ్యించుకొనకుము! జననీజనకులారా! ధన్యదంపతులగు మీకుఁ దనయనై జన్మించినపుణ్యముచేతనే నేను స్వామిసహాగమనసౌభాగ్యమును గాంచుచున్నాను. ఓబంధుపరిజనులారా! ప్రియముచేనైననేమి, యప్రియముచేనైననేమి నాకిట్టియవకాశమును గల్పించి యదృష్టయపుణ్యలోకావాప్తిం గూర్చినమీకనేకవందనములు. పౌరులగు నాసోదరసోదరీమణులారా! నాకల్యాణసమయమున మీరందఱు ననేకవిధముల నానందావేశముచే నన్నభినందించితిరి. ఆనాకల్యాణమే పల్నాటిరాజ్యకల్యాణమునకు భంగకరమైనది. పల్నాటిభాగ్యవినాశమునకు నేను తోఁకచుక్కనై జన్మించితిని. నాయభాగ్యజీవనసంచారముచే ననేకశుభగ్రహములకు వక్రగతి గలిగినది. అనేకపాపగ్రహములకుఁ బరిపోషణము పట్టినది. కులసంక్షోభమునకును, రాజ్యసంక్షోభమునకును, ప్రజాసంక్షోభమునకును మూలకారణము నేనే. నాకొఱకు మీరెవ్వరును విచారింపవలదు. మీక్షేమముకొఱకే నేననంతకల్యాణమూర్తియగు నాప్రాణేశ్వరుని యడుగుజాడల ననుసరించిపోవుచున్నాను. సంతోషముతో నందఱును సెలవిచ్చి నన్ను సాగనంపుఁడు. తల్లిదండ్రులారా! ఆత్మబంధువులారా! పరిజనులారా! పౌరులారా! నాకడసారివందనములఁ గైకొనుఁడు! ఓపరమేశ్వరా! పరమకరుణాకరా! భక్తవత్సలా! ప్రణయామూర్తీ! నీకివే సాష్టాంగప్రణామములు! నన్ను నాప్రాణేశ్వరునిం జేర్చుము! హా ప్రాణనాథా! పాదదాసి నగు నన్నుఁ బరిత్యజించి యేకాకివై పోవుట శరణాగతరక్షకుండ వగు నీవంటివాని కుచితముగాదు. నాథా! నిలువుము! నిలువుము! నేనును నీవెంటనే

వచ్చుచున్నాను. ఓనాగమ్మతల్లీ ! నీవు యోగమాయవలె యుగయుగాంతరములవఱకు నీయుసురుపోసికొని బ్రదుకుము. హాపరమేశ్వరా !'' అని పైటచాటున నున్న బాకును పైకిఁదీసి గుండెలలోఁ గ్రుచ్చుకొని ఒక్కక్షణములోఁ బ్రాణేశ్వరుని మృతకళేబరముపైఁ బడిపోయెను. అంతలోనే యామెప్రాణవాయువు లనంతవాయుసాగరతరంగములలో విలీనములైపోయెను.

ఆమైదానమంతయు నొక్కసారిగా హాహాకారములతోఁ బ్రతిధ్వనించిపోయెను. కన్నబిడ్డపాటు కనులారఁ గాంచిన రాణి దుస్సహదుఃఖావేగముచేఁ గూలఁబడి కొయ్యబాఱిపోయెను. అంతఃపురపరిచారికలార్తనాదములు చేయుచు నామెను పల్లకియందుంచి యంతఃపురమునకుఁ దీసికొనిపోయి యనేకవిధముల నుపచారములం గావింపఁదొడంగిరి. ఈవిధముగాఁ బల్నాటిరాజ్యలక్ష్మి యగురకోల పేరమ్మ పవిత్రశరీరము ప్రాణేశ్వరునితోఁ గలసికొనియెను. ఆమె యాత్మ యాతనియాత్మతో నైక్యమయ్యెను. ఇట్లు వారిచిరకాలవియోగము శాశ్వతసంయోగముగాఁ బరిణమించి శాంతిమంత మయ్యెను.



ఆమాటలు విని బాలచంద్రుఁడు మండిపడుచు "నాయనగారూ! మీరు మొదటినుండియు నిట్లే సత్యకాలపుయోచనలు చేసి శత్రువుల వలలలోఁ బడిపోవుచున్నారు. నారీరూపరాక్షసి యగు నాయకురాలిపెత్తనమున్నంతవఱకు దుస్తంత్రములకుఁ గొఱవయేముండును? ఆనోకఁఠములోఁ బ్రాణములుండఁగా మంచిమాటలతో మనకు మాచర్లసీమ వదలివైచు ననుకొనుచున్నారా? ఈరాయబారముల తంతులును, శాకపాకలముచ్చటలును దుదకు రసాభాసములు గాక మానవు. తమపక్షమునందే తప్పున్నదని లోకము నిందింపకుండఁ దప్పించుకొనుటకై యిది యంతయును నాయకురాలు పన్నిన పన్నాగముగాని న్యాయమైన రాయబారముగా నాకుఁ దోఁచుట లేదు" అనియెను.

బ్రహ్మ—సరే. నీవు భావించునట్లుగా నిది యంతయును గపటతంత్రమే యని నిశ్చయింతము. దానికిఁ దగినట్లుగా మనము గూడ మాట దక్కించుకొనఁగూడదా?

బాల—నాయనగారూ! ఇఁకను నట్లనియెద రేమి? మనము మనమాట యొక్కటియైనను నిలుపుకొనఁగలిగితిమా? పోయినరాజ్యము పోఁగా స్వశక్తిచే సంపాదించుకొన్న సంపత్తిని చల్లగా ననుభవించుచున్న మలిదేవరాజును మాచర్లసీమ మరల స్వాధీనము చేసికొనవలయు నని చెప్పి సపరివారముగా లేవఁదీసికొని వచ్చితిరి. యుద్ధమే నిశ్చయ మని శ్రీపురాంతకమున నెల్లవారికి నెఱింగించితిరి. కంకణాలపల్లెలో మహావీరు లందఱిచేతను గదనకంకణములు గట్టించి ప్రతిజ్ఞాబద్ధులం గావించితిరి. తుట్టతుదకు కారెమపూడి తరలివచ్చి రణరంగమునుగూడ నేర్పాటు గావించితిరి. ఇప్పుడు శత్రువులు సకలసేనానివహంబుతోడను సమరసన్నద్ధులై సమయమున నిరీక్షించుచుండఁగా

నింకను సంధిసాధనాన్వేషణము లేనా ? ఇంకను సామోపాయ ప్రయత్నము లేనా ?

ఇట్లు వీరావేశపరవశుఁడై పలుకుచున్న బాలచంద్రునిఁ గాంచి మామగారగు గండుకన్నమనాయఁడు "కుమారా! నీవు నాయన గారితో మాటాడుచుంటి వనువిషయమును మఱచిపోవుచున్నావు. ఆయన వీరయోధుల కాదర్శస్వరూపుఁడు. పరమభక్తులకుఁ బ్రత్యక్ష విష్ణుస్వరూపుఁడు. ఆయనయెదుట నీవా మాటలాడుట! నీవు రణో త్సాహివే గాని రాజనీతిజ్ఞుఁడవు గావు. గత్యంతరము లేనప్పుడే కత్తి పట్టవలయును గాని మాటమాటకును మహారణమేనా? జనక్షయకా రణమగుసమరతంత్రము కట్టకడపటిది గాని మొట్టమొదటిది గాదు. వారు పెద్దలు. వారియాజ్ఞల నిర్వహింపవలయును. పిన్నవారు పెద్దల త్రోవ ననుసరింపవలసినవారే గాని వారి కాలోచనలు చెప్పుట కర్హులు గారు." అని మందలించెను.

బాల—పెద్దలే కానిండు, పిన్నలే కానిండు! ఎంతవఱకీయా లోచనలు? చావఁగొట్ట సిద్ధముగ నున్నప్పుడుగూడ సాంత్వనాలాప ము లేనా?

అనుచుండఁగా బాలచంద్రునిసోదరులలో నొకఁడగు మంగలి మల్లు శివమెత్తినవానివలె వికృతమూర్తియై వగర్చుకొనుచుఁ బరుగెత్తు కొనివచ్చి యాసభామధ్యమునఁ బ్రవేశించెను. ఆతనిదుస్తు లన్నియు ను స్వేదసిక్తము లైపోయెను. హృదయావేగముచే నాతనిపెదవు లదరిపోవుచుండెను. ఆతనిచూపులనుండి యగ్నిస్ఫులింగములు వెలు వడుచుండెను సభలోనివారందఱు నాశ్చర్యముతో నాతనివంకఁ జూచుచుండిరి. అప్పుడు బ్రహ్మనాయఁడు ప్రశాంతగంభీరస్వరము తోఁ "కుమారా! ఏమి యట్లున్నావు. ఇట్లింతిగాఁ బరుగెత్తుకొని

బాల — ఒక వేళ నం దెవ్వరైన నూహింపఁగలిగినను, అది వారు పైకనుకొనఁదగినవిషయము గాదు.

బ్రహ్మ — బాలుఁ డిక్కడనుండియే యాతయు దెలిసికొన్న వానివలె మాటాడుచున్నాఁడే !

బాల — నాయనగారూ ! తెలిసికొనుటకు నూహించుకొనుటకు నిందెఱుఁగని దేమున్నది? అంతయు బహిరంగరహస్యమే గాదా? నాగమ్మతల్లి నాయకురాలై యుండఁగా నరసింహరాజుగారి త్రోవలో నలుసంతకంటకమునైనను నిలువనిచ్చునా?

ఆమాట విన్నంతనే కొమ్మరాజు గోలుగోలున నేడ్చుచు "కుమారా! నీవు బాలుఁడవైనను బాగుగా నూహింపఁగలిగితివి. నామనసును నీమాటయు నొక్కచోటను గలిసికొన్నవి. ఇది నిజముగా నాయకురాలిఘోరకృత్యమే" అనియెను.

అంతవఱకును విచారావిష్టమై యున్నసభయంతయు నప్పుడు క్రోధకంపితమైపోయెను. బ్రహ్మనాయఁ డప్పుడొక దీర్ఘశ్వాసమును విడిచి "ఇదియును నాయకురాలితంత్రమేనా?" అనియెను.

బాలచంద్రుఁ డామాట విని బాలసర్పమువలె రోజుచు "కలి గోసినను గూడ మీరింకను నుట్టివంకనే చూచుచున్నారు గాని నాయకురా లప్పుడే సర్వవిషయములను నిశ్చయించుకొనియే పనులు సాగించుచున్నది." అనియెను.

అప్పుడు గండు కన్నమనాయఁడు మెల్లగాఁ దనలోఁ దానే "అన్నెము పున్నెము నెఱుంగని యలరాజును జంపుటవలన నరసింహునకుఁగాని, నాగమ్మకుఁగాని యేమిలాభము గలుగును?" అనుకొనియెను.

బాల—ఏమిలాభమా? సకలసేనాసహితముగా మలిదేవ రాజును మహారణమున మర్దించివైచినను నలగామరాజునకుఁ బల నాటిరాజ్యసింహాసనము తప్పదుగదా! అలరాజు జీవించియున్నంత వఱకు నలగామరాజు ననంతరమందైనను నరసింహరాజున కాసింహాస నము దక్కదు గదా! నాయకురాలి దియాలోచించియే నలగామ రాజు ననంతరమున నిష్కంటకమైయున్న పలనాటిరాజ్యమునందు నరసింహునికిఁ బట్టము గట్టవలయు నని యలరాజకంటకము నిప్పుడే తొలఁగించివైచినది. ఇప్పుడైన నీక్రూరహత్యకుఁ గారణమే మో తెలిసినదా?

కొమ్మ—ఔనునాయనా! నీవన్నమాట నిశ్చయమే. గుణ నిధానుఁడగునాకుమారునిఁ జంపుట కింతకంటె వేఱుకారణ మేమి యును లేదు. ఇంతపుట్టు నని యెఱిఁగియుండియుఁ గుమారుని మృ త్యుముఖమునకు నేనేపంపుకొన్నాను.

బాల—చేతులు కాలినతరువాత నాకులు పట్టుకొనుటవలన నేమిప్రయోజనము? ఇప్పటికైనను మలిదేవరాజుగారికిని, మానాయన గారికిని శత్రువులదుష్కృత్యములకుఁ బ్రతీకారము గావింపవలయు ననుసాహసము గలుగుచున్నదా? ఇంకను సంధితంత్రములనే చదువు కొనుచుందురా?

అని బాలచంద్రుఁ డుగ్గడించినంతనే సభలోనివారందఱు నేక వాక్యముగా "ఇఁక నెంతమాత్రమును సంధి లేదు. సర్వనాశముగావిం చిన శత్రువులతో సంధి యెన్నఁటికిని బొసఁగదు. యుద్ధమే యవశ్య కర్తవ్యము. విజయమైనను, వీరస్వర్గమైనను మహారణమునకే మనము సిద్ధపడి యుండవలయును" అని దృఢనిశ్చయముతోఁ బలుకఁ దొడఁగిరి.

అప్పుడు బ్రహ్మనాయఁడు "సభాసదులారా! ఇంతవఱకు వచ్చినతరువాత నింకొకమార్గమేమున్నది? సంధి సర్వజనసమ్మతమైనది గావున నది జరుగునేమో యని యింతవఱకు నాలోచించితిమి గాని మనమందఱము నిదివఱకే సమరసన్నద్ధులమై యుంటిమిగాదా!" అనియెను.

బాల—సన్నద్ధులమే యైయుంటిమి గాని సాహస మింకను పుట్టుట లేదు. వారెప్పుడు నొక్కలాగుననే ప్రవర్తించుచున్నారు. ఎప్పటి కప్పుడు మనమే వారిమాయలలోఁ బడిపోవుచున్నాము. ఒక వంక సంధిమంత్రములు చదువుచు వారెప్పుడును మఱియొకవంక గూఢతంత్రములు పన్నుచునే యున్నారు.

బ్రహ్మ—బ్రహ్మనాయఁడు మనమందఱము నెంతప్రతిఘటించినను పట్టు విడువక మలిదేవరాజునకు మాచర్లసీమ నిప్పించెనుగదా యను క్రోధముచే నాయకురాలు నలగామునవంతరమున నరసింహరాజును బల్నాటిసీమకుఁ బట్టము గట్టవలయు నని పంతముపట్టి ప్రయత్నించుచున్నది కాఁబోలును!

బాలు—గొడ్డునకు లేనిదురద గుంజ కెందులకు? నరసింహరాజుకోరిక లేనిదే నాయకురాలూరక తానేల ప్రయత్నించును?

ఆమాట విని మలిదేవరాజు "బాలచంద్రుఁడు బాలుఁడైనను నాతనియూహ యుక్తియుక్తముగా నగపడుచున్నది. నరసింగన్న ప్రోత్సాహముచేతనే నాయకురాలిట్టి క్రూరకృత్యమునకుఁ బూనుకొని యుండును" అనియెను.

"నిశ్చయము! అదియే నిశ్చయము" అని సభయంతయు నేకకంఠముతోఁ బ్రతిధ్వనించెను. అప్పుడు మంగలిమల్లు బిగ్గరగా "నిశ్చయము గాకేమి? రాజకుమారియగు రత్నాలకేరమ్మ దుఃఖా

వేశముతో నాత్మహత్య గావించుకొనునప్పుడు నాయకురాలినిగూడ నొక్కసారి స్మరించి యామె నాశీర్వదించి మఱిపోయినదఁట ! అది యంతయును గప్పిపుచ్చుటకే యామాయలమల్లి యను నాగమ్మతల్లి “ యుద్ధవిజయానంతరమునఁ బల్నాటిరాజ్యమంతయును మలిదేవునకే కట్టిపెట్టవలయు ననుదురుద్దేశముతో నందుల కడ్డముగానున్న యల రాజు నిప్పుడే బ్రహ్మనాయఁ డీరీతిగాఁ జంపించి యుండునను ప్రవాదమును దనశిబిరమంతటను వ్యాపింపఁజేసినది ! ” అనియెను.

ఆమాటలు విని సభవా రందఱు నద్భుతాక్రాంతహృదయులైపోయిరి. బ్రహ్మనాయఁడు సటలువెఱికినసింగమువలెఁ గ్రోధకంపితగాత్రుఁడై, కన్నులనుండి నిప్పు లొలికించుచు “ ఆఁ ! ఎంతమోసము! ఎంతదౌర్జన్యము ! పాప మెప్పటికైనఁ బ్రద్దలు గాక మానునా ? ఆఁడుది నాయకురాలై యాడుచున్నప్పు డిట్టియకాలప్రళయసంఘటనముల కంతమేముండును. కొమ్మరాజా ! నీకుమారునిమరణమునకు నేనే మూలకారణుఁడ నైతిని. నాయకురాలి మాయలోఁ బడి కాలమంతయును వ్యర్థముగాఁ గడపివైచితిని. లఁచుకొన్నప్పుడే దండోపాయమును బ్రయోగించినచో నింతముప్పు వాటిల్లకుండునుగదా ! ఈపాటికి విజయమో వీరస్వర్గమో లభించియే యుండును. ఇట్టి యపవాదములు వినఁబడకయే యుండును. ఓప్రత్యక్షరాక్షసీ ! పరమవైష్ణవుఁడనై, పరమార్థమునే ప్రధానముగఁ జేసికొని ప్రజాక్షోభము కలుగకుండఁ జేయవలయు నని పౌరుషమునుగూడ నడంచుకొని ప్రవర్తించుచున్న బ్రహ్మనాయనిపైఁ బాపకళంకము నారోపింపఁ జూచుచున్నావా ? నీలోపలియుద్దేశ మేమైయున్నను దానిని లోకము విశ్వసింపవలదా ! చండాలురాలా ! పల్నాటిప్రభువుల వంశవృక్షమును బ్రహ్మరాక్షసివలె నాశ్రయించి ప్రబలసంక్షోభమును గల్పించుచున్నావు.

ఛీఛీ! నీచురాలా! నీపొత్తున నిలిచియున్నంతవఱకు నలగామరా జుతో మలిదేవరాజునకు సంధిసమ్మేళనములు లేవు—ముమ్మాటి కిని—"

అనుచుండఁగనే బాలచంద్రుఁ డామాటలకడ్డము వచ్చి "అంతమాత్రము చాలదు! అకలంకచరిత్రుఁడగు నలరాజుతలకు మాఱుగా నరసింహరాజుతలనఱికి తెచ్చి కొమ్మరాజుపాదముల చెంతఁ బ్రణామపూర్వకముగాఁ బడవైచి ప్రార్థించునంతవఱకును శత్రువులతో నెట్టిసంబంధములును లేవు! ముమ్మాటికిని లేవు" అని వీరావేశముతో గర్జించి పలికెను.

"బాలచంద్రా! పౌరుషగుణాభరణుం డగు బ్రహ్మనాయుని పట్టివై పుట్టినందులకుఁ బ్రజలు మెచ్చుకొనఁదగినపలుకులు పలికితివి. భళీ! నిన్నుఁ దనయునిగాఁ బడయఁగలిగిన బ్రహ్మనాయఁడు ధన్యుఁడు! నీపక్షమును వహించి చావుబ్రదుకులకు జంకక సమరరంగమున జయకీర్తులం గాంచఁగల పల్నాటివీరు లెల్లరును ధన్యులు!" అను వీరాలాపములతో సభయంతయును మాఱుమ్రోగుచుండెను.

అప్పుడు కొమ్మరాజు కుమారమరణదుఃఖమునంతను నడంచుకొని లేచి నిలువఁబడి "సభ్యులారా! వీరశిరోమణులారా! బాలచంద్రునిపలుకులు పౌరుషవంతులగువారికెల్లరకును బరమాదరణీయములే యగును. కాని కేవలము గయ్యాళులుగసిచే కార్యాచరణమునకుఁ గడంగుట యుచితము గాదు. సాధకబాధకముల నెఱింగిన పెద్దలయుద్దేశముల ననుసరించి పోవుట ధర్మము. బాలచంద్రుఁడు రణప్రౌఢుఁడే గాని రాజనీతిజ్ఞుఁడు గాఁడు. భయసంశయములు లేనిబాలుఁడు గావునఁ బట్టినపట్టు విడువఁజాలఁడు. రాజకార్యనిర్వాహణమునకు దూరదృష్టి యు నవలయును. తొందరపడి యేమి చేసినను విషమిం

పగ మానదు. కొడుకును జంపినపగ దీర్చుకొనవలయు నను క్రోధము మీయందఱకంటెను నాకధికముగనే యుండునుగాదా! అట్టి నేను క్రోధశోకానలములను జల్లార్చుకొని చెప్పుచున్నాను. పెద్దలు కార్యనిశ్చయము నెఱింగించునంతవఱకును వేచియుండవలయు నని ప్రార్థించుచున్నాను" అనియెను.

ఆమాటలు విని బాలచంద్రుఁడు మండిపడుచు "ఇంకను వేచి యుండవలయునా? కొమ్మరాజా! నీవింకను వేచియుండవలయు నని. వీరులకందఱకును విన్నపము చేయుచున్నావా! జగదేకవీరుఁడ వని నీ ప్రఖ్యాతి జగమంతటను వ్యాపించి యున్నదే. అట్టి నీవు ప్రాణములతో నుండఁగనే భయ మించుకంతయును లేకుండఁ బగవారు నీపట్టినిబట్టి బలవంతముగఁ జంపివైచిరే! ఇంకను నీకుఁ బౌరుషము కలుగుట లేదా? నీలోని శౌర్య మంతయును జచ్చిపోయినదా యేమి? ముక్కుపై గుద్దినప్పుడుగూడ మోహరింపఁజాలనియీపౌరుష మింకను నెప్పటికి? తలయెగురఁగొట్టుచున్నప్పుడుగూడ నింకను ధర్మసందేహము లేనా? పిడుగుపాటువంటి కొడుకుచావుకబురు వినియు నిట్లు పలుకుటకు నీగుండె లెట్లు తాళినవి! ఓవీరశేఖరులారా! కాసెలుగట్టి కత్తులుపట్టి కదనరంగమునకుఁ గదలి వచ్చితిరిగదా! నాఁటికిని నేఁటికిని నడుమ మూఁడునెలలు దాఁటిపోయినవి. ఇంకను బగ దీర్చుకొనలేని మీపౌరుషము లేనాఁటికి? ఓమామా! గండు గన్నమనాయఁడు గండరగండఁడను పేరు మోచి యుంటివిగదా! నీవు కట్టినకయ్యపుఁ గంబ మీపాటికి చెదలుపట్టి చెడిపోకుండ నుండు ననుకొన్నావా? ఓస్వామిభక్తులగుజంగిలిసైనికులారా! మీచుట్టుకైదువులకు త్రుప్పులు పట్టినవి. ఇఁక నైనను దులుపుకొనవలయునని తోఁచుట లేదా? వలిదేవరాజుమన్ననలం గాంచి మాచర్లపేరు నిలిపిన [illegible]

లారా! మీబిరుదు లేమైనవి? మీరెక్కడ దాగియున్నారు! పరాభ
వదుఃఖము ననుభవించుచు నిట్లు బడలినిద్రించుటయే పౌరుష మను
కొనుచున్నారా! లెండు. లెండు! బాలసూర్యోదయమైనది. ఆప్రి
కాశముతో మీప్రతాపమును విజృంభింపఁజేయుఁడు! తండ్రీ! నీ
కింకను ధర్మసందేహము తీఱలేదా? మహారాజా! మీకింకను మా
యామోహమేనా? అలరాజును శత్రువు లకారణముగఁ జంపించి
రను ఘోరవార్త వినియును గొమ్మరా జేడ్చుటకంటె నేమియుం జేయఁ
జాలక యూరకుండెను గాని పోటుమగలకందఱకును మేటినాయకు
లైన మీకైనను బ్రతీకారము చేయవలయు ననుపౌరుషము గలుగుట
లేదా! క్రోధశోకావేశముచే మీపెద్దతనమును బాటింపక మాటా
డుచున్నందులకు మన్నింపుఁడు. మీరేమనుకొన్నను సరియే—ఈపరా
భవములను—ఈక్రూరకృత్యములను——ఈఘోరమారణతంత్రములను
——నేనెంతమాత్రమును సహింపఁజాలను. ఓమార్తాండసమతేజా!
మలిదేవరాజా! బలవిక్రమనిధానా! బ్రహ్మాభిధానా! ఇదిగో వినుండు!
ప్రభువులును, దండ్రులును, ప్రతాపనిధు లగుయోధులును నిండియు
న్నయీసభలో నిలువఁబడి కరవాలమును గరమునఁ గీలించి ప్రతిజ్ఞ
చేసి చెప్పుచున్నాను. తొల్లి పద్మవ్యూహమును భేదించి ప్రతాపమా
ర్తాండుఁడై విజృంభించినపార్థనందనునిం బోలి పరబలంబులఁ జించు
కొనిపోయి శరవహ్నిచే శత్రుసేనాకాననమును భస్మీభూతముగఁ జేసి
వైచి యిరుతెగలవారును నిర్వోఱపడి నిశ్చేష్టులై చూచుచుండ రణ
రంగమున నరసింహు నెదిరించి యొక్కటికయ్యంబున నాతనిశిరంబును
నాయీకఱకుకరవాలంబున కెరచేసి తెచ్చి యీసభారంగంబున మ
హారాజపాదపీఠముచెంత మానధనుండగుమాతండ్రి చూచుచుండఁ
బడవైచి కొడుకుచావునకై యేడ్చుచున్న కొమ్మరాజు పగదీర్చి, నాస్వామి

ఋణమును, పితృఋణమును, గురుఋణంబును దీర్చుకొందును. ఈ నాప్రతిజ్ఞ చెల్లించుకొనఁజాలనైతినేని నేను బాలచంద్రుఁడను గాను-పరబలగజసింహుఁ డగు బ్రహ్మనాయకుని పట్టిని గాను—అకలంకచరిత్ర యగునైతాంబనందనుఁడను గాను" అని దృఢనిశ్చయుఁడై పలికెను.

సభయంతయు నివ్వెఱపడిపోయెను. ఎవ్వరు నేమియు మాటాడఁజాలకపోయిరి. అప్పుడు బ్రహ్మనాయఁడు నిట్టూర్పువిడిచి చటాలున లేచి పోయి బాలచంద్రునిఁ గౌఁగిలించుకొని తెచ్చి తనయర్ధాసనమునఁ గూర్చుండఁబెట్టికొని "కుమారా! ఎంతమాటయంటివి? చిన్నతనపుఁ గోపముచేఁ జిత్తము చెదరి యిట్లంటివి గాని మనకు నరసింహరాజుమాత్రము మలిదేవరాజువంటివాఁడు కాఁడా? రాజ్యములు నిలుపవలయును గాని రాజకుటుంబవినాశమునకుఁ బూనుకొనుట సాహసము గాదా? నాబిడ్డవైననీకట్టిపౌరుషము సహజముగనే యున్నది. నాయనా! తొందరపడకుము! శాంతింపుము! అని బుజ్జగించెను.

బ్రహ్మనాయని ప్రశాంతవాక్యములు బాలచంద్రునిచెవులకు ములుకులవలె నుండెను. అతఁడు క్రోధకంపితస్వరముతో "నాయనగారూ! మేరుభూధరము దూదికంటెను మెత్తనైపోయినప్పుడు—వీతిహోత్రజ్వాల మంచుకంటెను శీతలమైపోయినప్పుడు—ఇఁకఁ జేయునదేమున్నది! ఏమైనను సరే—బ్రహ్మన్నపట్టి యగుబాలచంద్రుఁడు ప్రాణములనైనను విడుచును గాని ప్రతిజ్ఞాభంగమునకుఁ బాల్పడఁజాలఁడు!" అనియెను.

అప్పుడు కొమ్మరాజు లేచి బాలచంద్రుని చెంతకుం బోయి యాతనికరంబు దనకరంబునఁ గీల్కొల్పి మృదుమధురస్వరముతో "కుమారా! మనయిరువురకును సంధి సేయఁగోరి రాయబారియై

పోయి శత్రువులచేతులలోఁ బడి ప్రాణములు విడిచిన యులవాజే బాలచంద్రుఁడు. భండనభీముఁడవై పగనడంగించి పితృఋణముం దీర్పఁ బ్రయత్నించుచు బ్రదికియున్న బాలచంద్రుఁడవగు నీవే నాకలరా జవు. నీవే నాబిడ్డవు. నిన్నుఁ జూచుకొనియే పుత్రమరణదుఃఖమును మఱచిపోయితిని. నాయనా! ఒక్కమాట చెప్పెదను వినుము! చెప్పుట యెందులకు? కొంచె మాలోచించుకొన్నచో నీకుమాత్రము తెలియదా? కుమారా! వెనుకముందాలోచింపక వీరావేశముచేఁ బ్రతిజ్ఞ చేయుట యుచితముగాదు. పరాక్రమాఢ్యుండ వగునీపలుకులు చారులవలన విని శత్రువులు సమరవిముఖులై పిఱికిపందలై నీశరణంబు గోరివచ్చినచో నీవప్పు డేమి చేయఁగలవు? శరణార్థులను జంపుటకంటెను మహాపాపము మఱియేదైన నున్నదా? సమరమే నిశ్చయ మైనప్పుడు నీయిష్టము వచ్చినట్లు వీరవిహారము గావింపవచ్చును. శాత్రవమే వదలిపోయినప్పుడు సమరమున కవకాశ మేదుండును? అందుచేతనే పెద్దలయుద్దేశము ననుసరింపవలయు నని బోధించితిని. కాని నీవు చిన్నతనముచేఁ దొందరపడి మాట వెలువరించితివి. ఐననేమి! ఇప్పుడు వచ్చిన ప్రతిబాధక మేమియును లేదు. శౌర్యమును జిక్కఁబట్టి సమయము వచ్చువఱకును శాంతించి యుండుము" అని బ్రతిమాలుకొనియెను.

బాలచంద్రుఁడు మఱియేమియును మాటాడలేదు.

---



"మహారాజా! మహాభార మంతయును దలపైఁ బెట్టుకొని యున్న మీ రీవిధముగా నూరక విచారించుచుండుటవలన నేమి ప్రయోజనము" అని నాయకురాలు నలగామరాజును బ్రబోధించుచుండెను.

నలగామరాజు నిట్టూర్పు విడిచి శోకకంపితస్వరముతో "ఈ నాజీవితమున కింక విచారము గాక యేమున్నది? అల్లుఁ డట్లు హతుఁడయ్యెను. ఏకపుత్రిక యిట్లు మరణించెను. ఏమి చూచుకొని యూఱడిల్లఁగలను?" అనియెను.

నాయ—జననమరణములును, సుఖదుఃఖములును సకలజీవులకునుగూడ సహజములే. కాలకారణవశంబునఁ గలుగుచుండు నట్టివాని కై ప్రాజ్ఞులగువారు విచారించుట తగదు. పుత్రికయు నల్లుఁడును మాత్రమే పోయిరి గాని భూభారమంతయును మీభుజములమీఁదనే యున్నది గాదా?

నల—బలవంతముగా నీవిదియంతయును పైని బెట్టుచున్నావు గాని యింక నిదిమాత్ర మెందులకు? శోకశోషితహృదయుఁడ నగు నేనేమిచేయఁగలను?

నాయ—చేయఁజాల నని తప్పించుకొనినఁ దప్పునా? సర్వవిధములఁ బ్రయత్నించి, సర్వశస్త్రములను వినియోగించి స్వధర్మమును నిర్వహించితీరవలయును.

నల—నాకీకష్టమంతయు నెందులకు? నన్నెందులకు మరల నీరణరంగమునకుఁ గొని తెచ్చితివి? నేనింకను నేల యుద్ధము చేయవలయును? ఉన్నవారినిఁగూడ నేల చంపుకొనవలయును?

నాయ—రాజధర్మముకొఱకు—ప్రజాపాలనముకొఱకు—రాజ్య
రక్షణముకొఱకు—

నల—నాయేకపుత్రిక యీలోకమునే విడిచిపోయినతరువాత
నింకను నేనెవ్వరికొఱకీరాజ్యమును సంరక్షింపవలయును ?

నాయ—అదేమిమహారాజా ! సకలధర్మవిదులగుమీరే యిట్లు
సెలవిచ్చినచో నేనేమని మనవి చేయఁగలను ?

నల—నిజముగా నీవే చెప్పుము ! నేనీరాజ్యమును సంపాదించి
యేమి చేసికొందును ?

నాయ—మీరు పొరఁబడుచున్నారు. రాజ్యమును నిలుపుకొ
నుట ధర్మపాలనముకొఱకుఁగాని దాయాదులకుఁ బంచియిచ్చుటకుఁ
గాదు. ఈధర్మము మీకు నేను దెలుపవలయునా ?

నల—(విసుఁగుతో) అట్లయినచో నీయాశలన్నియు నెందు
లకు ? మనకున్నదానిలో మనము తృప్తిఁ బొంది మాచర్లసీమ నెప్ప
టివలె మలిదేవరాజున కిచ్చివైచి మిగిలినవారమైనను సుఖముగా జీవిం
తము. సమరము సాగించి వృథాజనక్షోభము గలిగించుట నాకిష్టము
లేదు.

నాయ—ఆపని యిదివఱకే చేయఁదలంచితిమిగాదా ! అప్రియ
స్వప్నమున కలరాజామరణమే యంతరాయమైనది. ఇక నట్టిసామోపా
యము చక్కఁబడు నని తోఁచుట లేదు.

నల—అదియేమి? వారు సంధికి సమ్మతిని సూచించి కొలఁది
దినములలోఁ గొమ్మరాజును బంపునట్లభిప్రాయ మిచ్చియుండిరి
గాదా?

నాయ—అప్పటివారియుద్దేశ మంతే—ఇప్పు డంతయును మా

జేపోయినది. మననరసింహరాజుగారితల నఱకి యొప్పగించినఁగాని శత్రువులతో నిఁక సంధిమాటలు లేవని బ్రహ్మనాయనిపక్షమువారందఱును బట్టుపట్టుకొని యున్నారు.

నలగామరాజదరిపడి "ఏమది? నాతోడిసంధికిని, నరసింహుని తలకును సంబంధ మేమున్నది? ఈయున్మత్తప్రలాపముల కర్థమేమో నాకు బోధపడుట లేదు" అనియెను.

నాయ—మహారాజా! మనసుంచి యాకర్ణింపవలయును. వారి కలరాజుగారిప్రాణములకు బదులుగా నరసింహరాజుగారిప్రాణములు గావలయునఁట!

నల—(కోపముతో) అలాగా? వారి కంతధైర్యమున్నచో—అంతసాహసమున్నచో—అంతశక్తియున్నచో—అన్నిఁటికిని గారణుఁడనైయున్ననాతల నఱుగవలయును గాని నడుమ నరసింగన్నతల యెందులకు?

నాయ—బ్రదికియున్నంతవఱకు మలిదేవరాజునకును, మనకును బంధుభావము గలుగకుండఁ జేయుటకై పాపవర్తనుఁడగుబ్రహ్మనాయఁడు పన్నినపన్నాగ మదియే. అతఁడు బహిరంగముగా బ్రహ్మహత్య చేయుటకైనను వెనుదీయువాఁడు గాఁడు!

నల—నిజమే—నాతండ్రికిని నాకునుగూడ మంత్రియై నాయకత్వముచేఁ బేరును, బెంపునుగాంచినయాతఁడు తుదకు నన్ను మోసము చేసి స్వామిద్రోహము గావింపలేదా? మరల నిప్పుడు సంధి జరుగకుండుట కేమిమంత్రాంగము చేసినాఁడు ?

నాయ—అతఁడు చేసినక్రూరకృత్యము చెప్పుటకుఁగూడ నోరు రాకున్నది. మీయనంతరమున మీయేకపుత్రిక కేమియును లేకుండఁ

జేసి యీమహీరాజ్యమునకంతకును మలిదేవరాజును బట్టాభిషిక్తునిగాఁ జేయవలయునని సంకల్పించి యాతఁడే మనఅలరాజును రహస్యముగా విషప్రయోగము చేయించి చంపించినాఁడని ప్రజలందఱు ననుకొను చున్నపరివాదము మీకు విశ్వసనీయముగా నున్నదా?

నల—లేకేమి? వాఁడెట్టిద్రోహము చేయుటకైనను వెనుకదీయు వాఁడు గాఁడు.

నాయ—తానట్లింతటిదారుణకృత్యమును గావించి తనశత్రుమువా రందఱును విశ్వసించునట్లుగా నాపాపకళంకమంతయును నాతలకుఁ దగిలించినాఁడు.

నల—ఎంతమాట! అలరాజును విషము చంపియుండునని యచ్చటి వారిలోఁగాని, యిచ్చటివారిలోఁ గాని యెట్టియజ్ఞానికైనను ననుమానము గలుగదే.

నాయ—కారణమును గల్పించినప్పుడు కలుగ కేమి? ఆతఁడు మలిదేవరాజునకు మాచర్లసిప్పించినట్లు నేనును మీయనంతరమందు నరసింహరాజును మీగద్దె నెక్కించుటకై యాతనికోరికమీఁదనే యిట్టితంత్రము పన్నితి నని తనతనయునిచేఁ దనపక్షమువారి కందఱకును నచ్చఁజెప్పించినాఁడు.

నల—ఎంతమోసము! ఎంతద్రోహము! నరసింహునకు రాజ్యకాంక్షయే లేదే! ఉన్నచో వెనుకమలిదేవునకు మాచర్లసీమ నీయఁదలఁచినప్పుడు మాటవరుసకుఁ దమభాగములను గూర్చి తలపింపఁగా పలనాటికంతకును నిష్ఛభిషిక్తునిం గావింతునని నరసింహరాజుతో నేనప్పుడే చెప్పితినే! అంగీకరించినాఁడా? అట్టివాఁడు తనకూఁతురు భిక్ష యగు పేరమ్మకుఁ జేతులార వైధవ్యముం గల్పించుటకుఁ బూను

కొనునా ? కన్నతండ్రికంటెను గారాబముగా నాతఁడామెద్దుబిడ్డను లాలించుచుండువాఁడే. అట్టియల్లుఁడును, కూతురునుగూడ నిట్లయి పోయిరని యాఁదుఃఖకంటె నధికముగా నాతఁడే యేడ్చుచున్నాఁడు. ఈవిషమవార్త చెప్పువారు చెప్పఁగలిగినను వినువారుమాత్ర మెట్లు విశ్వసింపఁగలరు ?

నాయ—ఈమంచిచెడ్డ లన్నియు నెవరికిఁ గావలయును? సంధి కుదురకుండఁ జేయువలయు ననునాతనిసంకల్ప మీవిధముగా ఫలించి నది. సంగతులన్నియును సకారణములుగా నుండుటచే నాయకులకం దఱకును నమ్మకము గలిగినది. అందుచేతనే అలరాజునకు బదులుగా నరసింహరాజుతల గావలయు ననియు, నట్లు జరుగకున్నచో యుద్ధము తప్పదనియు వారందఱును దృఢనిశ్చయులై యున్నారు.

నల—(క్రోధావేశముతో) అలాగా? వారేయంతటివీరులై తల కుఁదగనికోరికలం గోరుచు సంధికంగీకరింపక యయ్యమునకుఁ గాలు ద్రొక్కుచున్నప్పుడు చేతులు జోడించుకొని ప్రార్థించుటకు మనమే నా చేఁతగాని భీరులము! కానిమ్ము! సమరమే సాగనిమ్ము! ఎంతపొ గరు! ఎదిరిని దమ్ము నెఱుంగక యెంతసాహసించుచున్నారు! నరసిం హరాజుతల నలగామరాజు సమర్పించినఁగాని సంధి జరుగదా ? ఎంత? పట్టుదల !

నాయ—వారికండకావర మట్లున్నది! ఇంతకును వారిబలమెంత మనసేనకును వారిసేనకును బాధోపధికిని బల్వలమునకును గలయంత యంతరమున్నది. అందు ప్రధానులగుయోధు లఱువదిమైదుగురికం టె నధికముగా లేరు. అందుఁ జాలమంది బాలురే. తక్కినవారంద ఱు నల్లరిమూకలే. ఇట్టిబలముతో నింతసాహసమునకుఁ బూనుకొని

యున్నారు. ఆ బ్రహ్మన్నకొడుకు బాలచంద్రుఁడనువాఁ డున్నాఁడు. అతనిపరాక్రమదర్పగర్వమున కవధియే లేదు. మననరసింహరాజు తల నరకి తీసికొనిపోయి నాయని పాదములచెంతనివేసెంతునని పంతము పట్టినాఁడఁట!

నల—ఏమీ! ఎంతకండకావరము! వానికిఁ దండ్రికంటె నురుదల బిరుసుతన మున్నట్లున్నదే! నరసింహరాజును నరకుటయే నా? పిట్ట కొంచెమైనను కూత ఘనముగనే యున్నది. ప్రతిజ్ఞలును, పంతము లునుగూడ జరిగినతరువాత వారు యుద్ధమునే నిశ్చయించుకొని రని యనుకొనవచ్చును.

నాయ—ఇంకను సంశయ మేమున్నది? మనముగూడ సర్వస న్నద్ధులమై సమయము నిరీక్షించుచుండవలయును. వారిబల మల్పమే గదా యని మన మేమఱి యుండరాదు. చిన్నపామునైనను పెద్దకఱ్ఱ తోనే కొట్టవలయును. వారిలో బాలుఁడు మొదలు ప్రధాననాయకుల వఱకు నందఱును సమరమునకు సాహసించుచుండుటచేఁ బ్రాణముల కు తెగించి పైఁబడఁ దలంచియున్నట్లు స్పష్ట మగుచున్నది. జయించి నచోఁ బల్నాఁడంతయుఁ బాలింపవచ్చు ననియుఁ జచ్చినచో వీరస్వర్గ ముం గాంచవచ్చు ననియు నందఱును నిశ్చయించుకొని యుందురు. కోడిపందెమునాఁటి పేరాసయే వారి నిప్పటికిని బాధించుచున్నది. దురాశ దుఃఖమునకే యని వారొకసారి యనుభవించియుఁ గూడఁ గ్రహింపఁజాలకున్నారు.

నల—పోనిమ్ము! ఆమొగసిపాటునకు ఫలము వారే యనుభవిం చెదరు. వెనుకముందరయక విజృంభించుచుండు వారాకస్మికముగ నెప్పుడు వచ్చి పైఁబడుదురో యెవ్వరెఱుఁగఁగలరు? మనసకలసేన

లను సమరసన్నద్ధములుగాఁ జేయవలయు నని నరసింహరాజుతో నా వాక్యములుగాఁ దెలియఁజేయుము! నీవెల్లవిషయములందు నేమఱకుం డ సర్వకార్యములను సహస్రనయనములతోఁ జూచుకొనుచుండ వలయును.

నాయకురాలు (తనలో) అమ్మయ్యా! అయ్యగారి కిప్పటికిఁ బౌరుషము తలకెక్కినది. నాప్రయత్నము ఫలించినది" అని యను కొని ప్రకాశముగా "మహారాజా! ఏలినవారియాజ్ఞానుసార మెల్ల కార్యములను గావించెదను. పాపము నరసింహరాజుగా రకారణము గాఁ దమపైఁ బడినయపవాదమునకై మిగుల విచారించుచున్నారు. అందుచేతనే తమదర్శనమునకు రాఁజాలక తలవంచుకొని తనయకొఱ కును,లోకాపవాదముకొఱకునుమిగులవిచారించుచున్నారు." అని మెను

నల—ఎందుల కావెఱ్ఱి! జాగిలములు మొరగినంతమాత్రమున సామజమునకు సంశయమెందులకు? శత్రువుల యపవాదములకే జంకి నచో శరపరంపరల నెదిరించుట యెట్లు?

నాయ—మహారాజా! నరసింహరాజుగారి బలపౌరుషములను గూర్చి మీ రెఱుఁగనిదేమున్నది? ఆయన శత్రువాదములను సరకు సేయుట లేదు. అపవాదమువలన మీమనసున కెట్టికష్టముగలుగునో యని సంశయించుచున్నారు. అందుచేతనే ఆయనమనసంతయు వికల మైపోయినది. సర్వసేనాధ్యక్షుఁడై సమరముఖంబున నిలువవలసిన యావీరయోధునకు మీసాంత్వనాలాపములవలనఁగాని మనశ్శాంతి గలుగదు.

నల—అట్లయినచో నేనే వచ్చి తమ్ముని సంశయము లన్నిటిని దీర్చివైచెదను. అతఁ డెచ్చటనున్నాఁడు? ఇచ్చటికి వచ్చినాఁడా?

నాయ—వచ్చియే యున్నారు. ఏ మొగముపెట్టుకొని మిమ్ముఁ జూడఁగలనని విచారించుచు నీ ప్రక్కనున్న పటకుటీరమునందే యున్నారు.

నల—అట్లయినచోఁ బోయివత్తము రమ్ము.

నాయకురాలికి హృదయవికారమును, శిరోభారమునుగూడ వదలిపోయెను. ఆమె యొక్క నిట్టూర్పు విడిచి మహారాజును నరసింహారాజుగుడారమునకుఁ దీసికొనిపోయెను.



## పదునాలవ ప్రకరణము.



పున్నమవెన్నెల భువనకోశమునంతను బుచ్చపువ్వువలె వికసింపఁజేయుచుఁ బూర్ణకళలతో విరాజిల్లుచుండెను. ఉభయపక్షముల వారును యుద్ధనిశ్చితులై రాత్రియంతయును నిద్రమానుకొని సర్వప్రయత్నములను చక్కఁబెట్టుకొనుచుండిరి. ఉభయబలంబులయందును నుత్సాహము వర్ధిల్లిపోవుచుండెను. రేపటిరణరంగవిధానములం గూర్చి జాగ్రత్స్వప్నములం గాంచుచు విజయాకాంక్షులగు యోధులెల్లరును బరస్పరమును వీరాలాపములాడుకొనుచు సత్వరముగా సమరసన్నద్ధు లగుచుండిరి. వారియుత్సాహములకును, వారియాత్మనిశ్చయములకును, వారిప్రతిజ్ఞావచనములకును సాక్షిభూతుఁడై చంద్రభగవానుఁడు చల్లఁగా జరగిపోవుచుండెను.

అర్ధరాత్రియైనది. ఉభయపక్షశిబిరములందును మూఁడవజామునగారాలు మ్రోగుచుండెను. రాకాసుధాకరుసిరతనాలరథము పూర్వరంగమును వదలి పశ్చిమరంగమునం దప్పుడే ప్రవేశించుచుండెను. ఆసమయమునందు బాలచంద్రుఁడు భండనోత్కంఠుఁడై నలగొండశిఖరము నధిరోహించి నలుదెసలను నిండి మహాసముద్రములవలె ఘోషించుచున్నయుభయసేనానివహంబులను నవలోకించుచుండెను. ఆ సేనాశిబిరములు తూర్పున జువ్వలకల్లువఱకును, దక్షిణమున నలగొండకొనవఱకును, పడమర వప్పిచెర్లవఱకును, ఉత్తరమునఁ జింతపల్లెవఱకును వ్యాపించి యుండెను.

ఆసేనానివేశముం గాంచినంతనే బాలచంద్రునిమొదలంతయు నుప్పొంగిపోయెను. ఎప్పుడు తెల్లవారును, ఎప్పుడు రణరంగమున వీర

విహారము చేయును, నెప్పుడు ప్రతిజ్ఞాపాలనముఁ గావింతునని యాతఁ
డుత్సాహముతో నువ్విళ్లూరుచుండెను. ఆతఁ డొక్కసారి తమబలము
నకును, బరబలమునకును గలతారతమ్యములను బరీక్షించుకొని తాము
దేవతలుగను, వారు పూర్వదేవతలుగను భావించుకొనియెను. సంఖ్యా
యం దల్పమే యైనను దనయోధులలో నొక్కొక్కఁడే యరివీర
సహస్రంబులకుఁ జాలియుండు నని నిశ్చయించుకొనియెను. తరువాత
నుభయరాజన్యులకు నసురుగజ్జులై యుభయపక్షములకు నుద్ధారకు
లై యుభయరాజ్యములకును బ్రభువులును బ్రధానులునుగూడఁ దా
మయ్యె యొకరి నొకరు మించి పరస్పరవిజయకాంక్షులై ప్రతిలేనిప్రతి
పక్షులై ప్రవర్తించుచున్న తనతండ్రిబ్రహ్మనాయనియొక్కయు, వల
గాముని కేసుగడ యగునాయకురాలియొక్కయు గొప్పకొలఁదితనము
లంగూర్చి యాతఁ డొకసారి విమర్శించుకొనియెను.

అప్పు డాతనిహృదయమునం దెన్నియో సంశయనిశ్చయము
లును, ఎన్నియో పూర్వపక్షసిద్ధాంతములును దోఁచుచు నంతలోనే
యడఁగిపోవుచుండెను. తుద కాతఁ డొకవంక బాహుబలమును,
మఱియొకవంక బుద్ధిబలమును విశేషించి యున్నవని యొక నిశ్చయము
నకు వచ్చెను. అందొకటి పౌరుషమును రెండవది దైవము నైయుం
డునా యని సంశయము గలిగెను. ఔనని సిద్ధాంతీకరించుకొనుట
కాతనిహృదయ మంగీకరింపకుండెను. కాని సత్య మందే యున్నదే
మో యని స్ఫురించుచునేయుండెను. ఆస్ఫురణ మాతనికి దుస్సహ
ముగాఁ దోఁచుచుండెను. అతఁడు మరలమరల నాలోచించుకొనుచు
"సర్వాంగీకృతములైనసిద్ధాంతములనుబట్టి బుద్ధిబలమునందే యాధి
క్యమున్నట్లు గోచరించుచున్నను మాయలమారి యగు నాయకురాలు
కేవలము బుద్ధిసత్వప్రధానురాలే యైనను నాకుఁ దోఁపదు. అందు దానిచపల

బుద్ధి యాత్మవినాశకరమైనదే గాని యాశ్రయానుకూలమైనది గాదు.
మా తండ్రిగారు మహావీరులగు మేటిమగలను మించినమగవారు. బలపౌ
రుషములం దాతనిమించినవా రీయుభయబలంబులం జే కాక యీలో
కమునందుఁగూడ నెందును లేరు. ఆయన రాజనీతినైపుణ్యముమాత్ర
మసాధారణమైనది గాదా! పరమభక్తాగ్రేసరులై ప్రత్యక్షనారాయ
ణుఁ డని ప్రజలందఱిచేతను బ్రస్తుతింపఁబడుచున్న యాభండనభీము
నకు—ఆసమరసవ్యసాచికి—ఆప్రజ్ఞాబృహస్పతికి బుద్ధిబలమునందు
మాత్రము లోప మేమున్నది? నాయకురాలు మాయలమారి—బ్రహ్మ
నాయఁడు పౌరుషశాలి—" అని యనేకవిధములుగా భావించుకొను
చుండఁగా నాయాలోచనలలో నాతనికి మైమఱపు దోఁచెను. చల్లగా
నిద్రాదేవి యాతనిఁ దన కధీనునిగాఁ జేసివైచుకొనియెను.

అప్పు డాతనికి స్వప్నములో యోధవేషముతో నొకదివ్యసుం
దరమూర్తి యగపడియెను. నరసింహరాజు తన్నెదిరింపవచ్చె నని
తలంచి యుగ్రుఁడై చటాలున లేచి కరవాలము నోరనుండి పెఱికి
యాతనితల నఱకుటకు గమకించెను. కాని యాతఁడు నరసింహుఁడు
గాఁడు. అన్నయగు ననపోతు?—ఆతనిం గాంచినంతనే యదరిపడి
బాలచంద్రుఁడు గడగడ వడఁకిపోయెను. "అన్నా! ఇచ్చటి కేల
వచ్చితివి?" అని కెవ్వునఁ గేకవైచి క్రిందఁ బడిపోయెను.

అంతలోనే తెలివి తెచ్చుకొని యాతఁ డనపోతనిం గాంచి
"అన్నా! ఆడినమాట తప్పి యాంతఃపురజనంబుల నరక్షితులం జేసి
ధర్మశంక యించుకంతయును లేక సమరరంగమునకు సాహసించి
వచ్చుట బ్రాహ్మణకుమారుఁడవగు నీకు న్యాయముగా నున్నదా! అం
తటిపోటుమగలు నాహవరంగమునందే యుండఁగా విజయలక్ష్మి
నిన్నొక్కనినే వరించునని వచ్చితివా? పలికినపలుకు నిలుపుకొనఁజాల

ని బ్రాహ్మణత్వము పరిహాసాస్పదము గాదా !" అని యదలించెను.

అనపోతు క్రోధకంపితస్వరముతో "నేమనుచున్నావు ! బాల చంద్రా ! సత్యవాదివలెఁ బలుకుచున్నావే ! నీవేమని చెప్పి యేమి చేసితివి ? అసత్యము చెప్పి యన్నను మోసగించుట యధర్మము గాదా ! అది తెలిసినతరువాతఁగూడ నాఁడుదానివలె మేడపైలో నుండు మందువా ?" అని గర్జించెను.

బాలచంద్రుఁడు ఖిన్నుఁడై "అన్నా ! కోపపడకుము. మేము ప్పుడు సత్యమే చెప్పినచో నీవు మమ్ము విడిచి యట నిలువఁజాలవు. నీవు రణకేళిలోనుండవని మేమెఱింగియే యట్టిమాయోపాయము చే నీయనుజ్ఞం గాంచి వచ్చితిమి. నీవుమాత్రము మాటనిలుపుకొన్న దేదీ! నీవు బ్రాహ్మణకుమారుఁడవు. రక్షావిధానమే నీకుఁ గర్తవ్యము గాని రణరంగ ఖేలనము గాదు. మేము శూరవంశజులము. ప్రధనరంగమున ప్రాణములనైన నర్పించుటకే పుట్టినవారము——"

అని యింకను నేమేమో చెప్పఁబోవుచుండఁగా ననపోతరా జక్కడము వచ్చి "ఆలాగా ! నేను విప్రకుమారుఁడను గావున వీరయో ధమండలముం గాంచి భయపడుదు ననుకొంటివా ! మాకు రక్షావిధా నమే గాని రణఖేలనము లేదా ? భారతరణంబునఁ బరబలనారణపం చాస్యులై ప్రతాపప్రభాకరులై పైనుండి దేవతలుగూడ మెచ్చునంత టిబలవిక్రమంబులు దీపింపఁ బోరాడిన ద్రోణాచార్యుఁడును, కృపా చార్యుఁడును, అశ్వత్థామయు బ్రాహ్మణులు గారా ? పరశుధారచే నిర్వదియొక్కమారులు ప్రచండాహవంబునఁ బ్రభుశిరంబులు తాళఫలం బులవలె ధరణీతలంబునఁ బడఁగొట్టి రాజనాశముఁ జేసి లేకుండఁ జేయఁబూనిన భార్గవరాముఁడు బ్రాహ్మణుఁడుగాఁడా ! వెఱ్ఱివాఁడా !

అన్నయగుననపోతని యజేయప్రతాపవిషయంబున నీకును సంశయము గలిగినదా!'' అని యుగ్గడించెను.

బాలచంద్రుఁడు వినయముతో "సోదరా! నీపరాక్రమశక్తి నే నెఱుంగనివాఁడను గాను. నీవు మాయన్నవు. నీకార్యమును నిర్వహింపఁగలతమ్ములము మేమిందఱముండఁగా నీ కెందులకీ యాయాసము!'' అనియెను.

అన—ఆయాసమా? మనమందఱమును స్వామికార్యమునకై సర్వస్వము నర్పించుటకు సంసిద్ధులమై యుండలేదా? ఆకష్టసుఖములకు మనమందఱమును భాగహారులమే గాదా? అట్టిచో నన్నగడా యని నాయెడల గౌరవమే యున్నయెడల నన్న్యగాఁ జేసి విడిచి మీ రిచ్చటి కేల వచ్చితిరి? నేను కులము లేక మీతోఁగూడితినా? సమరరంగమున స్వామికార్యమును సాధించుటకే కాదా! నాకాభాగ్యము లేకుండఁ జేసి మీరే యనుభవింపఁదలంచుట భ్రాతృద్రోహముగాదా?

బాల—(మెల్లగా) భ్రాతృద్రోహమైనను బ్రహ్మహత్యయంతటిపాపము గాదు.

అన—వెఱ్ఱివాఁడా! నామరణమువలన మీకు బ్రహ్మహత్యాపాతకము తటస్థించునని భయపడితిరా? ధర్మశాస్త్రములన్నిటిని వల్లెవైచితిరే. ఈమాత్రపుసంశయము తీరినదికాదా? ఆయుధైకజీవులకు రణమరణముకంటెఁ బరమధర్మ మేమున్నది? సరే—అవివేకముచే నప్పు డట్లో భయపడి నాపీడ దప్పించుకొంటిరి. ఇప్పుడేమిచేసెదరు? ఇఁక మీయిష్ట మేమున్నది? మీసంబంధ మేమున్నది? అన్యభావముతో నన్నిప్పు డెడఁజేసి వచ్చితిరో యప్పుడే మీతోడియాత్మసంబంధము వగలిపోయినది. మహారాజు లేఁడా? మహామంత్రులగునాయగారు లేరా! ఇదిగో! ఇప్పుడే పోయి వారి నాశ్రయించి ప్రార్థించి

యూహావరంగమున వీరవిహారము గావించుటకై యనుజ్ఞ గైకొని స్వ
ధర్మనిర్వహణముం గావించుకొనియెదను.

బాల—అన్నా! వలదు—వలదు! నాప్రార్థనమును మన్నించి
మరలిపొమ్ము!

అన—వలదనుటకు నీవెవ్వఁడవు? నేనున్నచో నీప్రాశస్త్యము
లేకుండఁబోవు నని సంశయించుచున్నావా? ఛీఛీ! భ్రాతృద్రోహీ!
నీమొగము చూడఁగూడదు.

బాల—నేను భ్రాతృద్రోహిని గాను; బ్రహ్మహత్యాపాపభీతుఁ
డను. నన్ను నీవెంతనిందించినను నేను సహించెదను. నీవుమాత్రము
రణరంగమునకు రావలదు.

అన—నీవు వలదన్నమానుదునా? నాకు స్వామిభక్తి లేదా?
శౌర్యము లేదా? ఆఁడుదానివలె నంతఃపురమునఁ బడియుండుమం
దువా?

అని యనపోతు పోవుచుండెను. బాలచంద్రుఁడు తత్తరముతో
నొక్కఁగేలుసైచి యాతనిఁ బట్టుకొని "అన్నా! నీవు పోవలదు. నీకు
సమరవిజయోత్కంఠ యనివార్యమైనచో ముందుగా నిచ్చట నీకరవా
లముతో నాశిరమును ఖండించివైచి యనంతరము నీయిష్టము వచ్చి
నట్లు ప్రవర్తింపుము" అని ప్రార్థించుచు నాతని గట్టిగఁ బట్టుకొని
యెను.

అనపోతురాజాతని పట్టు విడిపించుకొనుటకై పెనగులాడఁ
దొడంగెను. ఆసంఘర్షణములో బాలచంద్రునకు మెలఁకువ వచ్చెను.
కన్ను విచ్చి చూచునప్పటికాతనియెదుట మంగలిమల్లు నిలిచియుం
డెను. బాలుఁ డాతనిం గాంచి వికలహృదయముతో, విచారసూచ
కస్వరముతో "సోదరా! ఇట్లు వచ్చితివేమి?"! అని ప్రశ్నించెను.

మంగలిమల్లు శోకగద్గదస్వరముతో “ మేడపినుండి యంతఃపురపరిచారిక యగు మాడచి వచ్చినది ” అనియెను.

బాలచంద్రుఁడు తల్లడముతో “ అట నందఱికిని క్షేమమే గదా ? ” అని ప్రశ్నించెను.

మల్లు—అన్నయగు ననపోతు మనవృత్తాంతమంతయుం దెలిసికొని యధర్మపరుఁడవై తన్నువిడిచి వచ్చితి మని మనలను నిందించుచు నాత్మత్యాగము చేసికొనియెనఁట !

“ ఏమి ! ” అని గట్టిగఁ గేక వైచి బాలచంద్రుఁ డొక్కింతసేపటివఱకును జిత్రప్రతిమవలె నిశ్చేష్టుఁడై నిలిచియుండి యనంతర మొక దీర్ఘశ్వాసమును విడిచి “ సోదరా ! విధివిధాన మిట్లున్నది. విచారించుటకును విమర్శించుకొనుటకును మనకిఁక నవకాశము లేదు. వేవేగముగఁ బోయి విధాయకకృత్యములను నిర్వర్తించుకొని వీరస్వర్గముం గాంచి యచ్చట నన్నగారి యడుగులపైఁ బడి క్షమాప్రార్థనముం గావింపవలయును. తెల్లవాఱుచున్నది రమ్ము ! పోవుదము ! ” అని యాతనితోఁగూడఁ బర్వతావరోహణముం గావించి పరుగుపరుగున వెడలిపోయెను.



## పదునేడవ ప్రకరణము.

తెల్లవాఱినది. ఉభయపక్షశిబిరములందును దెసలు ప్రతిధ్వనించునట్లు రణభేరులు మ్రోగుచుండెను. మలిదేవరాజు నాజ్ఞచే బ్రహ్మనాయఁడు, కొమ్మరాజు, కన్నమనాయఁడు మొదలగుమహానాయకులు యోధవేషాలంకృతులై చతురంగబలసహితముగా యుద్ధరంగమును జేరుట కుద్యుక్తులై యుండిరి.

ఆసమయమునం దాకస్మికముగా బాలచంద్రుఁడు పరుగెత్తుకొని వచ్చి మలిదేవరాజుపాదములకు నమస్కరించి "మహారాజా! నేనింతవఱకు మిమ్ముఁగాని, నాయనగారిని గాని యెట్టికోరికయును గోరినవాఁడను గాను. సుఖదుఃఖములయందు నాకెట్టిఖేదమును లేదు. స్వామికార్యనిర్వహణముకంటె నాకెట్టివిధాయకకృత్యమును లేదు. గురుజనపూజనమే నాకుఁ బరమప్రీతికరమైనది. నాకింతకంటె నెట్టి కోరికలును లేవు. అసహాయశూరుఁడనై యాహవరంగమున వీరఖేలనము గావింపవలయు నని నేనెన్నాళ్లనుండియో యాసించి యున్నాను. ఈనాఁడు నేను నాతమ్ములతోఁ గలసి సమరక్షేత్రమున శత్రువులతోఁ దలపడి బలపరాక్రమంబులు మెఱయఁ బ్రతిజ్ఞానిర్వహణంబు గావించుకొని వచ్చుటకై యనుజ్ఞ నీయవలయును. మొట్టమొదటిదైనను, గట్టకడపటిదైనను మిమ్ములను నేఁగోరున దిది యొక్కటియే కోరిక. పుత్రవాత్సల్యముచే నాయనగారును, మీరును నాయీవిన్నపమును మన్నించి సెలవిచ్చిపంపవలయునని ప్రార్థించుచున్నాను" అని మనవి గావించెను.

మలిదేవరాజాతని నెత్తి కౌఁగిలించుకొని "నాయనా! బ్రహ్మ నాయనిపట్టివైనందులకు నీవు తగినకోరికనే కోరితివి. నీకోరికను నిరాకరించుట వీరధర్మము గాదు. నీవు శౌర్యనిధివగుటచే సమరాకాంక్షివై వెనుకముందరయక యిట్లు కోరుచున్నావు. కాని బాలుండవగు నిన్నింతమంది వీరాధివీరులగు మహానాయకులచేఁ బరిపాలితమై పరబల భయంకరమై యున్న ప్రబలశత్రుసేనానివహము నెదిరింపఁ బంపి ధైర్యముతోఁ జూచుచుండుటకు మాహృదయము లెట్లు తాళి యుండఁగలవో నీవే చెప్పుము!" అనియెను.

ఆమాటలు విని బాలచంద్రుఁడు నవ్వుచు "మహారాజా! పేరునుబట్టి మీరు నన్నింకను బాలునిగా భావించుచున్నారు. బ్రహ్మన్న తనయుఁడు భండవభీముఁడు కాఁజాలఁడని సంశయించుచున్నారా? అట్టిచింతమాత్రమును భావింపవలదు. ఈయొక్క కోరిక చెల్లించి చూడుఁడు! పలికినపలుకు చెల్లించుకొని మరలివచ్చి పాదాభివందనమాచరించినప్పుడు నేను బాలుఁడనో, పరబలకాలుఁడనో మీరే నిశ్చయింపఁగలరు. ఏలినవారికిని, కన్నవారికినిఁ బేరు తేఁగలవారే బాలురు! కులాభిమానములను వెలయింపఁగలవారే బాలురు. బాలురే బలవంతులు. వారే పెద్దలగౌరవమును నిలుపఁగలపెద్దలు. వారికిఁ బిఱికి కంప యుండదు. శ్రేయోభివృద్ధు లన్నియును బాలురవే. వారియుత్సాహము క్షీణింపదు. వారిధైర్యము చెదరదు. వారిమనసు చలింపదు. కీర్త్యపకీర్తులభార మంతయును బాలురమీఁదనే యుండును. ప్రభూ! నేనట్టి బాలురలో నొక్కఁడను గాఁదలఁచి యున్నాను. అంతటిబలవంతమగుశత్రుసేన నెదిరించుటకు నే నెంతవాఁడ నని శంకింపవలదు. ఇంతపిడు గెంతటిపర్వతములనైన భేదింపఁజాలుటలేదా? కాలుచున్నదావానలము నెదుటఁ గాఱడవి నిలువఁగలదా? అవనినా

యశా! అనుమానంబు విడిచి నాకనుజ్ఞ యొసంగుము. పరబలంబుల
భంజించి ప్రతిజ్ఞాపాలనంబు గావించుకొందును" అనియెను.

అట నున్నవారందఱు నద్భుతాక్రాంతహృదయులై యాలకిం
చుచుండఁగా నట్లు వీరాలాపంబులాడుచున్న కుమారుం గాంచి హృద
యంబునఁ బొంగుచు బ్రహ్మనాయఁడు ప్రేమపూర్వకంబుగ నొడలు
పులకింపఁ గొడుకును గౌఁగిలించుకొని "తండ్రీ! నిన్నుఁగనుటచే నా
జీవితము ధన్యమైనది. పుట్టిన నాఁటిగాఁ బెద్దలసేవ యన నెట్టిదో యె
ఱుంగక విచ్చలవిడిగ విహరించిన నీకిట్టిబుద్ధు లన్నియు నెట్లు గలిగె
నహో వింతగానున్నది. కుమారా! పౌరుషవంతుండవగు నీవట్లు పలు
కుట యుచితముగనే యున్నది. కాని మహారణము లనునవి మాట
లచేఁ దీరునవి గావు. పంతములాడినట్లు పరాక్రమించుట సులభసా
ధ్యము గాదు. సమరరంగమునం దెంతవారికైనను చిత్తము చలింపక
మానదు. సకలసేనలతోడను గలసిపోయి యుద్ధరంగమున విక్రమించి
విజయము నందఁగూడదా? ఒక్కఁడనే పోవలయు ననుకోరిక యేందు
లకు?" అని బోధించెను.

కొమ్మరాజు మొదలగు పెద్దలును, మామగారగు కన్నమనాయఁ
డును, పెదతండ్రి యగు బాదన్నయుఁగూడ ననేకవిధముల బాలుని
బుద్ధి మరలింపవలయు నని ప్రయత్నించిరి; గాని యాతఁ డెంతమాత్ర
మును దనపట్టినపట్టు విడువఁడయ్యెను. ఇఁకఁ జేయునది లేక వీరాగ్రేస
రుండును, మేరుధీరుండును, నిర్లేపుండు నగు బ్రహ్మనాయఁడు కుమా
రునిఁ జేరఁదీసి "నాయనా! దశదిశలయందును బరాక్రమార్జునుం
డని ప్రఖ్యాతిఁగాంచిన నానామమునకుఁ గళంకము గలుగకుండ మెలం
గుము. రేచర్లవంశగౌరవమును, మాచర్లరాజ్యప్రతిష్ఠయును గాపా
డుము! బ్రహ్మన్నతనయుఁడు పరసేనాకాననదావానలుఁడని వైరు

లుగూడఁ బ్రస్తుతించునట్లు ఖండనవిక్రమంబు మెఱయించి ప్రఖ్యాతి నందుము. శౌర్యనిలయమగు సమరరంగము స్వర్గద్వారమువంటిదని మనసునందుంచుకొనుము ! అదియే వీరయోధులకు మూలధనమును ముక్తిసోపానము నైయున్నది. యుద్ధక్షేత్రమే యోధాగ్రేసరుల లీలా ఖేలనమున కానందోద్యానము ! నాయనా ! నలగామరాజు వీరాగ్రేసరు లగు నతనాథులతో సంగ్రామములం దారితేరిన చతురంగబలంబులతో మొనసి యున్నాఁడు. నీవిప్పుఁ డాశత్రుసైన్యముతో సమయుద్ధమునకుఁ బోవుట లేదు. ఏకవీరుఁడ వై యెదిరింపఁబూనియున్నావు. ఇందు విజయంబు గాంచితివేని లోకమునం దసాధారణకీర్తి నందఁగలవు. పగవారికోల్తల కొంతయుం జెదరక పరదళంబుల భంజించి బలపరాక్రమంబులు దుర్నివార్యంబు లగునట్లు విజృంభించి వీరవిహారంబు గావించి విజయంబు నందుము. పరమేశ్వరుండు నీయెడఁ బ్రసన్నుం డగుగాక ! ” అని ప్రబోధించి దీవించి కుమారునికి రణరంగమునకుం బోవ ననుజ్ఞ నొసంగెను.

అప్పుడు బాలచంద్రుండు పరమానందభరితహృదయుండై తండ్రికిని ధరణీశ్వరునకును దక్కినపెద్దలకును వందనంబులం గావించి యాశీర్వాదంబు లంది గగనవిహారకంబులగు కదనభేరీరవంబులాకర్ణించుచు రణసజ్జితుఁడై సమరక్షేత్రంబుఁ జేరి కరవాలము నొఱనుండి తీసి కరమునఁగీలించి యుగ్రాకారుఁడై జళిపించుచు నుగ్రనందనుండగు కుమారస్వామింబోలి శత్రుభీకరాకారముతో నిలిచియుండెను. అప్పుడాతని మొగంబున రణలక్ష్మి తాండవమాడుచున్నట్లుండెను. అక్కుమారునిఁ బరివేష్టించి ప్రియసోదరులగు పెలమదోర్నీడును, కమ్మరపట్టియు, కంసాలచందును, కుమ్మరిపట్టియు, చాకలచందును, మంగ

లమల్లును శత్రుమర్దన దీక్షయంబులగు నాకారములతో నాయుధపా ణులై నిలిచి యుండిరి.

అంతకుముందే బాలచంద్రుఁడు దృఢప్రతిజ్ఞుఁడై తమ్ములతోఁ గలసి యుద్ధరంగమునకు వచ్చుచున్నాఁడని చారులవలన నెఱింగి సర్వసే నాధ్యక్షుఁడగు నరసింహరాజు భద్రగజారూఢుఁడై ఖండనంబునకు బయలుదేఱెను. ఆతనిముందు బల్లెములం దాల్చినపదాతిసైనికులు పదివేలమంది బారులు దీరి యుండిరి. బాణతూణీరంబులం దాల్చిన సాహసికులగు నాలుగువేలమంది విలుకాండ్రు రణరంగమున మోహ రించి యుండిరి. ఆ వెనుక నైదువేలమంది యాశ్వికు లాయుధధారులై బలసియుండిరి. మఱియు శూలాద్యాయుధపాణులగు పలనాటివీరులు లెక్కకు మిగిలి వీరాలాపంబు లాడుకొనుచు రణోత్సాహులై పరాక్ర మాటోపంబులు దీపింప నెచ్చటఁ జూచినను దామయై యాహవక్షే త్రమున మోహరించి యుండిరి. ఆసేనకుఁ జుట్టును మదగజంబులు ప్రాకారకోటలై ప్రతివీరభీకరంబులగు ఘీంకృతులం గావించుచుఁ బర్వ తంబులవలె నిలిచియుండెను.

ఆసేనాసముద్రము రణభేరీధ్వనులతోడను, వివిధాయుధసంఘ ట్టనంబులతోడను, వీరాలాపంబులతోడను దశదిశలు మాఱుమ్రోఁగు నట్లుగా ఘోషించుచుండెను. ఆరణరంగమునందు నాయకురాలు రణ వేషాలంకృతయై కాళీమూర్తివలె నెక్కడఁ జూచినఁ దానే యగప డుచు సకలసైనికులకును సమరసాహసమును గల్పించుచుఁ బలనాఁటి వీరులగు మీరు పరిధనరంగమునఁ బేరునిలుపుకొనవలయు నని హెచ్చ రించుచుండెను.

అట్లు మోహరించియున్న యోజనభీకరంబగు శత్రుసైన్యముం గాంచి బాలచంద్రుఁడు తమ్ములం దానును శుష్కకాననంబుఁ దా

గొట్టని విజృంభించు దావానలజ్వాలలవలె శాత్రవసేనాకాననంబునఁ బ్రవేశించి యసాధారణంబు లగు ఖలవిక్రమాటోపంబులు దీపింప సింహనాదంబులు సేయుచు నరివీరులపై కురికి కుంతంబులచేఁ గొట్టుచు, ఖడ్గంబులచే ఖండించుచు, మణికట్లఁ దునుమాడుచు, మస్తకంబులఁ దూల్చుచు, మోచేతు లెడలించుచు, ముక్కులు చెక్కుచు, ఫాలంబులు చించుచు, ప్రక్కలఁ గోయుచు, దౌడలు పెఱుకుచు, దంతంబులు రాల్చుచు, కన్నులఁ బొడుచుచు, గర్ణంబులఁ గోయుచు, బొమ్మలఁ గ్రుమ్ముచు, దౌడలఁ దుత్తునియలుగఁ జేయుచు శత్రుసైన్యంబులఁ జీకాకు పెట్టుచు నతిభీకరాకారులై రణరంగఖేలనంబు గావింపం దొడంగిరి.

అప్పుడు బాలచంద్రుండు గజఘటలపైఁ గొదమసింగమువలెఁ గుప్పించి యెగసి కుంభస్థలంబుల భేదించుచు, తుండంబులను, దోఁకలను ఖండించుచు, మావంతులఁ గొట్టుచు, గజారోహకులఁ గాలాంతికంబున కనుపుచు విక్రమించుటయుఁ బ్రాణభీతిచేఁ జెదరిపాఱుచున్న మదగజంబుల సంఘర్షణంబువలన సేనావ్యూహం బంతయుఁ జెల్లాచెదరైపోయెను. ఆసమయంబున నేకవీరుం డగు బాలుండు వీరావేశముతో నగపడినయాశ్వికులను, ధానుష్కులను, పదాతులను గరవాలంబున శిర చేయుచుఁ బ్రళయకాలరుద్రునివలె రణరంగమున విహరింపఁదొడంగెను.

అట్లాతఁ డతిఘోరంబుగఁ బోరాడుచుండ మస్తకంబులు దెగుటయు మహీతలంబునఁ బడి తన్నుకొనిచచ్చునాశ్వికులును, పాదంబులు భగ్నంబు లగుటయు బంట్లు గీటుకొనుచుఁ బైఁబడఁ దమకించు వీరభటులును, కరంబులు దునియ లగుటయుఁ గత్తులనువదలి తలలతోఁ దాఁక నుంకించు శూరసైనికులును, వెడలుచున్నప్రేగులు

గొనచేతఁ బట్టుకొని పెరచేత ఖడ్గంబులు ఝళిపించుచుఁ గదియు సాహా
సికులునై సమరరంగం బంతయు నతిభయంకరముగా నగపఱుచుం
డెను. అప్పుడు కాలాంతకునిం బోలి శత్రుమారణంబు గావించుచున్న
యాబాలవీరుని యాటోపమును సహింపఁజాలక పోటులఁ బడి మూ
ల్గుచుఁ జచ్చువారును, భయపడి పాఱిపోవువారును, బ్రదుకుట కాసించి
బ్రతిమాలుకొనువారును, ఇట్టి ఘోరయుద్ధము లెన్నఁడు నెఱుంగ
మని యొల్లును దప్పించుకొనఁజాలక యేడ్చువారును, పాలేండ్లమై
బ్రదుకుచున్న మేము బంట్లమై వచ్చినందుకుఁ దగినశాస్తి యైనదని తల్ల
డిల్లువారును, ఆఁడువాండ్రపోరు పడలేక వచ్చి యిట్లు మృత్యుదేవతకు
బలియైపోవుచుంటిమని వాపోవువారునునై సైనికులందఱును చెదరి
పాఱిపోవఁదొడంగిరి.

అప్పుడు సర్వసేనానాయకుఁడగు నరసింహుఁడు భద్రగజంబు
పైనుండి బాహువులెత్తి "ఓవీరశేఖరులారా! ఈబాలుర విక్రమం
బునకు భయపడి యిట్లు పాఱిపోవుట వీరధర్మ మగునా? ఏలినవాని
మేలు మఱచుట కృతఘ్నత గాదా? మీనరములయందు బ్రవహించు
చున్నయుష్ణరక్తము పలనాటిప్రభునియన్నముచే వర్ధిల్లినదియే కాదా?
నమ్మినరాజును నట్టేట ముంచి పోఁదలంచుట న్యాయమా? పాఱిపో
యినఁ బ్రాణములెప్పటికిని బోక నిలుచుననుకొంటిరా? ఎప్పటికైనఁ
జావు తప్పునా? ఎన్నఁటికిని శాశ్వతమై యుండునది కీర్తి యొక్కటి
యే యని యెఱుంగరా? వీరసింహులకు దారుణరణరంగములే విహా
రారామములు గావా? ఇట్లు భయపడి పాఱుట బంటుతనము గాదు.
మనమందఱమును శత్రువీరులను జంపుటకైనను, సాహసించి చచ్చుట
కైనను సంసిద్ధులమై సమరరంగమునకుఁ గదలివచ్చితిమిగాని పెండ్లి
వేడుకలగాంచుటకును, విందుభోజనములఁ గుడుచుటకును రాలేదు.

ఇట్లు వచ్చినయుద్దేశమంతయు నేటిలోఁ గలపి పగవారును, బంధువు లునుగూడఁ బరిహాసించునట్లు పాఱిపోవుట హీనకృత్యము గాదా! ఓశూరశిరోమణులారా! మరలుఁడు! మరలుఁడు. మీ మగటిమి దీపింప మహాహవము గావింపుఁడు! మడమఁ ద్రిప్పిన మహారాజు నాన!” అని ప్రబోధించెను.

ఆప్రబోధవాక్యంబులచేఁ జెదరిన సైనికులందఱును మరలమో హరించి యగ్నిజ్వాలలపై కుఱుకు శలభంబులం బోలి యాబాల వీరుల నాక్రమించి పోరాడఁ గడంగుటయు బాలచంద్రుం డాగ్రహో దగ్రుండై మహార్ణవంబుఁ గలఁగించు మందరనగంబుం బోలి యాసేనా వ్యూహంబును జిందఱవందఱగఁ జేసి కాలాగ్నిరుద్రునివలె రణతాండ వంబు గావించుచు శాత్రవసైన్యంబులపైఁబడి మారి మసంగినరీతిని బ్రమందింపఁదొడంగెను. అప్పుడు రణరంగమంతయును మేదోమాంసం బులచేఁ బంకిలమై, వివిధాయుధశకలంబులచే బీభత్సమై, రక్తప్రవా హములచే భయంకరమైయుండెను.

ఈవిధముగా నెందును నెదురులేక యనునిమిషంబును వర్ధిల్లు చున్న యాహవోత్సాహముతో విక్రమించుచున్న బాలవీరునింగాంచి నరసింహరాజు భయప్రకంపితుఁడై ముక్కుపై వ్రేలువైచికొని, తల యూఁచి, యించుక విచారించి హరిస్మరణం బాచరించి “ఓహో! ఈ తఁడు ప్రళయకాలుఁడు గాని బాలుఁడు గాఁడు! ఈతని ప్రతాపముచే బలమంతయు భగ్నమైపోయినది. ఇఁక నీవీరు నెదిరింపఁగలవా రింకె వ్వరున్నారు? నాయకురాలితో నాలోచించి యనంతరకర్తవ్యంబు నిర్ణయింపవలయును.” అని యాలోచించి తనభద్రగజంబును సేనా ముఖమునుండి మరలించి పోయెను.

అది యెఱింగక బాలచంద్రుం డంతకంత కగ్గలం బగుచున్న కోపానలంబు నాపఁజాలక యరిసేనలపైఁ బడి నుఱుమాడుచుఁ బోవు భద్రగజారూఢుం డగునొకవీరయోధునిం గాంచి యాతఁడే నరసింహుఁడని భ్రమించి సింగపుఁగొదమవలె నాసామజంబుపై లంఘించి బాకుతో వక్షంబునఁ బొడిచి పర్వతంబువలె దానిం బడఁగొట్టి సిద్ధప్రతిజ్ఞుండ నైతినను నుత్సాహముతో నయ్యారోహకునిశిరంబు నొక్కవ్రేటున నెగురఁగొట్టి పరమానందముతోఁ బ్రథనరంగమును విడిచి యొక్కపఱుగున మలిదేవరాజుకొలువునకుం బోయి యాశిరంబును దండ్రి యగుబ్రహ్మనాయని పాదములచెంత నివేదించెను.

ప్రళయరుద్రునివలె భయంకరాకారముతో నట్లు వచ్చియున్న బాలచంద్రుని గొలువులోనివారందఱు నద్భుతాక్రాంతులై చూచుచుండిరి. ఎవ్వరు నేమియు మాటాడఁజాలకుండిరి. అప్పుడు బ్రహ్మనాయఁడు నిట్టూర్పువిడిచి "వెఱ్ఱినాయనా! ఇది నరసింహభూపాలుని యుత్తమాంగముగాదు! బ్రహ్మనాయనితనయునకు వెంకునాయకునితల నఱకి తెచ్చుటయే పౌరుషమా!" అని యధిక్షేపించెను.

ఆమాట యాగ్నేయాస్త్రమువలె నాయంబులం దాఁకి నొప్పించుటయు బాలచంద్రుండు ప్రచండభానునివలె మహోగ్రుండై మాఱుమాటాడక గిరుక్కున మరలి మనోవేగముతోఁ బోయి మరల యుద్ధరంగమునఁ బ్రవేశించెను. అప్పటి కప్పుడే నరసింహరాజు మూలబలమునంతను సమరక్షేత్రమునకుఁ దెమలించుకొని వచ్చెను. ఆసహాయముం గాంచి హతశేషసైన్యమంతయును మరల రణంబునకు సాహసించి మోహరించుటయు బాలవీరులు వీరావేశముతోఁ గొంగలగుంపుపైఁ జెంగలించు కొదమడేగలవలె విజృంభించి ఘోరరణంబు గావింప నారంభించిరి.

అమ్మహాసంకులసమరంబునఁ గమ్మరకాచన్న పరదళంబుల ఖండించి ఖండించి తనపాలిటికులదైవతం బగుకామాక్షిని స్మరించుకొనుచుఁ గదనరంగంబునఁ గాలధర్మంబునం దెను. అల్లే యశ్వసైన్యము నస్తవ్యస్తంబుగఁ జేసి యరిలోకభీకరంబుగ నాత్మశక్తిని బ్రకటించి మహితపరాక్రముఁడగు మంగలమల్లుగూడ రణక్షేత్రమునకుఁ దన ప్రాణములను బలిచేసికొనియెను. గురువిక్రముం డగుకుమ్మరిపట్టియు వీతిహోత్రునివలె విమతబలారణ్యమును భస్మీభూతంబుగఁ జేయుచు గురుదేవతలను మనంబున నిలుపుకొని హతావశిష్టులగునరివీరులచేతుల నుండి వీరస్వర్గముం జూరగొనియెను. సాహసనిధియైనచాకలచందు శత్రుసైనికసహస్రంబులకు సమరతలంబున స్వర్గారోహణసౌభాగ్యముం గల్పించి తుదకుఁ దానును స్వర్గస్థుం డయ్యెను. బాలచంద్రుని తమ్ముఁడ ననిపంతములు పలుకుచుఁ బవరంబున రెండవబాలునివలెఁ బ్రతాపంబు జూపి చతురంగబలంబుల జెల్లాచెదరు గావించుచుఁ గాయంబులనుండి కాయంబునం గలజీవరక్తం బంతయును జెల్లిపోవుటయు మాచర్లచెన్నకేశవుని ధ్యానించుచు వెలమగోర్కిడు వీరశయనంబు నందెను.

ఇట్లు తమ్ము లందఱును వీరమరణంబు గాంచుటయు బాలచంద్రుండు క్రోధశోకావేశంబున ద్విగుణీకృత బలవిక్రమప్రతాపంబు లుద్దీపింప వేవేగ ప్రతిజ్ఞానిర్వాహణంబు గావించుకొని బాలవీరులం గలిసికొనవలయు నను నుత్సాహముతోఁ బ్రళయకాలభైరవునిం బోలి మహోగ్రమూర్తియై శత్రుసేనామధ్యమునఁ బ్రవేశించి నలుదెసలఁ గలయఁ జూచుచు వజ్రగంభీరస్వరముతో ,, ఏఁడీ! అనుగుభూపాలనందనుఁ డగునరసింహరా జెక్కడ నున్నాఁడు? బాలచంద్రునిప్రతిజ్ఞ నాలకించి భయభ్రాంతుఁడై యెందైన దాఁగి యున్నాఁడా? పందతనఁ

ముచే నిట్లొకనఁ బాఱిపోయినాఁడా! ఏఁడీ! ఏకవీరుఁడగు బాలచంద్రుఁ డెదిరించి నిలిచియున్నాఁడు. పౌరుషవంతుఁడైనచో బ్రధనరంగమున నిలిచి పోరాడరాదా!" అనిగర్జించుచు మదగజయూథంబుపై లంఘించు మృగేంద్రంబుకరణి నరసింహునిఁ బరివేష్టించి యున్నమహానాయకులపై కుఱికి యానృపాలవీరులనెల్లఁ దనకృపాణధారచే నిహతులం గావించుచుండుటయు నరసింహుండు క్రోధపరవశుండై తనమదగజంబును బాలచంద్రునిపైకుఱికించి నిశితభల్లముచే నాతనివక్షోభేదనంబు గావింపనుద్యుక్తుండయ్యెను.

బాలచంద్రుం డతిలాఘవంబున నాపోటుదప్పించుకొని యుక్కుంజరేంద్రంబుమీఁది కొక్కయుమటునఁ గుప్పించి యెగసి కుంభస్థలంబుల భేదించి కులపర్వతంబుంబోలె దానింగూల్చుటయు నరసింహుండు కరవాలంబు జళిపించుచు బాలునిందాఁకి ద్వంద్వయుద్ధంబు గావింపఁదొడఁగెను. అప్పుడు వారిరువురును గర్ణార్జునులవలె, రాఘరావణులవలె, వృత్రపురుహూతులవలె జాముసేపటివఱకు సమసమరంబు గావించిరి. పరస్పరజయేచ్ఛచే బలప్రతాపంబు లయ్యిరువురకు నంతకంత కగ్గలంబు అగుచుండెను. ఒకరి కొకరు లొంగుట లేదు.

ఆసమయంబున నరసింహుండు మహోద్ధతుండై తనచేతి యంకుశంబుతో బలవంతముగ బాలచంద్రునిప్రక్కలోఁ బొడుచుటయు నయ్యాఘాతముచే బాలునిప్రేవులు చుట్టుకొని బయటికివచ్చెను. సమరనిశ్శంకుం డగు బాలచంద్రుం డంతమాత్రంబున నించుకంతయును జలింపక పైఁబడినప్రేగులను మరలలోనికిఁ ద్రోసికొని యొక్కచేత నొక్కిపట్టుకొని రెండవచేత బ్రహ్మనాయనిప్రతివచ్చుసామంతరాగోలను సంధించి యాశస్త్రంబుతో నొక్కయుదుటున నరసింహునిపైకుఱికి యాతనివక్షంబునఁ బొడుచుటయు నది యురంబు గాడి వెన్నున దూసి

కొనిపోయెను. ఆపోటుతో ననుగురాజనందనునిజీవశక్తి యంతయు నొక్కసారిగా క్షీణించిపోయెను.

అప్పుడు వీరాధివీరుండగు నరసింహరాజు నిశ్చలాత్ముండై "ఓ మాచర్లచెన్నకేశవా! గురిజాలమల్లేశ్వరునికంటె నీవే భక్తరక్షకుండవు. అక్షరకీర్తివగు నోయనుగుభూపాలా! నీవు ధన్యుండవు. శీలమ్మ తనయుండ వగు నో బ్రహ్మనాయకా! నీవు సిద్ధసంకల్పుండవు. భళిరా! బాలచంద్రా! బ్రహ్మన్నతనయుండ వైనందులకు నీవు పరిపూర్ణప్రతిజ్ఞుండ వైతివి!" అని యొక్కసారి ప్రస్తుతించి మౌనియై ప్రాణాయామంబు చేసి బ్రహ్మరంధ్రమునుండి ప్రాణవాయువు లూర్ధ్వగతంబు లగునట్లు మార్గంబుచేసి విగతజీవుండై రణక్షేత్రంబున వీరశయనంబు నందెను.

అది యంతయుం గాంచుచున్న వీరాగ్రగణ్యుం డగు బాలచంద్రుండు హృదయమునుండి పొంగిపొరలివచ్చుచున్న దుఃఖావేగము నడంచుకొనఁజాలక కన్నీరు కాలువలు గట్టుచుండ నానరసింహరాజున కతిభక్తిపూర్వకంబుగఁ బ్రదక్షిణంబు గావించి, నమస్కారంబు చేసి "ఓయనుగుభూపాలపుత్రా! అనంగమోహనగాత్రా! మానదుర్యోధనా! శైలమనందనా! తండ్రీ! నరసింహనాగేంద్రా! నాయందెట్టియపరాధంబును, నపచారంబును లేదు. నేనెట్టియపకారంబును గావించినవాఁడను గాను. నేనే పాపము నెఱుఁగను! మీరంతమునకు మీరే యుఱి వేసికొంటిరి. నారీరూపరాక్షసి యగు నాగమ్మయే మీపాలింటికి మృత్యుదేవతయైనది. రాజేంద్రా! అలరాజును జంపినపగదీర్చునని ప్రతిజ్ఞాబద్ధుండ నగుటచే వీరవరోచితం బగు నీకార్యంబు సాధింపవలసి వచ్చినది! విధివిధాన మిట్లుండఁగా నెవ్వారేమి చేయఁగలరు?" అని నొచ్చుకొనుచు నరసింహరాజు నుత్తమాంగంబును ఖండించి కుడి

చేతిలోఁ బట్టుకొని చంకను సామంతరాగోల హత్తించి, వ్రేవుల నొత్తి పట్టుకొన్న పెరచేయి యట్లే యుండ నొక్కపరుగునఁ బోయి యాత్మశిబిరంబుఁ జేరుకొనియెను.

కృతప్రతిజ్ఞుండై యట్టువచ్చుచున్న బాలవీరుం గాంచి బ్రహ్మనాయఁడవరిపడి యెదురేఁగి దుఃఖగద్గదస్వరముతో "మహానాయకులారా! నరసింహరాజుగారు వచ్చుచున్నారెదురుకొనుఁడు!" అని హెచ్చరించుచు బాలునికరమునందున్న ప్రభుశిరంబును భక్తితో నందుకొని బంగారుగద్దెపైఁ బట్టుపట్టుపుటం దుంచి ప్రణామంబు గావించెను. తరువాతవీరనాయకులందఱును శోకాద్భుతాకులస్వాంతములతో వచ్చి యాశిరంబునకుఁ బ్రణామంబులు గావించిరి.

అప్పుడు మలిదేవరాజు దుఃఖావేగముతో "సోదరా! అనుగురాజనందనులమై యన్నదమ్ములమగు మనమందఱము నన్యోన్యప్రేమతోఁ గలసియుండు భాగ్యము కారణాంతరములచే లభింపకపోవుటచే ననవాయశూరులమయ్యును, మృత్యుదేవత కింతయుఁబనిపోయితిమి. విధివిధాన మిట్లున్నప్పు డెవ్వరి నేమియన్న నేమిప్రయోజనమున్నది." అని వగవఁదొడంగెను. అది చూచి కొమ్మరాజాదిబాంధవులును, శూరశేఖరులగు సుంకరవీరులును, కదనభైరవులగు గండునాయకులును, గండరగండలగు కమ్మదొరలును కొలువునంగలయెల్ల వీరులను విచారింపఁదొడంగిరి. ఆవిచారముతో బాలచంద్రుఁడు ప్రతిజ్ఞానిర్వహణంబు గావించి విజయుఁడై వచ్చిననంతోష మెవ్వరికిని గలుగ లేదు.

అప్పుడు బ్రహ్మనాయఁడు దుఃఖోద్రేకముచేఁ గుమారుని జగదేకవీరత్వమును లక్ష్యము చేయక యాతనిమనసు నొచ్చునేమో యనియైన సంశయింపక బాష్పకంపితస్వరముతోఁ "బాలచంద్రా!

మాకీయుపకారణంబున సాహాయ్యము చేయవలయు నని మహారాజుగారు మలిదేవరాజు నిన్నాహ్వానించియుండ లేదు. నీయంతట నీవే పిలువనికే రంటమునకు వచ్చితివి. వచ్చినవాఁడ వూరకుండక వీరుఁడవై విక్రమించి నలువని ప్రతిజ్ఞం గావించితివి! కటకటా! ఎంతపని చేసితివి! ప్రభుకుటుంబమునకు మృత్యుదేవతవైతివిగదా!" అని తూలనాడెను.

ఆమాటలకు బాలచంద్రుండు క్రోధోద్రిక్తుండై మండిపడుచు "నాయకురాలా! మీయుంగరవలెనే నేను నాస్వామికార్యమును నిర్వహింపవలయు ననుకుతూహలముతో వచ్చితిని. నాకుఁ బ్రత్యేకముగ నెట్టిశత్రుత్వమిత్రత్వంబులును లేవు. జయాపజయంబులతో నాకెంతమాత్రమును నిమిత్తము లేదు. స్వధర్మనిర్వాహణమే నాకవశ్యకర్తవ్య మైనది. నాపని నేను ముగించుకొంటిని. నాప్రతిజ్ఞ నేను చెల్లించుకొంటిని. ఇఁక నాకీలోకమునఁ గావలసినదని యేదియును లేదు. రాజకుటుంబవిషయమునఁగాని, రాజ్యవిషయమునఁగాని మీరు సెలవిచ్చినట్లు నాకెట్టిబాధ్యతయును లేదు. ప్రభుకులవివర్ధనమునకైనను, వినాశమునకైనను నాయకురాలును మీరే కారకులై యున్నారు. అకీర్తి యైనను, సత్కీర్తి యైనను మీనామములమీఁదనే శాశ్వతముగా నిలువక మానదు. వారికిఁ గులదేవతలైనను, మృత్యుదేవతలైనను మీరేగాని యొరులెవ్వరును గాఁజాలరు. ఎంత తప్పించుకొన్నను ఎంత తలగొట్టుకొని మొత్తినను మీకీవాదు పోదు! సరే! ఇఁక నాకిచ్చటఁ బనిలేదు. పిలువకుండ వచ్చిననాకుఁ బెద్దలకడ సెలవు గైకొని పోవలసిన యావశ్యకమును లేదు—"

అని గిరుక్కునమరలి గంగధారకడకుఁ బరుగెత్తుకొని పోయి ప్రేలాడుచున్న ప్రేవుల నూడఁబెఱికి యాపావనసలిలంబుల జాఁడించి

సాహసంబు దీపింప సమరక్షేత్రంబుఁ జేరి శత్రుసేనలపై కుఱికి యెంత లెఱుంగకుండ ధీరోద్ధతుండై యుద్ధంబు గావించి రక్తధారాప్లావిత సర్వాంగుండై యలసి యరివీరుల నిశితకుంతంబులపై నల్లన మేనువాల్చి చెన్నకేశవస్వామిని చిత్తంబున నిలిపి ధ్యానించుచు నవ్వీరశేఖరుండు తనకన్నమున్న వీరస్వర్గంబు చూరగొన్న వీరవరులం జేరుకొనియెను.

అంతఁ బ్రభాకరుండును నస్తంగతుం డయ్యెను. జగమంతయు నంధకారబంధురమైపోయెను. స్థావరజంగమంబులగు సకలపదార్థములునుగూడ నిదమిద్ధమని యేర్పరింపరాకుండ నేకములై యాసాంద్రాంధకారగర్భంబున విలీనములై పోయెను. “సర్వం విష్ణుమయం జగత్” అనుసత్యవాక్యము సార్థకంబగునట్లు సర్వంబును శ్యామలచ్ఛాయాచ్ఛన్నమైపోయెను.



## పదునెనిమిదవ ప్రకరణము

మఱునాఁటి ప్రాతఃకాలమునుండియు నుభయబలంబులందును యుద్ధభేరులు మ్రోగుచుండెను. ఉభయరంగంబులనుండియు వీరశేఖరుల విజయశంఖారావములు వినవచ్చుచుండెను. ఉభయసేనలును యుద్ధసన్నద్ధము లగుచుండెను. కాని యుభయపక్షంబులయందును గూడ నుత్సాహశక్తి క్షీణించిపోయెను. నలగామరాజున కేకమాత్రసహాయుఁ డగు నరసింహరాజు బహుళసేనానివహంబులతో బవరంబునఁ బడిపోవుటచే నాపక్షమునకును, బ్రహ్మనాయని కేకమాత్రపుత్రుం డగు బాలచంద్రుండు వరిశాపనిధు లగు బాలవీరులతో మహారణంబున మడియుటచే నీపక్షంబునకును దీఱనికొఱంత వాటిల్లెను. అయినను నంతమాత్రముచే వైరానలం బడంగక యంతకంతకు వర్ధిల్లి పోవుచుండుటచేఁ బౌరుషప్రధానులగు వారికి సమరరంగమునందు విజయమరణములం గాంచుటకంటె వేఱొక యుపాయము లేకుండఁబోయెను.

జాముప్రొద్దెక్కినప్పటి కుభయబలంబులును మొనసి సమరమునకు డీకొనియెను. అశ్వికులాశ్వికులతోడను, గజాధిరూఢులు గజాధిరూఢులతోడను, రథికులు రథికులతోడను, పదాతిజనంబులు పదాతిజనంబులతోడను, భటులు భటులతోడను దలపడి మహారణంబు గావింప నారంభించిరి. నలగామభూపతి పట్టపుటేనుఁగు నధిరోహించి తనచుట్టు నంగరక్షకసైనికులు బలసియుండ నున్నతప్రదేశంబున నిలిచి యుద్ధరంగమున విశేషములం గాంచుచుండెను.

అతనిసేనాసమూహంబునకంతకును దూష్పన సంకోజగణాధ

లియు, దక్షిణపుదిక్కున నందెర ముండను, ముమ్మడిరెడ్డియు, బడమ
టిదెసం బాజుల బ్రహ్మయు, నుత్తరభాగమున పొంకుగల్లు వీరమల్లుం
డును రక్షకులై నిలిచియుండిరి. మూండుగల పేరారెడ్డి సర్వసేనానాయ
కుండై సంగ్రామక్షేత్రమం దంతటను సంచరించుచు నెచ్చట నెవరికిని
గూడ శక్తిలోపము గలుగకుండం దోడ్పడుచు వేయికన్నులతోం
గాచుకొనుచుండెను.

ఇట సుంకరదామానాయని యాధిపత్యమున మలిదేవభూపా
లుని బలమంతయును బరిపాలితమై విజృంభించుచుండెను. అప్పుడు
బ్రహ్మనాయని గజసైన్యములు చెల రేగి నడగొండలవలె నలగాము రాజు
కాల్బలముపైం బడి క్రూరసర్పంబులంబోలిన తుండంబులతో విసరి
కొట్టి, ఖండఖండంబులుగాం జేయుచు, పాదములతోం దన్ని పచ్చడి
గావించుచు, కొమ్ములతోం గ్రుమ్మి కూల్చుచు ననేకప్రకారంబులం
జిత్రవధలు గావించుచు రణరంగమంతయును బీభత్సంబు సేయుచుం
డుటయు నిలువంజాలక సేనలన్నియును జెల్లాచెదరై పోయెను.

అది చూచి నాయకురాలు బెదరిపడి తనబలంబునం బోటుమగ
లగు మేటివిలుకాండ్రననంద ననేకముఖంబులం జేసి యొక్కుమ్మడిగ
నమ్మదగజసేనాసముద్రంబున నంపజల్లు గురియుంచుటయు నాశరాసా
రంబునకుం దాళంజాలక యాసామజదళంబులు ఘీంకారంబులు గావిం
చుచు నానాముఖంబులం బఱుగులెత్తుచు స్వపక్షపరపక్షభేదము
లేకుండ నడ్డపడిన యోధులనెల్లం ద్రొక్కివైచుచుండ సాహసికు లగు
వీరులు సన్నిలను బరిసెలను బ్రయోగించి పడంగొట్టం దొడంగిరి.

ఈరీతిగాం దమగజదళంబులు గజిబిజి యగుటం గాంచి బ్రహ్మ
నాయండు వానిని వెనుకకు మరలించి యోధులను యుద్ధమునకుం
బురికొల్పుచుం దాను స్వయముగా సామంతరాగోలను ద్రిప్పుచు

మదగజయూథంబులపై లంఘించు మృగేంద్రంబునుం బోలి శత్రుసైని కులపైఁ బడి చీల్చి చెండాడ నారంభించెను.

అట్లు సేనాసాగరముం గలంచుచును విక్రమించుచున్న బ్రహ్మ నాయని యౌద్ధత్యమును సహింపఁజాలక నాయకురాలు తమ యోధు లనుద్దేశించి "ఓ రెడ్డివీరులారా! పగపట్టిన త్రాఁచుపామువలె భయం కరాకారుఁడై రోజుచు నాయఁడు విక్రమించుచున్నాఁడు. ఆతని వెనుక ఘోటకీ ఏలవారు బాసటయై మనసేనలఁ జీల్చివైచుచున్నారు. శీఘ్ర ముగఁ బోయి యాతని నడ్డుకొని మరలింపుఁడు" అని హెచ్చరించుట యు చింతపలిరెడ్డి రెడ్డిసేనలతో నాతని నెదిరించి యతిఘోరంబుగఁ బోరాడఁదొడంగెను.

అప్పు డుభయపక్షవీరులును గత్తులు, కటారులు, గండ్రగొ డ్డళ్ళు, బరిసెలు, సన్నెలు మొదలగు నాయుధంబులతో హాహాకారా హారా రని బోరుచుండిరి. రణరంగమంతయు మాంసపిండములతోడను, నె మ్ములరాసులతోడను, మృతకళేబరంబులతోడను, నెత్తురువఱదలతో డను నిండిపోయెను. కుప్పలిప్పలై పడియున్న మొండెములు లక్ష్యపడుచు న్నను నాఁగక బ్రహ్మనాయఁడు ప్రతాపభాస్కరుండై శత్రుశోష ణంబు గావించుచుండెను.

ఆతనిధాటి కాఁగజాలక తనవారందఱును బరుగువాఱుచుండు టయుఁ జింతపలిరెడ్డి సింగమువలె బొబ్బరించుచు నెదిరించి నాయ నితో ద్వంద్వయుద్ధంబు గావించి యలసిపోవుటయు కొండమగుండ్ల నర సారెడ్డి యాతనికి బాసటయై బ్రహ్మన్నకడ్డముగ నెదిరించి నిలిచెను. బ్రహ్మనాయఁడు నాతనిపైఁబడి నామంతరాఁగోలతోఁ జదియమోదు టయు నరసారెడ్డియు నొల్లఁబోయి యంతలోఁ దేఱుకొని నిశితకరవా లముతో నాతనితల నఱకుటకై సాహసించెను. అతనికిఁ దోడై చింత

-పలిరెడ్డియు నాయనిపైఁ బడఁబోవుచుండ పెద్దమలిసీఁ డాతని నాఁగి విక్రమించెను. అదిచూచి చింతపలిరెడ్డి మొఱపు దప్పినమహానాగము వలె రోజుచు బారుటీఁటితో నొక్కపోటుపొడిచి యవలీలగ నాతని మడియించివైచెను.

తమ్ముం డట్లు ధరణీతలంబున వికతాసుండై పడుట కను లారఁ గాంచి యాగ్రహోదగ్రుండై బ్రహ్మానాయుఁడు కృపాణంబుచే నరనారెడ్డిశిరంబు నొక్కవేటున ఖండించివైచి చింతపలిరెడ్డిపైఁ బడ నుంకించుచుండ నింతలో పిన్నమలిసీఁ డక్కజమై యారెడ్డిం దాఁకి మాఁగల వీరారెడ్డి చూచుచుండఁగనే యాతని నొక్కబల్లెపుపోటుతోఁ బడఁ గొట్టి కరవాలముతోఁ దల నఱికివైచెను.

అప్పుడు సేనానాయకుఁడగు మాఁడుగలవీరారెడ్డి యొక్కవో నిపరాక్రమంబు శత్రుబలస్రహరం బగుచుండఁ బరబలంబుల మార్కొని ప్రళయకాలభైరవునింబోలి ప్రతాపంబు మెఱయించుచుండు టయు మాలకన్నమనాయఁడు తనసేనలఁ బురికొల్పి బ్రహ్మానాయునికి సహాయుఁడై నిలిచి పోరాడఁదొడంగెను. అయ్యిరువురు సేనానాయకు లట్లు తలపడి పరస్పరజయేచ్ఛలు ప్రబలుచుండ నతిభయంకరంబుగ రణవిహారంబు చేయఁదొడంగిరి.

అది చూచి పిన్నమలిదేవరాజు సమరోత్సాహంబు మెఱయ సామజారూఢుండై యొక్కయెడటప వచ్చి మాలకన్ననికిని, బ్రహ్మానాయునికి నడ్డముగ నిలిచి వీరారెడ్డి మహారణంబు గావింపఁదలప డియెను. అప్పుడ య్యిరువురకును నతిభయంకరంబుగ పోరాటం బయ్యెను. వీరవరుం డగు వీరారెడ్డి యుగ్రుఁడై పిన్నమలిదేవరాజు నిమ్మాడ్కిఁ గాంచి "కొనుము! వీరారెడ్డిసింహగర్జనము [illegible] చూపింపుము! [illegible]!" అని బ్రహ్మానాయని హెచ్చరించుచుండఁగనే వీరావేశంబున విజృంభించి

శిన్నమలిదేవుని కుంభికుంభంబుల వ్రక్కలుచేసి కూలుచున్నయాగజేం
ద్రంబునుండి కుప్పించియురుకుచున్న యారాజకుమారుని యుత్తమాం
గము గరవాలంబుచే నఱకివైచెను.

రాజకుమారునిపాటును, వీరారెడ్డివిక్రమమును గనులారఁ
గాంచి సహింపఁజాలక బ్రహ్మనాయఁడు భీకరాకారుండై తనబలంబు
లన్నియు నొక్కుమ్మడిం దలపడునట్లు హెచ్చరించుచు కన్నమనా
యఁడు, గొమ్మరాజును దనకిరువంకల బలసియుండ విజృంభించుచు
వీరారెడ్డిం దాకెను. ఆసమయంబున శత్రుసేనాసముద్రమునుండి తెర
తెరలుగఁ బొంగి పైఁబడుచున్న వీరతరంగములకుఁ జలింపక వీరారెడ్డి
పర్వతప్రతిమానుండై నిలిచి ఘోరరణంబు గావించెను.

ఆసంకులసమరంబునందు పరబలవారణసింహుండగు బ్రహ్మనా
యఁడు దుర్నిరీక్ష్యతేజోవిలసితుండై మహారణంబు గావించి శాత్రవసే-
నాకాననంబును దనశరానలజ్వాలలచే భస్మీభూతంబుగఁ జేసి ప్రళ
యరుద్రతాండవంబు గావించుచుఁ బోయి విజయగర్వితుండగు వీరా
రెడ్డిని సమరరంగమునకు బలిచేసి విజయశంఖారవంబు గావించుచు
వీరవిహారంబు సేయుచుండెను. వినాయకం బగువిమతసైన్యంబు
చెల్లాచెదరై పారఁదొడఁగెను.

అప్పటికి మార్తాండుండు నభోమధ్యస్థితుండై వెలుంగుచుండు
టయు బ్రహ్మనాయఁడు ప్రచండరణవిక్రమంబు దీపింపఁ బ్రధనరంగ
మునం దెచ్చటఁజూచినఁ దానయై పరబలంబుల దొరకినవీరులనెల్ల
నురుమాడఁదొడంగెను. ఆఘోరసంరంభంబు గాంచి నాయకురాలు
గజాకోలాహలంబుగావించి నిలిచి తనసేవల నుద్దేశించి యెలుఁగెత్తి “ఓ
వీరయోధులారా! కొడుకుమరణముచేఁ గొమ్మరాజబ్రహ్మనాయకు
లును, భ్రాతృమరణముచేఁ బెదమలిదేవరాజును శోకసంతప్తులై తమ

చావులకు శంకింపక సాహసించి సమరవిహారంబు సేయుచున్నారు. ఇదియే మనవిజయంబున కనుకూలసమయము. మహావీరులగుమీ రందఱును మీమీబలంబుల సమకూర్చుకొని యొక్కసారిగా సంకుల సమరంబు గావించి శాత్రవాటోపంబు చల్లార్చి స్వామిభక్తులై సమర విజయంబుగాంచుఁడు!'' అని హెచ్చరించెను.

నాయకురాలియుత్సాహపూరితంబులగు వీరాలాపంబులాలించి పరితాపవిధులగు ఝట్టిరాజు, కోటకేతరాజు మొదలగు రాచయోధు లు రణోత్సాహులై చెదరినబలంబులనెల్లఁ గూర్చుకొని యొక్కసారిగ నెత్తి వచ్చి శత్రువులపైఁ బడి విక్రమింపఁదొడంగిరి. అప్పుడు పౌజుల బ్రహ్మ, సంకోజిగణపతి, నందెలరాముఁడు, ముమ్మికిరెడ్డి, వీరమల్లుఁ డు మొదలగుదండనాయకులు తమబలంబులతోఁ జుట్టును బరివేష్టించి యుండ నలగామరాజును శత్రుసైన్యములపైఁ బడి నానాముఖంబుల విహరించుచు రణఖేలనంబు గావించుచుండెను.

ఒక్కసారిగా నందఱును వచ్చి పైఁబడుటచే మలిదేవరాజు సేనకు మహారణంబు భరంబయ్యెను. బ్రహ్మనాయఁడు మొక్కవోని విక్రమంబున విజృంభించుచుండెను గాని యాతనిసేనయంతయును చెదరిపోవుచుండెను. ఆసమయము చూచి నాయకురాలు మేళ్లవాగు నందున్నబ్రహ్మనాయనిమూలంబుతియు నీరణరంగంబునకుఁ జేరుకొ న్నచోఁ బోరుమున్నహంబగునని భావించి వేయుమందివీరభటులం గూర్చుకొని పోయి మేళ్లవాగునకును గారెముపూడికిని నడుమనున్న కనుమయందడ్డముగ నిలిపి యావంక బ్రహ్మనాయనిబలంబులతోడను, నీవంక మలిదేవుని సేనలతోడను బోరాడఁదొడంగెను.

వెనుక మాయలాడి యగునాయకురాలును, ఎదుట నొక్క సారిగవిక్రమించుచున్ననలగాముని విజయసైన్యము సగలసి విక్రమించు

ఘుండుటచే వాలిదేవునిసేన లికుకునం బడియును బ్రహ్మనాయనిప్రో
త్సాహముచే నిండుకొనియున్న బలిమిచే యతిసాహసంబునఁ దెంపరు
లై ప్రాణములను తృణప్రాయములుగాఁ జేసి పౌరుషంబు లగ్గలంబు
లగుచుండఁ బోరాడఁదొడంగెను.

అప్పు డుభయపక్షంబులవారికిని శస్త్రసంపాతదారుణంబు,
జయగర్జారవభీకరంబు, ప్రచండప్రతాపదుస్సహంబునైన సంకులసంగ్రా
మంబు ప్రవర్తిల్లెను. అప్పటి యాఘోరాహవవిశేషములు వర్ణనాతీ
తములై యుండెను. దిక్చక్రము బాణపరంపరాచ్ఛన్నంబై మేఘా
చ్ఛాదితం బైనట్లుండెను. పరస్పర శరసంఘట్టనంబులవలనం బుట్టు
నగ్నిస్ఫులింగమాలికలు తటిల్లతలవలె మెఱయుచుండెను. బాణాఘా
తంబులచేఁ గూలిపడిపోయిన గజాశ్వాదులయు, వీరభటులయు మృత
కళేబరంబులనుండి వెలువడుచున్న శోణితప్రవాహములు రణరంగ
మున మహానదులవలెఁ బ్రవహించుచుండెను.

ఆఘోరాహవంబున నుభయపక్షంబులందును బ్రధానులగు
వీరనాయకు లనేకులు సమరయజ్ఞంబునం బాహుతులైపోయిరి. ఉభ
యబలంబులును జాలవఱకు క్షీణించిపోయెను. కాని యన్యోన్యవిజ
యవాంఛమాత్ర మంతంతకుఁ బ్రబలమగుచుండెను. అప్పుడు కోట
కేతరాజునకును గొమ్మరాజునకును ద్వంద్వయుద్ధంబు ప్రవర్తిల్లెను.
ఆరణంబునఁ గేతరాజు తననిశాతభల్లముచేఁ గొమ్మరాజు వెడఁదయు
రంబును వ్రయ్యలుగావించి ధరణీతలంబునఁ గూలనేసెను.

కొమ్మరాజు పాటు గాంచి గండుకన్నమనాయఁడు కోపోద్రి
క్తుండై కేతరాజునెదిరించి యతిభయంకరంబుగ భండనంబు గావించి
తుదకాతండును గేతరాజు కరవాలంబున కెరయైపోయెను. అప్పుడు
బ్రహ్మనాయని సోదరులగు పేర్నీడును, సూర్నీడును భీకరాకారులై

కేతరాజు నెదిరించి శరవర్షంబుల నాతనిపైఁ గురియించుచుండ నలసి పోయిన కేతరాజున కష్టముగా ఝుట్టిరాజు వచ్చి నిలువంబడి తనదుర్జయపరాక్రమంబుఁ బ్రకటించి తుదకు బాణద్వయప్రయోగంబున బ్రహ్మనాయని యిరువురితమ్ములశిరంబులను ఖండించి రణధరణీతలంబునఁ దూలించివైచెను

ఆసమయంబునఁ దనమూలబలంబులనడ్డుకొని విజృంభించుచున్న నాయకురాలితోఁ బోరాడుచు బ్రహ్మనాయఁడు కొమ్మరాజును దనతమ్ములును, బావయు కేతరాజఝుట్టిరాజులచేతులం బడి కూలుటం గాంచి నాగమ్మతోడియుద్ధంబును జాలించి వెనుకకు మరలి యర్ధచంద్రవ్యూహముగ నిలిచియున్న నలగామరాజుసేనపయిం గవిసి సింహనాదంబు చేయుచు నడ్డపడినయోధులశిరంబులు ఖండించి చెండాడుచు శత్రుదుస్సహంబగు రణవిక్రమంబు మెఱయింపఁదొడంగెను.

ఉభయబలంబులు నప్పుడు మరల నతిభీషణసంగ్రామంబు గావించెను. బ్రహ్మనాయనికిఁ బ్రతిపక్షముం బూని సర్వరాజ్యతంత్రస్వతంత్రయై మహాసమర్థతతో మగబిడుదువాల్చి యశ్వారూఢయై యంతవఱకు నింతకంతయుఁ జలింపక నాయకులతోఁ గయ్యంబు సేయుచున్ననాయకురా లప్పుడు వెనుకనుండి బ్రహ్మనాయనిమూలబలంబును నిశ్శేషంబు గావించి సింహనాదము సేయుచు వెనుకపాటున మలిదేవరాజసైన్యముపై మారిమసగినట్లు నిర్మూలించుచుండెను. ఆమెప్రతాపమును సహింపఁజాలక శత్రుసేనయు తియుచు జలించిపోవుచుండెను.

ఇట్లు మహాకాళివలె రణవిహారంబు చేయుచున్న నాయకురాలు, ముందరనున్న తనబలంబుల నట్లే భేదించుచు మహోగ్రుండై విజృంభించుచున్న బ్రహ్మనాయని విక్రమవిహారంబు గాంచి తనసేన

మూకలు [illegible] ప్రోత్సాహముచే రాజరక్షణంబున కోల్పడ భంగంబు గాంచుటను [illegible] సహించక జగ్గానుజు మలిదేవరాజు సేనామధ్యము నుండి త్రోసికొని వచ్చి ప్రళయభైరవునివలె నుగ్రుండై యుద్ధము చేయుచున్నయా బ్రహ్మనాయని నెప్పటివలె మార్కొని పోరాడందొడంగెను.

అప్పుడు మలిదేవభూపతి తనపక్షమునందలి యోధశేఖరు లందఱును వీరస్వర్గంబుఁ గాంచుటయుఁ దనబలంబంతయు నవసన్నం బగుటయుఁ గాంచి యిఁకఁ దన కేకమాత్రసహాయుం డగు బ్రహ్మనాయకు నెట్లయినఁ గాపాడవలయు నను నాశతో హతశేషసైన్యంబును సమకూర్చుకొని నాయకునితోఁ బోరుచున్న నాయకురాలి నెదిరించి శరవర్షమును గురియింప నారంభించెను.

అవశిష్టకార్యము నతిత్వరితంబుగఁ దీర్చుకొనవలయు నని నిశ్చయించుకొనియున్న యానాయకురాలప్పుడు తనధనుర్విద్యానైపుణ్యంబు నాయకునికన్నులఁగట్టుచుండ మలిదేవుఁడు తనపై బ్రయోగించు మార్గణంబుల నన్నిటిని మధ్యమార్గమునందే ఖండంబులుగఁ జేసి యసమసమరచాతుర్యంబు దీపింప మలిదేవుని ధ్వజంబును దునిమి, సారథిని సమయించి కోదండమును ఖండించి యొకవాఁడిబాణంబుచే వజ్రకుండలమండితం బగునవ్వసుంధరావల్లభుని యుత్తమాంగంబును యుద్ధరంగమున కలంకారంబుగాఁ జేసి వైచి కవ్వడిఁ గేరువైచెను.

ఇం కేమున్నది? బ్రహ్మనాయనివంటి ప్రతాపమార్తాండున కిఁకఁ జేయవలసిన దేమున్నది? ఎవ్వనిప్రతిష్ఠకొఱ కింతమంది వీరయోధుల జీవరక్తవాహినులను రణక్షేత్రమునఁ బ్రవహింపఁజేయవలసివచ్చెనో యట్టిమహారాజు మాయమైపోయినతరువాత బ్రహ్మనాయని కింక ఖండనములతోఁగాని, ప్రాణములతోఁగాని పనియేమున్నది? అప్పు

జాతని హృదయాంతరాళమునం దెట్టిదుస్సహదుఃఖజ్వాల ప్రజ్వరిల్లినదో కాని యాతని నేత్రద్వయమునుండి యొక్కయుష్ణాంశుబిందువైనను వెలువడలేదు! చిత్రించినప్రతిమవలె నాతఁడట్లే నిశ్చేష్టుఁడై నిలువఁబడిపోయెను.

కొంతసేపటి కాతఁడు తెలివి దెచ్చుకొని యొక్కనిట్టూర్పు విడిచి తనయాయుధముల నన్నిటిని గ్రిందఁ బాఱవైచి నాయకురాలి కెదురుగఁబోయి "ఓవీరనాయికాశిఖామణీ! విజయలక్ష్మీస్వరూపిణీ! త్రిలోకసుందరీ! త్రిమూర్త్యాత్మికా! నీవు సంకల్పసిద్ధురాలవు! నీచే యవలసినపని యంతయును నిర్వాహకంబైనది. శూరసేనయంతయు హమడఁగిపోయినది. మామలిదేవరాజు మహావీరులతో సురపురంబునఁ గొలువుగావింప నరిగియున్నాఁడు. ఇఁకఁ బలనాఁడు భాగింపవలసిన పనిలేదు. నాపుత్రులు, సోదరులు, బంధువులు నెల్లవారును సంగ్రామభూమికి బలియైపోయినారు! నేనొక్కఁడనుమాత్రమే నీప్రతిపక్షమున నిలిచియున్నాను. ఇంకను నేల యాలస్యము చేసెదవు? ఈ రుని శిరంబునుగూడ వేవేగముగ ఖండించి భూతసంతర్పణంబు గావింపుము. నీపగ దీర్చుకొని పలనాటిరాజ్యమంతయును నిష్కంటకంబుగఁ జేసి నలగామరాజును బునరభిషిక్తునిం గావింపుము!" అని యుగ్గడించుచు నామెయెదుటఁ దలవంచి నిలువఁబడియెను.

నాయకురాలు వెల్లనైనవదనముతో, విచారసూచకస్వరముతో "బ్రహ్మనాయకా! ఎంతమాట యంటివి! వీరక్షేత్ర మగు పలనాటిపేరు నిలుపుటకై పుట్టిన మహావీరశేఖరుల కీర్తివల్లికల నీజగంబున సుస్థిరంబులుగాఁ బ్రతిష్ఠించుటకై విష్ణుదేవునియంశంబున నీవీరభూమియం దవతరించిన మహాపురుషుండవని నిన్ను నేనెఱుంగుదును.

నీకు నామొదల నిర్హేతుకముగా నసూయ గలిగినది. అదియును విధి
సూత్రమే—దాని నెట్లయినఁ బోఁగొట్టుకొని, నీమైత్రిని సంపాదించు
కొని, నీమన్ననలం గాంచఁదలంచియే నీకిరుపోటుగా నిలిచి నాదర్ప
మంతయును జూపించితిని. ఈవిధముగా నేను నీకార్యమునకు నిమిత్త
మాత్రము నైతిని. అంతే కాని నీయెడల నిజముగా నాకెట్టిద్వేషభా
వమును లేదు. నీవు మహానుభావుఁడవు. నిన్ను జయించుట నావంటి
దానికి సాధ్యమగునా? ఇది యంతయును గాలవశమున నైనది. తు
దకు నేనే యోడిపోయితిని. నాతప్పుల నన్నిటిని క్షమింపుము. ఒక
వేళ నాదోషములకై నన్ను శిక్షింపఁదలఁచితివేని ఇదిగో! నాయాయు
ధములను ద్యజించి నాశిరంబును నీచరణసన్నిధిని సమర్పించుచున్నా
ను. కసిదీర నీవీశిరంబును ఖండించివైచి నీవే నలగామరాజును బల
నాటిరాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ గావించి యెప్పటివలెనే యాతనికి
మహామంత్రివై, రాజ్యధురంధరుండవై ప్రజాపరిపాలనంబు చేసి సత్కీ
ర్తిం గాంచుము'' అని పలుకుచు చేతులఁ జోడించుకొని వందనము
సేయుచు నిలువఁబడియెను.

బ్రహ్మనాయఁడు దీనవదనముతోఁ దలయూఁచుచు "ఆయుధ
ములు ధరించి యాహవరంగమున నెదిరించి నిలిచియున్నను నాఁడు
దానిని బోర జయించుటకూడ వీరధర్మము గాదని యెంచిన పురుషా
వతంసుఁడైన వీరుఁడు నిరాయుధలైన స్త్రీలను నిర్జించుట కుద్యోగిం
చునా? నేనట్టి నీచకృత్యము నెన్నఁటికినిఁ జేయఁజాలను. ఇంతవఱకు
నేను నావీరధర్మమును నిర్వహించుకొంటిని విధిదౌర్బల్యముచే విజి
తుండ నైపోయితిని. నీవు విజయినివైతివి. వీరనాయకురాలను పేరు
నీకే చెల్లును నీవే నలగామరాజు మంత్రిత్వమునకు యోగ్యురాలవు.

పలనాటిని బాలింపఁగల సామర్థ్యము నీబాహువులయందే యున్నది. పలనాటిప్రజలను రంజింపఁజేయఁగలబుద్ధిబలము నీహృదయమునందే యున్నది. " అని హెచ్చరించెను.

నాయ—పల్నాటివీరకీర్తి ప్రతిష్ఠాపనమునకై యందఱము నిట్లు నిమిత్తమాత్రుల మై పని చేసితిమి గాని యింద స్వకీయమగు విజయ మొక్కరికిని లభింపలేదు. వాస్తవముగ నాలోచింపఁగా నేనును నీవునుగూడ విజితులమే—ఇఁక నలగామభూపాలునకుమాత్ర మే మున్నది? పేరమ్మ పేరంటాలై పెద్దలలోఁ గలసిననాఁడే యాతనిసుఖ స్వప్నసౌధము లన్నియును జీర్ణీభూతములై పోయినవి.

బ్రహ్మనాయుఁడు నిట్టూర్పు విడిచి « ఈయన్నియనర్థముల కును మనమే కారకులమైతిమి. నీనరసింహుఁడును నామలిదేవుఁడును గూడ నాకలోకమునం గలిసికొని యైకమత్యముతోఁ బరస్పరము నభి నందించుకొనుచు శాశ్వతస్వర్గభోగములం గాంచుచున్నారు. "

అని యతిదీనముగఁ బలుకుచుండ నాయకురా లాతనిమాటల కడ్డము వచ్చి « ఇఁక బ్రతికియున్నమనము పశ్చాత్తాపముతో నీపాప పుజగంబునఁ బడి పరిదేవనంబు గాంచుచున్నాము! సోదరా! వెరు కఁ జింతించుటకంటె వెఱ్ఱితనమేదియును లేదు. " అనియెను.

బ్రహ్మ—చింతించుటకంటె నాకిఁక జేయఁదగినఘనకార్యము లేమి మిగిలియున్నవి?

నాయ—తావక బ్రదికియున్నంతవఱకు సకలజీవులకును స్వధ ర్మనిర్వహణము చేయవలసియే యుండును. జగదేకవీరుఁడవగు నీవింం తవఱకును సమరరంగమున నెదిరించి నిలిచి పోరాడియు గెలిచినదాని వలె నగపడుచున్న నేను నీసోదరినై యుండుటకుఁ దగినదానను. నీవు

నన్నింతటెనుండి నీయాత్మసోదరిగా నాదరించుచుఁ దొల్లియనుగురా జేంద్రుండు నీతలపైఁ బెట్టిపోయిన యాత్మకుటుంబరక్షణభారమును వహించి కల్లాటికాఖ్య భవిష్యద్రక్షణంబునకుఁ బట్టుగొమ్మవై బ్రదికి యున్నంతవఱకును బరిపాలించుట నీకు విధాయకధర్మమై యున్నది. నీవు వెనుకటివైరము లన్నిటిని విస్మరించి నావిన్నపమును జెల్లింపవల యును. ఇఁక మాఱుమాటాడినచో మాచెర్లచెన్నునియాన! మల్లే శ్వరునియాన! నీమహారాజనందనుఁ డగు నలగామభూపాలునియాన!

అని నాయకురాలు తనబుద్ధిబలదర్పంబులకుఁ దాత్కాలికదీన భావంబు నాపాదించి సమయానుకూలంబుగ సాంత్వనాలాపంబులు పలుకుచుఁ బ్రార్థించుచుండునంతలో నలగామరాజు పట్టపుటేనుఁగు నుండి దిగి పాదచారియై బ్రహ్మనాయని చెంతకు వచ్చి దీనవదనము తో నాతనికిఁ బాదాభివందనంబు గావించెను. బ్రహ్మనాయఁడు శోకగద్గదస్వరముతో "శుభమస్తు" అని దీవించెను.

అప్పుడు నలగామరాజు దుర్భరహృదయశోకముతో నేమియు మాటాడఁజాలక నాయకు నొకకేలను, నాయకురాలి నొకకేలను గాఁగిలించుకొని కన్నీరు విడుచుచు నిరువురినిగూడఁ దనయేనుఁగుపై నిరువంకలఁ గూర్చుండఁజేసికొని రణరంగమునుండి రాజధాని కభిము ఖుండై మరలెను.

బ్రహ్మనాయఁడు గాని నాయకురాలు గాని మాఱుమాట పలుకలేదు. హతశేషబలంబులు మంత్రిసహితుండగు మహారాజు మదగజంబును బరివేష్టించి పురాభిముఖులై కదలిరి. ఆసైనికులలో సమరవిజయధ్వానకోలాహలంబులు లేవు. భేరిదుందుభితూర్యారావం బులును లేవు. ఆవీరశేఖరుల వదనమండలంబులయం దొక్క యానం

దచిహ్నమైనను నగపడుట లేదు. వారల్లే నిరాడంబరముగ, నిరుత్సాహముగ, నిశ్శబ్దముగ బయలుదేఱి పోయి యారాత్రియే రెండుజాముల వేళకు రాజధానియగు గురిజాలం బ్రవేశించిరి.

ఈరీతిగా వారేగినంతనే పౌలికల నంతియు భూతప్రేతపిశాచాములచే నాక్రాంతమై, ప్రళయభీషణారావంబులచేఁ బ్రతిధ్వనితమై, యాలోకభీకరంబును, నసహ్యంబు నైపోయెను.

---

# పరిశిష్టము.



ఈవిధముగాఁ బలనాటివీరయోధుల ప్రతాపవిజృంభణమునకుఁ బరస్పరవినాశనమే ప్రతిఫల మయ్యెను. నాయకునకుఁగాని, నాయకురాలికిఁ గాని, నలగామరాజునకుఁగాని విజయము లభింపలేదు. సాహసికులగు వీరనాయకు లందఱును జయాపజయములను లక్ష్యము సేయకుండ సంగ్రామరంగంబున శరీరంబుల విడిచి శాశ్వతస్వర్గలోకావాసంబుఁ గాంచిరి. అట్లు చావఁగా మిగిలిన జనులనందఱను బాలించుభారమంతయును నలగామభూపాలునిమీఁదనే నిలిచిపోయెను. అపలనాటిసీమకంతకు నెప్పటివలె నాఁతడే యధినాథుఁడయ్యెను.

కాని యాతనియుత్సాహమంతయును జచ్చిపోయినది. ఆశయంతయు నడుగంటిపోయినది. చావక బ్రదికియుండుటచే సార్వభౌమత్వముమాత్ర మాతనికిఁ దప్పినదిగాదు. మహారాజును నాయకురాలును గలసి బ్రహ్మనాయని నెప్పటివలె మంత్రికార్యనిర్వాహణంబు గావింపవలయు నని బహుప్రకారంబుల బ్రతిమాలుకొనిరి. రాజపరివారంబును, బ్రజలునుగూడ నేకవాక్యంబుగ నాతని నర్థించుటయు బ్రహ్మనాయఁ డనుగురాజ వాక్యంబులఁదలంచి యాతనియనుజ్ఞ యవశ్యకర్తవ్యం బని నిశ్చయించుకొని యెట్టకేలకు మరల మంత్రిపదంబును స్వీకరించెను.

అట్లంగీకరించి బ్రహ్మనాయఁడు సభారంగమున లేచి నిలువఁబడి « ఓమహారాజా! నేనొక్కవిన్నపంబు గావించెదను. సావధానముగఁ జిత్తగించి మన్నింపవలయును. అనివార్యంబు లగు కారణాం

తేరములచే దటస్థించిన యీఘోరసంగ్రామంబునందు సాహసికులై విజృంభించి పలనాటివీరశిరోమణులందఱును ఖండనద్వారంబునఁ బరమగతులై పోయిరి. ఈసంఘమరణంబున కంతకును నేనే విధి నైతిని గదా యనువిచారము నన్ను బాధించుచున్నది. అట్లు ప్రచండప్రతాపంబులు దీపింపఁ బ్రధనవిక్రములై వీరఖేలనంబు గావించి వీరస్వర్గంబు చూరగొన్న వీరాగ్రగణ్యులనుద్దేశించి మనరాజ్యమందంతటను బ్రజలెల్లరు నేఁటేఁట వీరారాధనంబు గావించునట్టి యేర్పాటు నొనరింపఁగోరెదను. ప్రజలను వీరారాధనాతత్పరులం గావించుట రాజన్యులకు సర్వశ్రేయోదాయక మగుప్రధానకృత్యమై యున్నది. ఇట్టి వీరపూజలు పవిత్రచరిత్రులగు మహావీరులకీర్తిప్రతిష్ఠలను శాశ్వతముగఁ బ్రవర్తించుచుండుటయే కాక ప్రజలలో నుత్సాహమును వర్ధిల్లఁజేయుచు నట్టి వీరవిహారస్థానంబగు జన్మభూమియందు గౌరవాభిమానములను గల్పింపఁగలవు. వీరార్చనంబులు వీరప్రసవకారణంబులు గావున నవి మహారాజులకు బలగౌరవసంపాదకంబులు గాఁగలవు. కావున నట్టి యేర్పాటు గావింపవలయును" అని ప్రార్థించెను.

ఆమాట లాలించి నాయకురా లుత్సాహముతో "ఏఁటేఁట తప్పకుండ నిట్టియుత్సవంబులు దేశమంతటను గావింపవలసినదే. ఆత్మశాంతిని, ఆత్మోత్సాహమును, ఆత్మగౌరవమును, ఆత్మదేశాభిమానమును వర్ధిల్లఁజేయుటయందంతకంటెఁ బ్రధానకర్మములు మఱియొండు లేవు" అని యుగ్గడించెను.

అప్పుడు నలగామరాజు నాయికయుపదేశముల నంగీకరించి యుత్సాహసూచకస్వరముతో "ప్రతిసంవత్సరమునందు నీకార్తికమాసములోనే కారెముపూడి రణక్షేత్రమునందు శాశ్వతముగా పేరాచారముల పేరితో వీరపూజలను, వీరోత్సవములను జరిగించుచుం

శాశ్వతముగాఁ గొంతమూలధనమును బ్రతిష్ఠించెదను. దేశమందంతటను గూడ నీమాసమునందే వీరారాధనము లాచరింపవలయు నని ప్రజలకు నాజ్ఞాపించెదను" అని చెప్పుచు లేచి నిలువఁబడి "ఓ నా ప్రజలారా! నేఁటిదినమున మనమందరము గలసి మహోత్సాహముతో గంగధారమడుగుచెంతకుం బోయి యందుఁ బవిత్రస్నానంబు లాచరించి ప్రేమాంతఃకరణములతోఁ, భక్తిభావహృదయములతోఁ బవిత్రచరిత్రులగు మనపలనాటిమహావీరుల పరిశుద్ధాత్మలన్నియును బరితృప్తినందునట్లు భక్తిపూర్వకంబుగ నారాధింపవలయును. మఱియు నచ్చట మహాసమారోహముతో వీరోత్సవంబులు సాగింపవలయును. కావున మీరందఱు నిమ్మహాకార్యంబు నిరంతరాయముగ నిర్వహించుటకు సంసిద్ధులై యుండవలయును" అని యాజ్ఞాపించెను,

అప్పుడు సభయం దంతటను "మహారాజసార్వభౌమునకు జయ! మహామంత్రియగు బ్రహ్మనాయనికి జయ! మహాశక్తిస్వరూపిణి యగు నాయకురాలికి జయ!" అని ప్రజలందఱును మహోత్సాహముతో జయజయధ్వానములం గావింపఁదొడంగిరి.

మఱునాఁడు కారెమపూడిరణక్షేత్రమును పలనాటిప్రజలందఱును బూజనీయం బగు పుణ్యక్షేత్రముం బోలె సేవించిరి. వీరారాధనంబులు విధ్యుక్తముగ నిర్వహింపఁబడియెను. ఆనాఁటి వీరోత్సవములో వీరనాయకచరిత్రములతోఁ బాటుగ మహారాజగు నలగామని సాధుశీలమును, బ్రహ్మనాయని పౌరుషమును, నాయకురాలి దర్పమును బ్రశంసితంబు లయ్యెను.

---

దివ్యమైన పరిమళము ! అద్భుతమైన గుణము !!

# వాసంతిక

పువ్వులతో తయారుచేయబడిన తలనూనె—బజారు తల నూనెలకంటె వేయిరెట్లు మంచిది.—ఇందు చేర్చినది కొబ్బరినూనెగాని, స్పిరిటువంటి వైట్ ఆయిలు కాదు.

వాసంతిక—శిరోజముల నల్లబరచును.
వాసంతిక—తల వెండ్రుక లెదుగఁజేయును.
వాసంతిక—శిరో రోగములమాన్పును.
వాసంతిక—మెదడునకు చలువచేయును.
వాసంతిక—బుద్ధి వికాసమునిచ్చును.
వాసంతిక—బట్టతల శిరోజములదట్టముగ మొలపించును.

ఈ తైలము కొందరు శ్రీమంతులు, న్యాయవాదులు, విద్యార్థులు, వాడుకచేయుచున్నారు. వాసంతికనుపయోగించినవారు మరొక తైలము నెన్నడునుపయోగింపజాలరు—ఈ తైలము కొన్ని దివ్యమూలికల ప్రభావమునవన్నె కెక్కినది.

సీసాపోస్టేజిగాక రు 1-0-0. మాత్రమే.

# సంజీవినీ తైలము.

శోభి, బొల్లి, తామర, వ్రణములు, మొదలగు చర్మవ్యాధులను హరించుటకిది సంజీవియే.

పోస్టేజీకాక, సీసా-రు 0-8-0.

# అమృత రసాయనము.

సకలమేహములను నాశనము చేయును. వీర్యదోషములంబోగొట్టి రక్తపుష్టినిచ్చును. స్త్రీపురుషులు వాడవచ్చును. ఈరసాయన మొకసారి వాడిచూచినచో మంచిచెడ్డలు మీకే తెలియగలవు.

పోస్టేజిగాక సీసా రు 2-0-0.

సంజీవినీ కుటీరము, కాకినాడ.

# పురాణగ్రంథమాలిక, పిఠాపురము.

(తూర్పుగోదావరిజిల్లా.)

సంపాదకుఁడు:—నడకుదుటి వీరరాజుపంతులు.

ఇందు రెండుమాసముల కొకసంపుటముగా సంపుటము 1 కి 200—250 పుటలవంతున డెమ్మీసైజున పదునెనిమిదిపురాణములను, ఉపపురాణాదులను సంస్కృతమునుండి క్రమముగా వచనరూపమున నాంధ్రీకరించి సంవత్సరమున కాఱుసంపుటములుగాఁ బ్రకటించుచు నాంధ్రదేశమున మాయోపినకొలఁది భాషాసేవ నొనర్చుచుంటిమి.

(1) ఇందుఁ జందాదారులగువారు రు 0-4-0 ప్రవేశరుసుము చెల్లింపవలయును. (2) చందాదారులకు పోస్టేజి మేమేభరించి ఒక్కొకసంపుట మొకరూపాయకుమాత్రమే పంపుచుందుము. మనిఆర్డరు కమ్మిషన్‌తో రు 1-0-0 మాత్రమే యగుచుండును. (చందాదారులు కానివారికి పోస్టేజిగాక రు 1-8-0.)

ఇందు ప్రకటింపఁబడి వెలకు సిద్ధముగనున్న గ్రంథములు.

| | | చందాదారులకు పోస్టేజితో వెల. | ఇతరులకు పోస్టేజిగాక వెల. |
|---|---|---|---|
| 1 | శివపురాణము ౧ సం. | 1-0-0 | 1-8-0 |
| 2 | శివపురాణము ౨ సం. | 1-0-0 | 1-8-0 |
| 3 | శివపురాణము ౩ సం. | 1-0-0 | 1-8-0 |
| 4 | శివపురాణము ౪ సం. | 1-0-0 | 1-8-0 |
| 5 | శివపురాణము ౫ సం. | 1-0-0 | 1-8-0 |
| 6 | శివపురాణము ౬ సం. | 1-0-0 | 1-8-0 |
| 7 | శివపురాణము ౭ సం. | 1-0-0 | 1-8-0 |
| 8 | బ్రహ్మపురాణము ౧ సం. | 1-0-0 | 1-8-0 |
| 9 | బ్రహ్మపురాణము ౨ సం. | 1-0-0 | 1-8-0 |
| 10 | వామనపురాణము ౧ సం. | 1-0-0 | 1-8-0 |
| 11 | వామనపురాణము ౨ సం. | 1-0-0 | 1-8-0 |
| 12 | వామనపురాణము ౩ సం. | 1-0-0 | 1-8-0 |

వామనపురాణము సంపూర్ణగ్రంథము:—చందాదారులకు పోస్టేజీతో రు 2-8-0. ఇతరులకు పోస్టేజీగాక రు 4-0-0.

సంపాదకుఁడు, పురాణగ్రంథమాలికాకార్యస్థానము, పిఠాపురము.

# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయము.

( 1911 వ సంవత్సరములో స్థాపింపఁబడినది. )

## పి ఠా పు ర ము.

నవలలు—నవరసభరితములగునవలలు—పుణ్యచరిత్రములు. 200-250 పుటలకు మించకుండ—రెండుమాసములకొక్కటిగా వెలువడును.

చందాదారులసౌకర్యమునకై నవలలువెలలు తగ్గించేసి పోస్టేజి మేమే భరించి పూర్వపునిబంధనలీక్రిందివిధముగా మార్చినాము.

—♦ ని బం ధ న లు. ♦—

1. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా రు 0—4—0 చెల్లింపవలయును.

2. ఇందు రెండేసిమాసములకొక్కటిగ వెలువడుచుండుమంచి రేపరుబైండుగల ప్రతిగ్రంథమును పోస్టేజి మనిఆర్డరుకమీషనులు మేమేభరించి రు1-0-0కి మాత్రమే చందాదారులకుఁబంపుచుందుము.

3. చందాదారు లగువారు వెనుకటిగ్రంథములన్నియుఁ గొనవలయునను నియమములేదు. కాని వారు కోరినచో వెనుకటిపుస్తకములుకూడఁ జందాదారుల వెలలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

4. ఇందుఁ బ్రకటింపఁబడు అనుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

5. సంవత్సరముచందా అనఁగా ముందుప్రకటింపఁబడు ఆఱు పుస్తకములకు రు 5—4—0 లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకముల వఱకు ప్రతిపుస్తకమును అన్‌రిజష్టర్డుపార్సిలుగా పంపుచుందుము.